# వర్షంలో నక్షత్రాలు

## పిల్లల కథలు

2-00



"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

రష్యన్ నుండి అనువాదం: పుప్పల లక్ష్మణరావు

ЗВЕЗДЫ ПОД ДОЖДЕМ

рассказы для детей

на языке телугу

K. Siva Ram Prasad,
Senior Intermediate,
NO-425, C.E.C-I
Satavahana College
Vijayawada-3

11/9/79
(2-00)

# తొలి పలుకు

ప్రియమైన బాలమిత్రులారా!

హాస్యరసభరితములైన ఘటనలతో ఉల్లాసం కల్గించే కథలు చదువుతూ నవ్వుకుంటూండడం మీకెంతైనా ఇష్టం, అందులో ఏమీ సందేహంలేదు. అంతేకాదు, అటువంటి ప్రతి వొక్క కథలోనూ విజ్ఞానదాయకమైన విషయం కూడా వుంటుంది.

సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతుల ప్రజలకు ప్రతినిధులైన సుప్రసిద్ధ సోవియట్ రచయితలు వెలయించిన కథలూ కథనాలూ మీరు ఈ పుస్తకంలో చదవగల్గుతారు.

ఈ పుస్తకం చదువుతూన్నప్పుడు సోవియట్ దేశాన్ని మీరు సందర్శించుతూన్నట్టు మీకనిపించుతుంది. సోవియట్ బాలబాలికలు ఎలా జీవించుతూంటారో, ఎలా విశ్రాంతి తీసుకుంటూంటారో, వారిలో కొందరికి తమాషా తమాషా సాహసకార్యాలు ఎలా ఎదురవుతూంటాయో మీరు తెలుసుకుంటారు.

ఈ పుస్తకంలో ఉల్లాసకరములైన కథలు మాత్రమే మీకు తారసిల్లవు. కొన్ని కథల్లోనూ కథనాల్లోనూ పూర్తిగా గంభీరమైన విషయాలను గురించి — అసలైన మానవుడననిపించుకోవాలంటే తమ ఎలా ప్రవర్తించాలో, తను ఏ యే గుణాలను తనలో పెంపొందించుకోవలసి వుంటుందో — ప్రస్తావన వస్తుంది.

ఈ సంకలనంలో మొదటి కథ బాలసాహిత్య రచయితగా ప్రఖ్యాతిపొందిన నికొలాయ్ నోసొవ్ కలంనుండి వెలువడినది. ఇతని రచనల తెలుగు అనుసరణనలను మీరు బహుశా చదివే వుంటారు.

ఈ పుస్తకం మీకు ఆనందం కల్గించి, ఉపయోగకరంగా వున్నట్టయితే మేము ఎంతైనా సంతోషించుతాం. ఈ పుస్తకానికి చిత్రాలు పద్నాలుగేళ్ల అమ్మాయి ఓల్గా పుష్కరేవా వేసింది.

మీ అభిప్రాయాలను గురించీ, మీ కోర్కెలను గురించీ మాకు తెలియపరచండి. సెలవు!

"ప్రగతి" ప్రచురణాలయం.

మా చిరునామా:

*Progress Publishers,*
*21, Zubovsky Boulevard*
*Moscow. USSR.*

# విషయసూచిక

తోల్యా క్లూక్విన్ 36 వ నంబరు స్కూల్లో నాల్గో క్లాసులో చదువుకుంటున్నాడు. ఆ అబ్బాయి దెమ్యానొవ్స్కయా వీథి 10 వ నంబరు ఇంట్లోనుంచి వచ్చి, లొమొనోసొవ్స్కయా వీథి 14 వ నంబరు ఇంట్లో కెళ్లాడు. ఆ యింట్లో నివసిస్తున్నాడు తన నేస్తం స్లావ ఒగొన్‌కొవ్. ఆ రోజు ఉదయం కలుసుకుని చదరంగం ఆడదామని నేస్తులిద్దరూ నిన్న సాయంకాలమే ఏర్పాటుచేసుకున్నారు. చదరంగం ఆట అంటే ఇద్దరూ చెవి కోసుకుంటారు, మరి ఉదయంనుంచి సాయంకాలం వరకూ ఏకధాటిని ఆడగలరు కూడానూ.

తోల్యా ఆదరా బాదరా పరుగెత్తాడు, ఎందుచేతంటే తను పది గంటలకే వస్తానని తన నేస్తంతో ఖరారు చేశాడేమో అప్పటికప్పుడే పది గంటలు దాటిపోయింది. వేళపట్టున పనులుచేసే అలవాటులేని తోల్యా ఇంటిదగ్గర పూరకే ఇటూ అటూ తాచ్చాడాడే కాని, ఇంటినుంచి సరైన వేళకి బయల్దేరాడుకాదు. మరి సరిగ్గా అలాంటప్పుడే ఏదైనా అడ్డుగా రావడం మామూలు. ఎప్పుడైతే తొందరగా వెళ్లాల్సి వుంటుందో అప్పుడే వీథిలో ఏదో ఆటంకం ఎదురై ఆగిపోవాల్సి వస్తుంది. ఇప్పుడు కూడా సరిగ్గా అలాగే అయింది. తోల్యా వీథి చివరికి వెళ్లాడో లేనేలేదో, ఆ వీథిపక్కనున్న కంచెగోడమీదనుంచి బూడిదెరంగు పిల్లి వొకటి తటాలున గెంతేసి తోల్యా దారికి అడ్డుగా పరుగెత్తాలనే స్పష్టమైన ఉద్దేశంతో వాడికి ఎదురుగా నించుంది.

''ఛీ! పో ఇక్కడ్నుంచి, ఫో! పోతావా లేదా?'' అని తోల్యా చర్రున కేకేసి, దాన్ని భయపెట్టేందుకని రోడ్డుమీద వున్న రాయి ఏరుతూన్నట్టు నటించుతూ వంగున్నాడు.

ఇది చూసి పిల్లి నిజంగానే భయపడింది. కాని భయపడి వెనక్కి పారిపోవడం బదులు, అది చెంగున రోడ్డుకడ్డంగా పరుగెత్తి, వీథి రెండో వరుసలో సరాసరి ఎదురుగా వున్న ఇంటి గుమ్మంలో దూరి, ఆ గుమ్మం వెనుక మాయమైపోయింది.

''అసి, నీకొచ్చిన పోయిగాలం!'' అని తోల్యా చికాకుపడి గొణుక్కున్నాడు.

తోల్యా ముందుకు అడుగువేయకుండా అక్కడే నించుండిపోయి ఆలోచించుకున్నాడు: ఏది మంచిది — ముఖం వెనక్కి తిప్పి బుజంమీదనుంచి 'థూ!' అని ముమ్మాటు కాండ్రించి వుమ్మేసి తన దారిని తను ముందుకు వెళ్లిపోవడమా, లేకుంటే వెనక్కి తిరిగిపోయి మరో వీథిలోనుంచి వెళ్లడమా? అని ఆలోచించుకుని, నాలుగు వైపులా పరకాయించి, తననెవ్వరూ చూడలేదని నమ్మకం తోచి, మరో వీథివెంట వెళ్లడమే ఏమైనా సరే మంచిదని, వెనక్కి తిరిగిపోవడానికే నిశ్చయించుకున్నాడు.

''నేను ముమ్మారు ఉమ్మేసినా లాభం లేదు'' అని తర్కించుకున్నాడు తోల్యా తనలో. ''దారికడ్డంగా వెళ్లనే వెళ్లింది పిల్లి, నేను ఉమ్మినా ఉమ్మకపోయినా.... నిజం చెప్పాలంటే, పిల్లి వెళ్లిందంటే దానిలో అర్థమేమీ లేదు, బహుశ ఏమీ వుండకూడదు కూడా. దానికేం! పోనీ వెనక్కి తిరిగి ఇంకో దారంట వెళ్తేనే తీరిపోతుంది! చెయ్యబోయే పనుల్లో ఏ పనైనా దండగై వూరుకుంటుందేమో!''

తోల్యా ఇలా తర్కించుకుని తన ఇంటికే మళ్లీ వచ్చేసి, వీథి చివరినుంచి ఒక సందులోకి మళ్లాడు. ఈ సారి తనకి మళ్లీ మరే విశేషమూ తటస్థపడకుండా లొమొనోసొవ్స్కయా వీథిలో అడుగుపెట్టాడు. ఆ వీథిలోకెళ్లి చూసేసరికి, ఎవడో కుర్రాడొకడు 14 వ నంబరు ఇంటి గుమ్మంలోనుంచి బైటకిరావడం తోల్యాకి దూరంనుండి అవుపడింది. ఆ కుర్రాడు స్లావ ఒగొన్‌కొవ్ లాగే అవుపడ్డాడే అని తోల్యా మొదట అనుకున్నాడు. తరువాత

మళ్ళీ అనుకున్నాడు, అబ్బే, అలా అవుపడ లేదే అని. గుమ్మంలో నించున్న కుర్రాడు ఈలోపున ఏమిటి ఆలోచించుకున్నాడో మరి, తోల్యాకేసి వీపు తిప్పేసి చకచక అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు.

''సరే'' అనుకున్నాడు తోల్యా. ''మేడమెట్లెక్కి స్లావ దగ్గరకెళ్తాను. ఇకప్పుడంతా తేలిపోతుంది. స్లావ ఇంట్లో వుంటే, దాని అర్థం వాడు వాడుకాడన్నమాట. వాడు ఇంట్లో లేకపోతే, అప్పుడు – వాడు వాడన్నమాటే.''

అలా అనుకుని తోల్యా లిఫ్టు ఎక్కి నాల్గో అంతస్తుకెళ్ళి, 31 వ నంబరు ఫ్లాటు బెల్ బటన్ నొక్కాడు. స్లావ తల్లి తలుపుతీసింది.

''స్లావ ఇప్పుడే ఈ క్షణమే వెళ్ళాడు సుమా వీథిలోకి. నీకు అవుపడలేదూ వాడు?'' అని అడిగింది.

''లేదు, అంటే దూరంనుంచి అవుపడ్డాడు. వాడు కాడని అనుకున్నాను. నా కోసం తను వుంటానన్నాడే మరి?''

''నీకోసం చాలాసేపే వున్నాడు సుమా. నువ్వు రాలేదని వాడికి కోపం వచ్చింది కూడానూ. తరువాత, జేన్య జైత్సెవ్ ఫోన్‌చేస్తే, వాడితో స్లావ: 'నీ దగ్గరకొస్తా(న్రా' అని చెప్పి, జేన్యయింటికి బయల్దేరాడు.''

''అంతా బగ్గంపాడైంది! ఏమీ, ఒక్క నిమిషం ఆగలేకపోయాడు కాంసు!'' అన్నాడు తోల్యా. వాడు స్లావ తల్లిదగ్గర సెలవుతీసుకుని గబగబ మెట్లు దిగిపోయాడు.

తోల్యా గుమ్మంలోకొచ్చి, వీథిలోకి ఇటూ అటూ చూసి, ఒక్క క్షణం గుమ్మంలో ఆగి, ఏమిటి చేయడమా అని ఆలోచించుకుని, తరువాత తను కూడా జేన్య జైత్సెవ్ ఇంటికే బయల్దేరాడు. జేన్య యిల్లు వూరు చివరనుంది. లొమొనోసొవ్‌స్కయా వీథినుంచి అక్కడికి వెళ్ళడమంటే, అబ్బో – ఎంతో దూరమన్నమాట. తోల్యాకి ఇప్పుడిహ తొందరపడడం అవసరం లేకపోయింది. వాడు దిక్కులు చూసుకుంటూ దారిలో కనబడినవన్నీ పరిశీలించుతూ నడక సాగించాడు. సువోరొవ్‌స్కియ్ తోటవీథి దగ్గరకొచ్చేసరికి అక్కడ ఓసారి ఆగాడు - అక్కడ చిన్నకుర్రాళ్ళు కొందరు సైకిలు తొక్కడం నేర్చుకుంటున్నారేమో, అది చూద్దామని.

అక్కడ నలుగురు కుర్రాళ్ళున్నారు. వాళ్ళలో ఒక్కడికైనా సైకిలు తొక్కడం రాదు. అందుచేత వాళ్ళు సైకిలు ఎక్కి తొక్కడం బదులు సైకిలు ఎక్కి కిందపడుతున్నారు. ఇక్కడ ఒక సంగతి చెప్పాల్సి వుంది. ఈ సైకిలు అలవాటులేనివాళ్ళకి దీన్ని తొక్కడం చాలా కష్టం. ఎందుచేతంటే ఇది మామూలు రకం సైకిలు కాదు. దీని మెకానిజమే వేరు. మామూలు సైకిలు కాస్త జోరుగా వెళ్ళేవరకూ పెడల్సు తొక్కితే, ఆ తరువాత మరికొంత సేపటివరకూ పెడల్సు తొక్కానవసరంలేదు, సైకిలు దానంతట అదే వెళ్ళిపోతుంది, పెడల్సు మాత్రం తిరగకుండా వుండిపోతాయి. ఈ సైకిలు అలాక్కాదు, దీనిమీద ఎక్కిన తరువాత పెడల్సు అస్తమానూ తొక్కాల్సిందే. సైకిలు జోరుగా వెళ్తున్నప్పుడు వాటినిహ తొక్కడం అవసరంలేకపోయినా వాటంతట అవి తిరిగి పోతూనే వుంటాయి. అది పాత రకం సైకిలు అవడమే దీనికి కారణమై వుండొచ్చు. ఆ యింట్లో వున్న ఒకతను ఆ కుర్రాళ్ళను పిలిచి: ''దీన్ని మీరు తీసుకోండి'' అని ఈ సైకిల్ని వాళ్ళకిచ్చేశాడు.

అతని పేరు ఇవాన్ గెరాసిమొవిచ్. అతడు ఇంకా చిన్నపిల్లడుగా వున్నప్పుడు అతని తండ్రి అతనికి ఈ సైకిలు కొని ఇచ్చాడు. తరువాత ఇవాన్ గెరాసిమొవిచ్ పెద్దవాడయాక అతడు తనకోసం కొత్తరకం ఇప్పటి మోస్తరు సైకిలు పెద్ద సైజుది స్వయంగా కొనుక్కున్నాడు. ఈ పాత సైకిల్ని షెడ్డులో పెట్టి దాచేశాడు.

ఎప్పుడో ఒకనాడు పెళ్ళిచేసుకుంటాను కదా, పిల్లలు పుడతారు, అప్పుడు వాళ్ళకి ఈ పాత సైకిలు ఇవ్వొచ్చు అనుకున్నాడు. కాని అతడలా అనుకుని అప్పుడే పాతిక ముప్పై య్యేళ్ళు గడిచిపోయాయి. ఇవాన్ గెరాసిమొవిచ్ పెళ్ళిచేసుకోలేదు. మరి ఈ సైకిలు మాటే మరచిపోయాడు. సరి, ఈమధ్య ఓనాడు అతడు షెడ్డులో వున్న సామాను సర్దుతూ, అందులో చేరిన పాత చెత్త అంతనీ పారేస్తూండగా ఈ సైకిలు అగుపడింది.

''దీన్ని యేంచెయ్యడం?'' అని ఆలోచించాడు ఇవాన్ గెరాసిమొవిచ్. ''ఈ యింటి ముంగిట్లో ఆడుకుంటూన్న కుర్రాళ్ళకి ఇచ్చేద్దాం. నాకు పిల్లలు లేరు కదా — ఎవరైనా వొకటే. మీదటికి వొకవేళ పెళ్ళిచేసుకుంటానే అనుకున్నా, అప్పటికి ఈ సైకిలు తుప్పట్టిపోయి తూట్లు పడిపోతుంది, అప్పుడు పారేనా పారేయాలి, లేదా రద్దు ఇనుంకింద ఇచ్చేనా ఇచ్చేయాలి.''

ఇవాన్ గెరాసిమొవిచ్ సైకిల్ని షెడ్డులోనుంచి పైకి ఎక్కలాగి కుర్రాళ్ళను పిలిచి అన్నాడు:

''ఏమ్రా పిల్లపిశాచాలూ! ఈ సైకిలు చూడండ్రా! ఇదేమంత అందంగా లేదనుకోండి. అయినా రాయిలా వుంది. చిన్నప్పుడు దీనిమీద నేను ఎక్కి తిరిగినా ఒక్క స్పోక్ అయినా విరగలేదు. సరే ఆ కథంతా ఇప్పుడెందుకులెండి. దీన్ని తీసుకుపోయి ఎక్కండ్రా మీరు! ఊఁ, చూస్తారేమిటి, కానీయుండి!''

కుర్రాళ్ళు ఆ మాటలు విని అత్యాశ్చర్యపోయారు. తమకి సైకిలు కానుకగా ముట్టిందన్న సంగతి నమ్మలేకపోయారు. కాని ఇవాన్ గెరాసిమొవిచ్ వేళాకోళం ఆడడంలేదని వాళ్ళు కాస్సేపయాక తెలుసుకుని, ముంగిట్లో సైకిలు తొక్కడానికి ప్రయత్నించారు. కాని ముంగిలంతా పెద్దపెద్ద గోడురాళ్ళతో చపటాచేసి వుండడంచేత అక్కడ సైకిలుమీదనుండి తిరగబడితే ఒళ్ళు మహా నొప్పిపెట్టేది. అందుకని వాళ్ళు తోటవీథిలోకి వెళ్ళి అక్కడ తొక్కడం మొదలెట్టారు. ఇక్కడ చూశాడు తోల్యా ఆ కుర్రాళ్ళని. కుర్రాళ్ళు సైకిలు తొక్కుతూ సైకిలుమీదనుంచి కిందకి ఎలా బోల్తాకొడుతున్నారో తోల్యా గమనించి వాళ్ళతో ఇలా అన్నాడు:

''ఒరేయ్ నాగమ్మలూ! ఇలాగైతే మీరు సైకిలు తొక్కడం నేర్చుకున్నట్టేరా! మొగాలు చితక్కొట్టుకోవడం తప్ప మరేమీ రాదురా మీకు! సైకిలు తొక్కడం నేర్చుకోవాలంటే దిబ్బమీద కెళ్ళి నేర్చుకోవాలి.''

''దిబ్బమీద కెందుకూ?'' అని కుర్రాళ్ళు ఆశ్చర్యపడి అడిగారు.

''ఎందుకంటే, సైకిలుమీద కూచుని దిబ్బమీదనుండి దిగేప్పుడు, స్లోపుగా వుంటుంది కనక సైకిలు దానంతట అదే ముందుకు వెళ్ళిపోతుంది, పెడల్సు తొక్కక్కర్లేదు, బాలెన్సుచేయడం నేర్చుకోవచ్చు. బాలెన్సు చేయడం ఎప్పుడైతే నేర్చేసుకున్నారో, ఇహప్పుడు పెడల్సు తొక్కడం నేర్చుకోవచ్చు. అదీ యిదీ వొక్కసారే నేర్చుకుందాం అనుకుంటే మాత్రం ఏదీ నేర్చుకోలేరు, ఏమీ లాభం వుండదు'' అన్నాడు తోల్యా.

ఆ కుర్రాళ్ళలో వొకడు అన్నాడు:

''తోటవీథిలోనుంచి ఇంకా ముందుకి వెళ్తే అప్పుడు రోడ్డు ఎక్కి సరాసరి దిబ్బమీదికెళ్ళొచ్చు.''

సరి, అందరూ పరుగెత్తారు దిబ్బమీదకి. దిబ్బ చేరుకున్నారే కాని, దిబ్బమీదనుంచి సైకిలు తొక్కేందుకు ఎవ్వరికీ ధైర్యంలేకపోయింది.

''ఏం పిరికిపందల్రా మీరు! ఇదిగో, సైకిలు ఇలా ఇవ్వండ్రా నాకు. సైకిలు ఎలా తొక్కడమో చూపిస్తాను మీకు!'' అన్నాడు తోల్యా.

తోల్యా సైకిలుమీద కూచుని, కాలితో నేలను నెట్టాడు. సైకిలు స్లోపు దిగడం మొదలెట్టింది. వాడికి సైకిలుతొక్కడం కొద్దిగా వచ్చు. అదేమంత కష్టమనిపించలేదు. కుర్రాళ్లందరూ గుంపుకూడి, సైకిలుమీద వెళ్తూన్న తోల్యావెంట లొడలొడ పరుగెత్తారు, సైకిలుతో పాళంగా తోల్యా ఎక్కడ ఉడాయిస్తాడో అని వాళ్ల కప్పుడే భయంవేసింది. ఈ లోపున సైకిలు అంతకంతకు మరింత మరింత జోరుగా పరిగెత్తుతూంది. పెడల్సు ఎంత వేగంగా తిరిగిపోతున్నాయంటే, వాటితో సమంగా తోల్యా తన కాళ్లను మీదకీ కిందకీ ఆడించలేకపోయాడు. పెడల్సుమీదనుంచి పాదాలు తీసివేయవలసి వచ్చింది. పెడల్సు మాత్రం అలా గిరగిరా గిరగిరా తిరిగిపోతూనే వున్నాయి, తిరిగిపోతూ తోల్యా ముంగాళ్లను ఫడా ఫడా బాదుతూనే వున్నాయి. ఇహప్పుడు తోల్యా తన కాళ్లను ఈవైపూ ఆవైపూ వెడల్పుగా పంగజాపుకొన్నాడు, సైకిలు మాత్రం హడలెత్తించేంతటి జోరుతో పరుగెత్తుతూంది. ఇలా సైకిలు దిబ్బమీదనుంచి ఝామని దిగిపోతూండగా, సైకిలుమీద కూచున్న తోల్యా తటాలున చూశాడు — తన దారికి సరాసరి ఎదురుగా తోటవీథి నట్టనడాన పసిపిల్లలు ఆడుకుంటూండడం. తన సైకిలు ఆ పసిపిల్లను తోసుకుని వెళ్లిపోకుండా వుండేందుకని తోల్యా సైకిల్ని ఓ పక్కకి గిర్రున తిప్పేయడానికి నిశ్చయించుకున్నాడు. వాడి అదృష్టంకొద్దీ తోటవీథి కంచెకి సరిగ్గా ఆ చోటనే చిన్న గేటు తెరిచి వుంది. సైకిలుమీద కూచున్న తోల్యా ఆ గేటులోనుంచి దూసుకుపోయి క్షణంలో రోడ్డు దాటేసి అక్కడున్న ఇంటి గేటులోనుంచి ముంగిట్లోకి సైకిలుమీద సర్రున వెళ్లిపోయాడు.

ముంగిట్లోకి ఎంత ఝోరుగా వెళ్లిపోయాడంటే మెరుపు మెరిసినట్టే వెళ్లిపోయాడు. అలా దూసుకుపోయి తోల్యా ఆ యింటి పెరట్లోకి చొరబడి, కంచెకి దగ్గరగా దుక్కలా వున్న ఇనుప బెంచిని తన సైకిలు ముందు చక్రంతో గొప్ప ఝోరుతో ఢీకొన్నాడు. ఆ దెబ్బతో సైకిలు, అచ్చంగా గుర్రంలా, ముందుచక్రంతో పైకి లేచినిలబడిపోయింది. తోల్యా సాడిలుమీదనుండి గెంతేసి, సర్కస్‌లో మొగ్గలేసేవాడిలా రెండు కాళ్ళూ పైకెత్తి చెంగున కంచె దూకేశాడు. ఆ పల్టీకొట్టడంలో పక్కింటి ముంగిట కంచెవారనున్న చెత్తడబ్బాలోకెళ్లి పడ్డాడు.

ఇదంతా ఎంత త్వరగా జరిగిందంటే, ఆ చెత్తడబ్బాలో తను ఎప్పుడు పడ్డాడో ఎలా పడ్డాడో తోల్యాకి జ్ఞాపకమే లేకపోయింది. చెత్తడబ్బాలో పడడంలో దాని మూతకి పొడుచుకొస్తూన్న మేకుకి వాడి షర్టు తగులుకుని, షర్టు వీపు పర్రున చిరిగిపోయింది. ఆ ఎగిరిపడడపు జోరును ఇది కొంతవరకు ఆపుచేసింది. దీనికి తోడు, మెత్తని చెత్తకుప్పమీద పడడంచేత ఇది అదటు బలిమిని గణనీయంగా తగ్గించింది. అందుచేత చిట్టచివరి క్షణంలో తోల్యా నుదురు చెత్తడబ్బాకి తగులుకుని చిట్లిపోవడం గనుక లెక్కలోకి తీసుకొనకపోయినట్టయితే, వాడి అదృష్టం పండి అంతా సవ్యంగా జరిగిపోయిందనే చెప్పొచ్చు.

తోల్యా స్మారకం తెచ్చుకుని నుదురు చిట్లిన చోట చేత్తో తడుముకు చూసుకుని, తనకక్కడ గీసుకుపోయిందో లేక ఒరిసిపోయిందో అనుకున్నాడు.

నుదురు చిట్లిన చోట చేతిరుమాలు అదిమిపెట్టుకుని, ఇప్పుడు తను ఎక్కడ పడివున్నదీ ఊహించి తెలుసుకుందుకు ప్రయత్నించుతూ తోల్యా నాల్గు దిక్కులూ పరకాయించాడు.

సైకిలువెంట పరుగెత్తిన కుర్రాళ్లు తమ శక్తి అంతటితోనూ పరుగెత్తినా, వాళ్లు బాగా వెనక్కి వుండిపోయారు. అయినప్పటికీ, సైకిల్ని తోల్యా తోటవీథికి మళ్లించడమూ, వాళ్లకి తెలియని ఒక యింటి గేటులోకి

సైకిలుమీద వున్న తోల్యా మాయమైపోవడమూ వాళ్ళు చూడగల్గారు. వాళ్ళు అలోపాలోమని పొలికేకలు పెట్టుతూ చిట్టచివరకి ఆ యింటి ముంగిట్లోకి పరుగెత్తి, కంచెవార పడున్న సైకిలు చూశారు. సైకిలు చోరీపోకుండా అక్కడ వుండడమూ, కాని తోల్యా మాత్రం అవుపడకుండా ఎక్కడికో మాయమైపోవడమూ చూసి, కుర్రాళ్ళు ఆ యింటి ముంగిట్లోకి పరుగెత్తి అన్ని మూలలా వెతికి చూశారు.

''అబ్బాయ్, అబ్బాయ్!'' అంటూ వాళ్ళు అరవడం మొదలెట్టారు.

కాని తోల్యాదగ్గరనుండి ఏ ప్రత్యుత్తరమూ లేదు. తోల్యాకి సైకిలు తొక్కడం బహుశ ఇక ఇష్టంలేక ఇంటికెళ్ళిపోయుంటాడనే వాళ్ళనుకున్నారు. వాళ్ళు సైకిలు తీసుకుని మళ్ళీ తోటవీథిలోకి వెళ్ళిపోయారు.

చెత్తడబ్బాలో పడున్న తోల్యా కుర్రాళ్ళ కేకలు విన్నాడు, కాని తనను పేరుపెట్టి పిలవకపోవడంచేత ఇంకెవడినో పిలుస్తున్నారనే నిశ్చయించుకున్నాడు. చెత్తడబ్బాలోనుంచి బయటికి నలుమూలలా కలియజూడగా, తను ఏచోట పడున్నదీ తోల్యాకి చిట్టచివరకి స్పష్టమైంది. అటువంటి చోట — ఆ చెత్తడబ్బాలో — ఇంకా అలా పడుండడం తోల్యాకి ఏమాత్రం మనస్కరించలేదని వేరే చెప్పనవసరంలేదు: నుదురు గీసుకుపోయిన చోటనుంచి ఇహ రక్తం కారడంలేదన్న సంగతి నిశ్చయంచేసుకుని చేతిరుమాలు జేబులో పెట్టేసుకుని, చెత్తడబ్బాలోనుంచి బయటకు దిగిపోయాడు.

ఎదురుగా చెట్లున్నాయి. చెట్లమధ్యనుంచి ఓ యిల్లు అవుపడింది — గోడకి ఎత్తైన ఆర్చి. ఆర్చికిందనుంచి వెళ్తే వీథిలోకి వెళ్ళిపోవచ్చుకదా అనే ఆశతో తోల్యా దానికిందనుంచి ముక్కుసూటిగా వెళ్ళాడు. కాని వీథిలోకి చేరుకోవడం బదులు మరో ఇంటి ముంగిట్లోకి వెళ్ళాడు. తోల్యా వచ్చినచోటకంటె ఇక్కడ అవుపడిన దృశ్యం ఎంతో రమణీయంగా వుంది. ముంగిట నట్టనడుమ మంచి పూతలో వున్న చీనాచేమంతులూ, డాహ్లియాలూ, గాఢమైన రంగులతో చిన్నచిన్న దీపాల్లా ప్రకాశించుతూన్న నస్తర్షియాలూ వున్న బ్రహ్మాండమైన గుండ్రని పూలమడి ఎత్తుగా లేచివుంది. పూలమడికి కాస్త దూరంగా ఇసుక కుప్ప వుంది. ఇసుక కుప్పకి నలువైపులా నీలిరంగు చెక్కపలకలతో కట్టిన పొట్టి కంచె వుంది. ఇసుక కుప్ప చుట్టూ ఎవరో గాని చక్కని పిల్లలు నిశ్శబ్దంగా కూచుని ఇసుక బజ్జీలు చేసుకుంటున్నారు. పిల్లలు తేటరంగుల గౌన్లూ, సూట్లూ వేసుకున్నారు. దూరంనుంచి చూసేసరికి, ఆ పిల్లలు కూడా పువ్వులే కాబోలు అనిపించింది. ఇసుక కుప్పకి ఇటూ అటూ, ఎక్కడా పొట్టీ పొడుగూ లేకుండా ఒకే ఎత్తుకి సరిసమానంగా కోసిన పచ్చని పసరిక మళ్ళున్నాయి. పసరిక మళ్ళకు దగ్గరగా సదుపాయమైన బెంచీలున్నాయి. వాటిపైన కూచున్నారు పిల్లల తల్లులు. ఆ స్త్రీలు వారిలో వారు మెల్లగా మాట్లాడుకుంటున్నారు, పుస్తకాలు చదువుకుంటున్నారు, పిల్లలు ఒకరి కళ్ళల్లో ఒకరు ఇసుక జల్లుకోకుండా బుద్ధిగా ఆడుకునేటట్టు పిల్లలమీద ఒక కన్ను వేసి చూస్తున్నారు.

బెంచీలకు వెనుకగా ఒక వాలీబాల్ కోర్టు వుంది. తాడుతో అల్లిన నెట్టు కోర్టుకి అడ్డుగా కట్టివుంది. కొందరు పెద్దపిల్లలు — మొగపిల్లలూ ఆడపిల్లలూ — వాలీబాల్ ఆడుతున్నారు.

ముంగిలి బాగా పెద్దదీ, విశాలమైనదీనీ. ముంగిలి నలువైపులా బాల్కనీలు వున్న ఇంటి భవంతులున్నాయి. బాల్కనీల అంచులనున్న పువ్వులచెట్లు ఎంతో ముచ్చటగా కనబడుతున్నాయి. తన కళ్ళ పడిన దృశ్యాన్ని మెచ్చుకుంటూ తోల్యా అక్కడ అప్రయత్నంగా నించుండిపోయాడు. ఆ పువ్వులు, పచ్చని పసరిక మళ్ళు, ఆ పిల్లలు, వాలీబాల్

నెట్‌మీదనుంచి గాలిలో తేలుతూ పరుగులు తీస్తూన్న ఆ పెద్ద తోలుబంతి – అదంతా మహాద్భుతంగా కానవచ్చింది.

''ఆహా! ఈ ఇంట్లో నేను వుంటేనో! రోజా పువ్వులకేసీ, పిల్లలు ఆడుకుంటూన్న ఇసుక కుప్పకేసీ తనివితీరా చూసి ఆనందించేవాణ్ణికదా! ఈ అబ్బాయిలతోనూ అమ్మాయిలతోనూ వాలీబాల్ ఆడుకునేవాణ్ణి కదా!'' అనుకున్నాడు తోల్య.

తోల్య విచారంతో నిట్టూర్చాడు. సరిగా ఆ సమయానికి, తమతో కూడా ఆడుకుందుకు రమ్మనమని వాలీబాల్ ఆడుతూన్న పిల్లల్లో ఓ అమ్మాయి తోల్యని ఆహ్వానించుతూ వాడికేసి చేయి వూపింది. తోల్య అక్కడికి భయపడుతూ వెళ్లాడు, కాని రెండు మూడు నిమిషాల్లోనే తోల్య తన కొత్త స్నేహితులతో పూర్తిగా కలిసిపోయాడు. వీళ్లు తనకి కొత్తవాళ్లు కానట్టూ, వీళ్లతో తనకి వెయ్యేళ్లనుండీ పరిచయం వున్నట్టూ వాడికనిపించింది. ఐదు నిమిషాలు గడిచేలోపున, తోల్య తనంతట తనే చొరవతీసుకున్నాడు: ఆట చేతులు మారవలసి వచ్చినప్పుడు ఆజ్ఞ జారీచేసేవాడు, ''ఔట్,'' ''నెట్ బాల్'' వంటి బుద్ధికందని పదాలు ఉపయోగించుతూ, ''వెధవ ఆట ఆడావ్!'' అని తిడుతూ పెద్దగా అరిచేవాడు. తనమట్టుకు తను ఈ ఆట తాలూకు రూల్సును ఏమంత ప్రత్యేకంగా పాటించకపోయినప్పటికీ, తను మాత్రం వాళ్లందరికీ ఆ రూల్సు నేర్పాడు. ఆటంతా చిట్టచివరకి ఎలా ముగిసిందంటే: నెట్టుమీదనుంచి బాగా కిందకి దిగిన బంతిని తోల్య చేత్తో ఎత్తలేక కాలితో కొట్టాడు. ఆ కొట్టడంలో తోల్య అనుకోకుండానే ఎంత జోరుగా కొట్టాడంటే బంతి ఝామని సూటిగా ఎగిరి వెళ్లి, ఎదురుగా వున్న భవంతి రెండో అంతస్తు కిటికీకి తగిలింది. కిటికీ అద్దం ఫెళఫెళమంటూ ముక్కముక్కలై కిందపడి పోయింది. అదృష్టవశాత్తూ బంతి మాత్రం ఆ పక్కనే పడింది.

తోల్య బుర్రలో మెదలిన తొలి ఆలోచన పిక్కసత్తువ చూపించి అక్కడ్నుంచి పారిపోదామని. కాని ఈ కోర్కెను వాడు బలవంతాన మనసులోనే అణచేసుకున్నాడు. పారిపోవడం తన చిత్తశుద్ధికి కళంకం తెస్తుందనుకున్నాడు. ఆ అద్దాన్ని విరగ్గొట్టింది తను కాకుండా ఆట ఆడుతూన్నవాళ్లలో ఇంకెవరో అని ఎవరైనా అనుకోవచ్చు కూడా. తోల్య ఇలా తలపోస్తూండగా, ఈలోపున ఆటగాళ్లలో ఓ కుర్రాడు కింద పడున్న బంతిని తీసి, దాన్ని గుండెలకు హత్తుకుని ముంగిట్లోనుంచి బయటికి పరుగెత్తాడు.

''ప్రాణాలు దక్కించుకోవాలంటే పారిపోండి!'' అని ఎవడో కేకేశాడు.

ఆట ఆడుతూండిన వాళ్లందరూ ఆదరా బాదరా పలాయనం చిత్తగించడం మొదలెట్టారు.

తను వొక్కడే అక్కడ మిగిలిపోవడం చూసి తోల్య తను కూడా పారిపోవచ్చు అనుకున్నాడు. కాని సరిగా ఆ క్షణమే ఎవరో వెనకనుంచి తన షర్టుకాలరుని బలంగా పట్టుకున్నట్టూ, ఎవరిదో కీచుగొంతుక సరిగా తన చెవిలో అరుస్తూన్నట్టూ అనిపించింది:

''నీ బంతితో దేన్ని కొట్టావో తెలుసా, బటాచోర్ నాగమ్మా?! కిటికీ అద్దాలని బంతితో ఎగరగొట్టడానికి మరోచోటు దొరకలేదట్రా నీకు, తుంటరి కుంకా?''

తను వున్న స్థితిలో తల వెనక్కి తిప్పేందుకు తనకు ఎంతవరకూ వీలుండెనో అంతవరకూ తోల్య తల వెనక్కి తిప్పి ఓరకంటితో చూసేసరికి – మీదపెదవిపైన బటానీ గింజంత గోధుమరంగు ఉలిపిరికాయ వున్న

ఒాక వృద్ధస్త్రీ పాపిష్ఠిముఖం కనబడింది. ముసలమ్మ ఒాక చేత్తో తోల్యా షర్టుకాలరును గట్టిగా పట్టుకుంది, రెండో చేత్తో కిరానా సరుకులున్న నల్లని మైనపుగుడ్డ సంచిని పట్టుకుంది.

''తగిలిందండీ నేను అనుకోకుండానే'' అని తోల్యా కలవరపడుతూ గొణిగాడు, ఆమె పట్టు వదలించు కుందుకు గింజుకుంటూ.

''అనుకోకుండానే నేనూ నీ తలకాయను కిటికీ అద్దం పగిలినచోట అద్దం బదులు పెడతా(నా, దొమ్మరి భడవా! మీలాంటి రాలుగాయల్తో వేగలేక (ప్రాణం వుసూరుమంటూాందిరా!'' అందామె.

''మీ కిటికీ అద్దాన్ని మళ్లీ పగలగొట్టారేమిటి, దార్యా సెమ్యొానొవ్నా?'' అని ఇసుక కుప్పవార బెంచీమీద కూచుండిన ఒకామె ముసలమ్మను అడిగింది.

''మా కిటికీ అద్దమే, ఓవిడా, ఇంకెవరిదనుకున్నారు! ఈ అల్లరి సజ్జు పగలగొట్టడం ఇది సరిగ్గా మూడో మాటు! నా దగ్గర అద్దాలు కూచున్నాయూ? ఒరేయ్, ఎన్నో ఫ్లాటురా మీది?'' అని దార్యా సెమ్యొానొవ్నా తోల్యాని అడిగి, వాడి షర్టు కాలరు పట్టుకుని గట్టిగా కుదిపింది.

''పదహారో నంబరు'' అని తోల్యా జవాబుచెప్పాడు.

''శుద్ధ అబద్ధం!'' అంది ఆ రెండో(స్త్రీ. ''పదహారో నంబరు ఫ్లాటులో వున్నవాళ్లందరినీ నేనెరుగుదును!''

''అలా ఐతే, మీ భవనంలో కాదు నేనున్నది'' అన్నాడు తోల్యా.

''ఓహో, మా భవనంలో కాదూ!'' అంది దార్యా సెమ్యొానొవ్నా పాపిష్ఠి నవ్వు నవ్వుతూ. ''మన కిటికీ అద్దాలు బద్దలగొట్టడానికి మన కు(ర్రాళ్లు చాలనట్టు వీడొాహడొాచ్చాడిక్కడికి! భవనం ఆఫీసుకి వెళ్దాం పద!'' అందామె.

తోల్యాని ముసలావిడె భవనం ఆఫీసుకి లాక్కుపోయింది. ఆఫీసులో కూచునున్నారు – భవనం మేనేజరూ, ఆఫీసు అకౌంటెంటూనూ. మేనేజరు బల్లదగ్గర కూచుని ఏదో రాసుకుంటున్నాడు. అకౌంటెంటు గణనఫల కంలో పూసల్ని ఇటూ అటూ టకటక తిప్పుతూ లెక్కలేస్తున్నాడు. అతగాడు సిగరెట్టును నోట్లోనుంచి తీయ కుండా అలా కాలుస్తున్నాడు, పొగ కళ్లల్లోకి వెళ్తొాందేమో, కళ్లు మిటకరించి కనుబొామలు ముడిపెట్టుకుంటున్నాడు. ఆ గదిలో వీళ్లిద్దరే కాకుండా, మోకాళ్ల పర్యంతం వచ్చే బూట్లు తొడుకున్న బుగ్గమీసాల మనిషి ఒాకడు కిటికీ దగ్గరున్న బెంచీమీద కూచునున్నాడు. అతడు కూడా సిగరెట్టు కాలుస్తూనే వున్నాడు, గది నిండా పొగ వున్నప్పటికీ.

ఇలాంటి పొగ వాతావరణంలో పడి తోల్యా దగ్గడం మొదలెట్టాడు. కాని దార్యా సెమ్యొానొవ్నా తోల్యాని ముందుగా ఆ గదిలోకి తోసి, తను వాడి వెనకాల వెళ్లి తలుపు మూసింది.

''ఇదిగో, కిటికీ అద్దం బద్దలుగొట్టాడు. అప్పుడే ఇది మూడోమాటు ధ్వంసంచేయడం, ఏమనుకున్నారో మరి! బజారెళ్లి వస్తువులు కొనుక్కొచ్చా, సరిగ్గా ఆ క్షణమే, కాలితో కొట్టాడు బంతిని సూటిగా అద్దంమీద పడేటట్టు. ఈ కళ్లతో చూశాననుకోండి. మావాళ్లు వూరెళ్లారు, నాకు బొటాబొటిగా సరిపోయేటట్టు డబ్బు విడిచిపెట్టి. అద్దం వేయించుకోవాలంటే రెండు రూబుళ్లు ఎక్కడ్నుంచి తెచ్చేది నేను?'' అంది.

''హుఁ!'' అని భవనం మేనేజరు మెల్లగా ఓ మొరుగు మొరిగి, కాగితం రాసుకుంటూాన్నవాడల్లా తల పైకెత్తి తోల్యాతో అన్నాడు: ''ఒరే నేస్తం, కొత్త అద్దం కోసం రెండు రూబుళ్లు ఇలా ఇచ్చేరా!''

''ఇంటినుంచి తీసుకొచ్చి ఇస్తానండి'' అని గొణిగాడు తోల్యా.

''అలాగేన్రా, నేస్తం, యింటికెళ్లి పట్రా!'' అన్నాడు మేనేజరు.

''సరి, లచ్చనంగానే వుంది! వాడు యింటికి వెళ్తాడట, పట్టుకొచ్చి యిస్తాడట! మీరు నమ్మడం మరీ లచ్చనంగా వుంది!'' అని ముసలమ్మ సణిగింది.

''నిజంగా చెబుతున్నాను. పట్టుకొస్తానండి'' అని నమ్మకం తోపించేందుకు మళ్లీ మరొక మాటన్నాడు తోల్యా.

''రాలుగాయివి కాకపోతే, నీ నిజాన్నెవడు నమ్ముతాడ్రా! పో, పో! నీలాంటి వాళ్లని ఎరుగుదున్రా నేనూ!'' అంది ముసలమ్మ.

''నమ్ముదామండీ వాణ్ణి'' అన్నాడు మేనేజరు. ''వాడి ఎడ్రెసు రాసుకుందాం. నీ పేరేమిట్రా?''

''తోల్యా క్లూక్విన్.''

''ఎక్కడుంటున్నావ్? ఎడ్రెసు?''

'' దెమ్యానొవ్స్కయా వీథి, పదవ నంబరు ఇల్లు, పదహారో నంబరు ఫ్లాటు.''

''సరే, అబ్బాయ్ నువ్వు యింటికెళ్లి రెండు రూబుళ్లూ తీసుకురాకపోతివా మేం ఈ ఎడ్రెసుకెళ్లి నిన్ను ఉన్నపాళంగా ఈడ్చుకొస్తాం.... అర్థమైందా?'' అన్నాడు మేనేజరు, ఎడ్రెసు రాసుకుంటూ.

''మీరు వెళ్తారట, వాణ్ణి వెతికి ఈడ్చుకొస్తారట! మీరు నమ్మడం బాగానే వుంది!'' అంది ముసలావిడె అనుమానపడుతూ. ''వాడు మీతో చెప్పేవన్నీ పుట్టెడు అబద్ధాలు — వాటన్నిటినీ రాసుకోండి!''

మేనేజరు ముసలావిడె మాటలకు అడ్డుపడ్డాడు.

''నిజమో అబద్ధమో ఇట్టే తెలిసిపోతుంది'' అన్నాడతడు. '' దెమ్యానొవ్స్కయా వీథి, పదో నంబరు ఇల్లు. భవనం ఆఫీసు నంబరు ఏదవుతుందో?... బహుశ ఇరవైతొమ్మిది అవుతుంది....''

తన ముందున్న రిజిష్టరు తెరచి, అందులో వున్న భవనం ఆఫీసుల జాబితాలో ఇరవైతొమ్మిదో నంబరు చూసి, అక్కడ నమోదుచేసి వున్న టెలిఫోను నంబరు గమనించి, టెలిఫోను రిసీవరు తీసి నంబరు డయల్‌చేశాడు.

''హల్లో!'' అని కేకేసి, ఒక్క నిమిషం ఆగి, అన్నాడు: ''ఇరవైతొమ్మిదేనా?... మీ రిజిష్టరు చూసి చెప్పండి, మీ పదహారో నంబరు ఫ్లాటులో తోల్యా క్లూక్విన్ అనే ఆసామి వుంటున్నాడా?.... వుంటున్నాడూ?... సరే, ధన్యవాదాలు.... ఏం కొంప మునిగిందని అడుగుతున్నారా? అబ్బే, ఏమీ లేదూ, ఇక్కడొక ఇంటివాళ్ల కిటికీ అద్దం బద్దలుగొట్టాడులెండి....'' అని మేనేజరు టెలిఫోను రిసీవరు పెట్టేసి దార్యా సెమ్యోనొవ్నాకేసి తిరిగి, అన్నాడు: ''అవ్వగారూ! ఇహ మీరు ఏం గాభరా పడకండి. వీడు మన చేతిలోనుంచి పారిపోలేడులెండి. అంతా సరిగ్గానే వుంది.''

''ఏది అనుమానించవలసి వుంటుందో అని అంతా సరిగ్గానే వుంటుంది!'' అన్నాడు బెంచీమీద కూచున్న బుగ్గమీసాల మనిషి. ''నాల్గో నంబరు మిలీషియా స్టేషనులో ఓ సంగతి జరిగింది మొన్నమొన్నే. మిలీషియా మనిషి ఓ కుర్రాణ్ణి పట్టుకున్నాడు: ట్రాము నడుస్తుండగా ట్రాములోనుంచి గెంతేశాడనీ, అందుకు జరిమానా చెల్లించమంటే చెల్లించనన్నాడనీ. ఆ కుర్రాణ్ణి, వాస్తవానికి, మిలీషియా మనిషి స్టేషనుకి తీసుకెళ్లాడు. అక్కడ,

వాస్తవానికి, ఆ కుర్రాణ్ణి ప్రశ్నించారు: 'నీ పేరేమిటి?' అని. కుర్రాడు చెప్పాడు: 'వాన్య సీదొరొవ్' అని. అనగా, అది కాదు వాడి పేరు, అది వాడి స్నేహితుడు మరో కుర్రాడి పేరు. వాణ్ణి మళ్ళీ ప్రశ్నించారు: 'ఎక్కడుంటున్నావ్?' అని. వాళ్ళకి ఈ వాన్య సీదొరొవ్ తాలూకు ఎడ్రెసు ఇచ్చాడు వీడు. ఆ భవనం ఆఫీసుని మిలీషియావాళ్ళు టెలిఫోనులో పిలిచి: 'ఏమండీ, వాన్య సీదొరొవ్ అనే కుర్రాడు మీ భవనంలో వుంటున్నాడా?' అని అడిగారు. 'వుంటున్నాడు' అని జవాబు వచ్చింది. సరే అని చెప్పి, ఈ వాన్య సీదొరొవ్‌ని వెళ్ళిపోనిచ్చారు—అనగా వాన్య సీదొరొవ్‌ని కాదు, వాన్య సీదొరొవ్‌ని అని చెప్పుకున్న ఆ కుర్రాణ్ణి. మరి, ఆ మర్నాడేమో మిలీషియావాళ్ళు అసలు వాన్య సీదొరొవ్ తల్లితండ్రులకి నోటీసు పంపించారు—వాళ్ళబ్బాయికి పడిన జరిమానా చెల్లించవలిసిందని. 'ఇదేమిట్రా అబ్బాయీ, నీకొచ్చిన పుణ్యం? ఏమిట్రా ఇదంతానూ? ట్రాము పరుగెత్తుతూంటే ట్రాములోనుంచి గెంతేశావుటగా నువ్వు? ఇప్పుడేమో మేం జరిమానా చెల్లించాలి!' అని తల్లితండ్రులు కుర్రాణ్ణి ఫడ చివాట్లు పెట్టారు. కుర్రాడు గాభరా పడ్డాడు. పడడా మరి! గాభరా పడి మొర్రో మొర్రో మని ఏడ్చేశాడు: 'నేను గెంతందే!' అని లబోదిబోమన్నాడు. 'గెంతేయడమూ, అబద్ధాలాడ్డమూ కూడానా? ఏమిటిదంతా?' అని తల్లితండ్రులు వాణ్ణి కూకలేశారు. పాపం ఆ కుర్రాడు తన తల్లితండ్రులకే తన మాటమీద ఇంత నమ్మకం లేక పోయిందే అని బెంగపెట్టేసుకుని మంచంపట్టేశాడు, విన్నారు కదండీ! ఇక్కడేదో తికమక జరిగిందనే నిశ్చయించుకున్నారు తల్లితండ్రులు. నిజమే అయివుంటే కుర్రాడు ఇంత జోరుగా బెంగపెట్టుకోడే అనుకున్నారు వాళ్ళు. తండ్రి, వాస్తవానికి, మిలీషియా స్టేషనుకి పరుగెత్తాడు. 'మా అబ్బాయి మాట మేం నమ్ముతాం. ట్రాము నడుస్తూండగా వాడెప్పుడూ అలా ట్రాములోనుంచి గెంతడు. వాడు బుద్ధిమంతుడు' అన్నాడు తండ్రి. 'ఇంట్లోనే కూచుంటే మీవాడు ఇంకా బుద్ధిమంతుడు!' అన్నారు మిలీషియావాళ్ళు. 'మీరు ఏం అనండి, ఏం చెప్పండి, నేను మాత్రం జరిమానా చెల్లించను, చచ్చినా చెల్లించను!' అన్నాడు తండ్రి. 'చెల్లించకపోతే చెల్లించినట్టు చేస్తుంది కోర్టు!' అన్నారు మిలీషియావాళ్ళు.

''వారమే అయిందో, రెండు వారాలే అయిందో, కోర్టు ఎదుట హాజరుకావలసిందని కోర్టువారు తండ్రికి సమను పంపించారు. తండ్రి హాజరయాడు. 'కామ్రేడ్స్! ఏమిటిదంతా? మావాడు ట్రాములోనుంచి గెంతేయ లేదు!' అన్నాడు తండ్రి కోర్టువారితో. 'అదేమిటి? పేరూ, ఇంటిపేరూ, ఎడ్రెసూ అంతా సరిగ్గా సరిపోతూంటేనూ, అంతా సరిగ్గా నమోదయి వుంటేనూ?' అన్నారు కోర్టువారు. కొడుక్కి సరిగ్గా బుద్ధిచెప్పి ఖాయిదాలో వుంచి వాణ్ణి సరిగా పెంచనందుకూ, జరిమానా చెల్లించడానికి నిరాకరించినందుకూ తండ్రికి పదిహేను రోజులు అరెస్టు శిక్ష చెప్పడానికి కోర్టువారు సిద్ధంగా వుండగా, వాళ్ల పుణ్యమా అంటూ, ఇంతట్లోకి, కోర్టులో వున్నవాళ్లలో ఎవరికో తోచి, అన్నారు: ట్రాములోనుంచి గెంతేసినప్పుడు వాన్యని పట్టుకున్న మిలీషియా మనిషిని సాక్షిగా పిలుస్తే మంచిది కదా అని. సరే అంటే సరే అని, ఆ మిలీషియా మనిషిని, వాస్తవానికి, పిలిపించి, అతగాడికి వాన్యని చూపెట్టారు.

''మిలీషియావాడు వాన్యని ఎగాదిగా చూసి అన్నాడు: 'ఆ కుర్రాడు ఎలా వుండెనో నాకు సరిగ్గా జ్ఞాపకం లేదండి. కాని, మరేమో ఇప్పుడు అనిపిస్తూందండి నాకు—ఈ కుర్రాడు నేను పట్టుకున్న కుర్రాడు కాదేమోనని.' మిలీషియావాడు కుర్రాడికేసి మళ్లీ చూసి అన్నాడు: 'అవునండి, ఇప్పుడు నాకు సరిగ్గా తెలుస్తూందండి—

ఈ కుర్రాడు ఆ కుర్రాడు కాదని.' ఈ విధంగా సంగతి మరో విధంగా అంతమైంది. లేకుంటే వాన్య తండ్రి పదిహేను రోజులు అరెస్టులో బైఠాయించి వుండేవాడే — అతగాడి సంగతి ఎవ్వరూ పట్టించుకునేవారుకారు, ఎవ్వరికీ చీమకుట్టినట్టయినా వుండేదికాదు. ఇహ వాన్య సీదొరొవ్‌నని చెప్పుకున్న కుర్రాడంటారా? వాడు ఇంతవరకూ దొరకనే లేదు.''

''వాడే దొరుకుతాడు. వాడు కిల్లాడీ!' అన్నాడు మేనేజరు.

''అలాటి కిల్లాడియే వీడూన్నూ!'' అన్నాడు బుగ్గమీసాల మనిషి. ''సాధారణంగా కుర్రాడు పుట్టెడు అబద్ధాలాడతాడు. ఇంటి నంబరూ, ఫ్లాటు నంబరూ, వీధి పేరూ — ఇలాటి వాటిగురించి కూడా దొంగ భోగట్టా చెబుతాడు. భవనం ఆఫీసుకి టెలిఫోను చేసి కనుక్కుంటే, అటువంటి ఇల్లు కాని, అటువంటి నంబరు ఫ్లాటు కాని లేనేలేదని జవాబు. లేదంటారూ, ఆ నంబరు ఫ్లాటులో మరెవరో వుంటున్నారని జవాబు. అలా చెబుతాడు, చెప్పి ఇహ దొరికిపోతాడు. వాడు అంతా సరిగ్గానే చెప్పాడు, తన గురించి కాదు, వాన్య సీదొరొవ్ గురించి.''

''అవును, అంతేనూ'' అంది దార్యా సెమ్యోనొవ్నా, ''ప్రతివాడూ వస్తాడు, వచ్చి — నీ కిటికీ అద్దం బద్దలగొట్టేస్తాడు. ఇహంటాడు: ఆ పని చేసినవాణ్ణి నేను, నా పేరు వాన్య సీదొరొవ్, ఫలానా చోట వుంటున్నానంటాడు. ఇహప్పుడు బయల్దేరుతారు వాన్య సీదొరొవ్‌ని పట్టుకుందుకు.''

''ఊఁ! చూశారూ, అవ్వగారూ, ఎటువంటి అనుకోని సంగతో మరి!'' అన్నాడు మేనేజరు, తోల్యా మనసులో ఏముందో గ్రహించడానికి వాడికేసి తీక్షణంగా చూస్తూ. ''ఏమో లెండి, ఇంతకీ వాడు వాన్య సీదొరొవ్ అయుంటాడేమో, అనగా — దాని తస్సా దియ్యా! అంతా కలగాపులంగా వుంది. కాని.... ఏమిటన్నావురా, అబ్బాయీ, నీ పేరు?''

''తోల్యా క్ల్యూక్విన్'' అని తోల్యా జవాబుచెప్పాడు.

''అవునౌను. బహుశా వీడు తోల్యా క్ల్యూక్విన్ కాకపోవచ్చు — మరొకడెవడో కావచ్చు కూడా. చూశారా మరి, ఇలాటిది ఎవరికేనా జరగొచ్చు. అందుకని — వెళ్లి మిలీషియా స్టేషనులో ఫిరియాదు చేసుకోండి, అవ్వగారూ! వాళ్లు రొటీన్‌మీద దర్యాప్తుచేసి తతంగం నడిపిస్తారు. వెళ్లండి!'' అన్నాడు మేనేజరు.

''మిలీషియా స్టేషను కెందుకండీ? నేను మీతో చెప్పింది నిజమేనండీ!'' అని ప్రాధేయపడ్డాడు తోల్యా.

''నిజమే! నిజమే! మీ నోటంట నిజంవస్తుందట్రా?'' అని సణిగింది ముసలమ్మ.

ముసలమ్మ అలా సణుగుతూనే తోల్యాని మోచేతికి కాస్త ఎగువగా పట్టుకుని వీధిలోకి లాక్కుపోయింది. తోల్యా ముసలమ్మ పక్కనే అడుగుల్లో అడుగులు వేసుకుంటూ ఇటూ అటూ బెదురు చూపులు చూస్తూ నడిచాడు. దారంట పోతూన్నవాళ్లు తనకేసి వింతగా చూస్తూన్నారనీ, తను దొంగ అవడంచేతనే తనను మిలీషియా స్టేషనుకి లాక్కుపోతూన్నట్టు వాళ్లు ఊహించుకుంటున్నారనీ తోల్యాకి అనిపించింది.

తోల్యాకి మిలీషియా స్టేషనుకి వెళ్లవలసిన అవసరం ఆనాటివరకు ఎన్నడూ కలగలేదు. అక్కడికి వెళ్లడం వాడికి సుతరామూ మనస్కరించలేదు. ముసలమ్మ పట్టులోనుంచి బయటపడేందుకు గట్టిగా గింజుకున్నాడు, కాని ముసలమ్మ పటకారులాంటి వేళ్లతో వాడి చేతిని అంతకంటె గట్టిగా పట్టుకుంది.

''ఎందుకు తీసుకెళ్తున్నారు వీణ్ణి?'' అని ఎదురుగా వస్తున్న ఒక స్త్రీ ముసలమ్మ నడిగింది.

''కిటికీ అద్దం బద్దలుకొట్టేశాడు.''

''ఎక్కడికి తీసుకెళ్తున్నారు వీణ్ణిప్పుడు?''

''మిలీషియా స్టేషనుకి, ఇంకెక్కడికి?''

''నన్ను వదిలిపెట్టేయండి!'' అని వదిలించుకుందుకు ప్రయత్నించుతూ బతిమాలుకున్నాడు తోల్యా.

కాని వాణ్ణి ముసలమ్మ కణుజులా పట్టుకుంది.

''ఒరే అబ్బాయ్, నువ్వు మాత్రం గింజుకోకు'' అందావిడె గట్టిగా. ''ఎంత గింజుకున్నా సరే, నా చేతిలోనుంచి మాత్రం నువ్వు బయటపడలేవు!''

''నన్ను వదిలిపెట్టేయండి!'' అని తోల్యా మళ్లీ బతిమాలుకున్నాడు. ''నా అంతట నేను వస్తాను. నన్ను పట్టుకోక్కర్లేదు. నేను పారిపోను.''

''ఛస్తే నమ్మనా నిన్ను!'' అందామె.

దార్యా సెమ్యోనొవ్నా చేతిలోనుంచి ఇహ తను విడిపించుకుని పారిపోవడం కల్ల అని తోచిపోయి, టక్కరితనం చేయడానికి నిశ్చయించుకున్నాడు తోల్యా. ఆమె రెండో చేత్తో కిరానా సరుకులున్న సంచిని పట్టుకునుండడంచేత, ఒక్క చేత్తోనే ఆమె తనను పట్టుకున్న సంగతి తోల్యా కనిపెట్టాడు.

''నన్ను ఒక్క చేత్తోనే పట్టుకుని పట్టుకుని ఆమె అలసిపోయి, అంత గట్టిగా ఇహ నన్ను పట్టుకోలేకపోతుంది. అప్పుడు....'' అని నిశ్చయించుకున్నాడు తోల్యా.

తోల్యా ఇహ గింజుకోవడం మానేసి, తనకు పట్టిన కర్మతో తను రాజీపడిపోయినట్టు నటించుతూ, నెమ్మదిగా కొంతసేపు నడిచాడు. ఆ విధంగా ముసలమ్మను ఏమరుపాటుగా వుండేటట్టు చేసి, తటాలున ఒక్క గుంజు గుంజి ముసలమ్మ పట్టునుండి తప్పించేసుకుని అకడ్నుంచి ఉడాయించేశాడు.

''ఆగు! ఆగు! ఆగమంటూన్నది నిన్నే! వాణ్ణి పట్టుకోండి!'' అంటూ దార్యా సెమ్యోనొవ్నా వాడివెంట పరుగెత్తుతూ బొబ్బరించింది.

దారంట వెళ్తూ ఎదురుపడినవాళ్లు తాము తోల్యాని పట్టుకోవడం అవసరమో అవసరంలేదో అర్థంగాక అలా నించుండిపోయారు. ఒకతను తోల్యాని పట్టుకోవాలనే అనుకున్నాడు. కాని తోల్యా మంచి లాఘవంగా అతని చేతికిందనుంచి దూరిపోయి, చప్పున పేవ్‌మెంటు దిగి, అటు తిరిగిపోయి రోడ్డుమీదకి దూసుకుపోయాడు. ఇక్కడ తనకి ఎదురుపడిన తోవపోయే జనాన్ని చూసి తోల్యా బెదరిపోలేదు. అంతకంతకు మరింత వేగం పుంజుకుని ముందుకు సాగిపోగల్గాడు కూడానూ. దార్యా సెమ్యోనొవ్నా కూడా రోడ్డుమీదకి చొరబడి పరుగెత్తింది, కాని రోడ్డుమీద వెళ్తూన్న మోటారులారీకింద పడిపోయిందన్నమాటే — తలవెంట్రుక వాసిలో తప్పిపోయిందికాని. ఆమె పేవ్‌మెంటుమీదకి తిరిగివచ్చేసి,

''ఆగు! ఆగు! ఆగు తక్షణం! మోటారుకింద పడిపోతావురా!'' అని గావుకేకలు పెట్టిందామె.

కాని ఆమె మాటలను తోల్యా వినిపించుకోలేదు. వాడు రోడ్డుమధ్యనుంచి అలా దౌడుతీసి, నాల్గురోడ్లూ కల్సుకున్న చోట రోడ్డు దాటేందుకని పరుగెత్తాడు. అటువైపునుండి వస్తూన్న ట్రాముకు అడ్డుగా తోల్యా

దూసుకుపోవడం దార్యా సెమ్యోనొవ్నా చూసిందేమో, ఆమె ఓ వీథి మొగిని అలా నించుండిపోయింది. ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. తోల్యా ట్రాముకింద అక్కడిక్కడే పడిపోయుంటాడని అనుకుంది. కాని ట్రామ్‌డ్రైవరు, తోల్యా అడ్డుగా రావడం చూసి, వేగం తగ్గించేశాడు. తోల్యా ట్రాముపట్టాలు దాటేసి పరుగెత్తాడు, కాని అవతలి వైపునుండి లారీ వొకటి వస్తూంది. తోల్యాకి ఇహ వెనక్కి తప్పుకుందుకు ఆలస్యమైపోయింది. బ్రేకుల కీచు ధ్వని ఖ్రైంయ్ అంటూ మారుమోగింది. మోటారు తోల్యా బుజానికి తగిలింది, తగిలి ఛటుక్కున అక్కడికక్కడే ఆగిపోయింది. తోల్యా పడిపోయాడు. దార్యా సెమ్యోనొవ్నా తన చేతిలో వున్న సంచిని అక్కడ పడేసి, రెండు చేతులతోనూ కళ్లు మూసేసుకుంది.

చిటికె వేసేలోపున తోల్యాచుట్టూ జనం మూగిపోయారు. ఎవరో ఒకడు చప్పున టెలిఫోన్ బూతుకి పరుగెత్తి అంబ్యులెన్స్‌వానుకి ఫోనుచేశాడు. ఈలోపున తోల్యా లేచిపోయి నించున్నాడు.

''వొళ్లు గీసుకుపోయిందేమిటి? దెబ్బలు తగల్లేదుకద?'' అని తోల్యాని ఎవరో అడిగారు.

''లేదు'' అన్నాడు తోల్యా తల అడ్డంగా తిప్పుతూ.

ఇంతట్లోకి లారీ డ్రైవరు తన కేబిన్‌లోనుంచి దిగి, తోల్యా దగ్గరకి పరుగున వచ్చాడు.

''రోడ్డుమధ్యకి అడ్డంగా ఎక్కడ్నుంచి వచ్చావురా, తుంటరి నాగమ్మా? దెబ్బ తగిలిందేమిటి?''

''లేదు, ఏం తగల్లేదు'' అన్నాడు తోల్యా.

తోల్యాని డ్రైవరు రెండు చేతుల్తోనూ పట్టుకుని, మెడ, బుజాలు రెండూ తడిమి చూశాడు:

''ఎక్కడా నొప్పెయ్యడం లేదూ?''

''ఎక్కడా వెయ్యడంలేదు. భయపడిపోయాను, అంతే.''

'' 'భయపడిపోయాట్ట'!'' అన్నాడు డ్రైవరు, ముఖాన చిరునవ్వు తొణికిసలాడుతూ. ''నాకు ధన్యవాదాలు చెప్పాల్రా నువ్వు, సరిగ్గా సమయానికి బ్రేకువేయగల్గానని!''

ఇంతట్లో మిలీషియా మనిషి అక్కడ ప్రత్యక్షమయాడు.

''కుర్రాడికేమైంది?'' అని మిలీషియా మనిషి డ్రైవర్ని కఠినంగా ప్రశ్నించాడు.

''అదృష్టవశాత్తూ ప్రమాదమేమీ జరగలేదు, కామ్రేడ్ మిలీషియామేన్! జడుసుకున్నాడు తప్పితే, గండంనుంచి తేలిగ్గా బయటపడ్డాడు.''

''అంతేనా? ఐతే సరే!''

చుట్టూ మూగిన మూకలోనుంచి సరిగ్గా ఆ సమయానికి దార్యా సెమ్యోనొవ్నా తోసుకొచ్చి అక్కడ ప్రత్యక్షమైంది. ఆవిడె చేతులు జడుపుతో కంపించిపోతున్నాయి, పెదవులు గజగజ వణకిపోతున్నాయి. తనకేమీ జరగనట్టు తోల్యా చెక్కుచెదరకుండా లారీపక్కనే నిలబడి వుండడం చూసి ఆమె వాడిమీద అమాంతం పడి వలవల ఏడ్చేసింది:

''బతికే వున్నావురా బాబూ! వోరి, నా చిట్టితండ్రీ!''

ఆమెను చూసి తోల్యా చప్పున పక్కకి పారిపోబోయాడు. కాని చుట్టూ కట్టిన గోడలా అక్కడ జనం మూగిపోయుండడంచేత ఎటు పారిపోయేందుకూ తోల్యాకి వీలుపడలేదు.

''ఒరేయ్, బాబూ!'' అంది ముసలావిడె చేతులూపుకుంటూ. ''నిన్నొక్కసారి ముట్టుకోనీయవట్రా?

కామ్రేడ్ మిలీషియామేన్! నేను నిజంగా చెబుతున్నాను, ఇదంతా నా తప్పే. వీడు నన్ను చూసి జడుసుకుని లారీకింద పడిపోయాడు, నా మొహం తగలెయ్యా! మరి, దీనికంతకీ కారణం ఆ కిటికీ అద్దమే — పాడు కిటికీ అద్దం!''

''అక్షరాలా నిజం'' అన్నాడు అక్కడున్నవాడెవడో. ''నేను స్వయంగా చూశాను, వెర్రిపిశాచంలా ఈ ముసలమ్మ ఆ కుర్రాడి వెంటపడ్డం.''

''అయితే వుండండి, ఇదంతా మనం రాసుకుందాం!'' అంటూ మిలీషియా మనిషి రిపోర్టు రాసుకోవడం మొదలెట్టాడు.

''రాసుకోవోయ్, రాసుకో! ఒరే నాయనా, చిట్టితండ్రీ, నీకేం భయంలేదురా బాబూ!'' అంటూ ముసలమ్మ తోల్యకేసి తిరిగి అంది. ''ఆ కిటికీ అద్దం ధ్వంసమైందని నీమీద నాకు ఏ కసీ లేదురా, అది నా కంటబడకపోయినా తీరిపోను! ఒరేయ్, చిట్టితండ్రీ, నువ్వు మా ఇంటి దగ్గరకొచ్చి, కుర్రాళ్లందరితోనూ కలిసి ఆ బంతితో ఆడుకోరా, బాబూ! కిటికీ అద్దాన్నంటావా, నీ యిష్టముంటే రోజూ ఓ కిటికీ అద్దాన్ని బద్దలుగొట్టు, నే చెబుతున్నాగా!''

సరిగా ఆ క్షణానికి అంబ్యులెన్స్‌వాను వచ్చి, కాస్త దూరాన ఆగింది. తెల్లని అంగరకా తొడుక్కున్న ఓ స్త్రీ అందులోనుంచి దిగింది.

''ఏడీ, గాయపడిన మనిషి ఎక్కడున్నాడు?'' అని అడిగిందామె, జనం మూగివున్న చోటకి వస్తూ.

''అదిగో, ఆ కుర్రాడే!'' అని అక్కడివారెవరో జవాబుచెప్పారు.

జనం ఆమెకు దారి యిచ్చారు. ఆమె తోల్య దగ్గరకొచ్చింది.

''నా మెడమీద చెయ్యివేసి ఆనుకో, అబ్బాయ్! అంబ్యులెన్సు దగ్గరకి తీసుకెళ్తా నిన్ను'' అందామె తోల్యతో.

''అబ్బే, అవసరంలేదు, గుండులా వున్నాడు వాడు. వాడికేమీ కాలేదూ!'' అన్నాడు లారీ డ్రైవరు నవ్వుతూ.

''మీరు అలాగే అనుకుంటారు. నాక్కనబడుతూందిగా కుర్రాడి నుదురు చిట్లిందనీ!'' అందామె కఠినంగా.

''అదిప్పుడు కాదు, అది నేను చెత్తడబ్బాలో పడినప్పుడు'' అన్నాడు తోల్య.

''చెత్తడబ్బాలో పడడమేమిటి?''

''కుర్రాళ్లతో కలిసి సైకిలు తొక్కినప్పుడు.''

ఆ స్త్రీ తోల్యని గుమ్మడిపండులా తన చేతుల్లోకి ఎత్తుకుని అంబ్యులెన్స్‌వాన్ దగ్గరకి తీసుకెళ్లింది.

''ఎక్కడికి తీసుకెళ్తున్నారు వాణ్ణి? చెత్తడబ్బాలో పడినప్పుడు దెబ్బతగిలిందని చెప్పాడుగా!'' అంది దార్యా సెమ్యోనొవ్నా.

''చెత్తడబ్బా అయితే చికిత్స అవసరంలేదనా మీ అభిప్రాయం? వాడికి తక్షణమే ఇంజెక్షను ఇవ్వాలి. లేకుంటే టెటానస్ ముంచుకురావచ్చు'' అని ఆ స్త్రీ జవాబు చెప్పింది.

''ఏమో మరి, మీరు డాక్టర్లు కదా, మీకే తెలియాలి ఏది ముంచుకురాకుండా ఏమిటియ్యాలో'' అంది దార్యా సెమ్యోనొవ్నా. ''ఒరే అబ్బాయ్, నీకు నయమైపోయాక బంతాడుకుందుకు మా యింటికి రా బాబూ!'' అని ముసలమ్మ బొబ్బరించి, క్షేమంగా వెళ్లిరా అన్నట్టు తోల్యకేసి చెయ్యి వూపింది.

మరికొద్ది నిమిషాలకల్లా తోల్యాని అంబ్యులెన్స్‌వాను తీసుకుపోయింది. ఆ స్త్రీ తోల్యాను స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి, పక్కనున్న బెంచీమీద తను కూచుంది.

"మరొక్క క్షణంలో ఆస్పత్రికి చేరుకుంటాం. డాక్టరు నిన్ను తనిఖీచేస్తాడు. అప్పుడు నీకు ఆడుకోవాలనుంటే ఆడుకుంటావు, పరిగెత్తాలనుంటే పరిగెత్తుతావు. అంతవరకూ మరి ఇప్పుడేమో స్ట్రెచర్‌మీద నెమ్మదిగా పడుకుంటావు, ఏం?" అందామె.

అంబ్యులెన్స్‌వాను కిటికీలోనుంచి తోల్యాకి భవనాల చిట్టచివరి అంతస్తులు మాత్రమే కనబడ్డాయి. అందుచేత అంబ్యులెన్స్‌వాన్ ఏ వీథుల్లోనుంచి వెళ్తోందో ఊహించుకోలేకపోయాడు. తోల్యాని గాభరా పెట్టుతూన్నది ఇదికాదు. వాడిని అన్నిటికంటే హెచ్చు గాభరాపెట్టుతూన్నది తనకి ఇంజెక్షను ఇచ్చితీరుతారనే విషయం. ఇంజెక్షను ఎంత బాధపెట్టుతుందో ఏమిటో అని భయపడ్డాడు.

మరికొద్ది నిమిషాలకి అంబ్యులెన్స్‌వాను ఆస్పత్రి గేటులోకి మళ్లి, ఆస్పత్రి గుమ్మంలో ఆగింది. ఇద్దరు స్ట్రెచర్‌బేరర్లు అంబ్యులెన్స్‌వాను తలుపు తెరిచి, అందులోనుంచి స్ట్రెచరుని లాగడం మొదలెట్టారు. తోల్యా చెంగున గెంతేయబోయాడు, కాని స్ట్రెచర్‌బేరర్లలో వొకడు తోల్యాతో కఠినంగా అన్నాడు:

"పడుకో! కదలకుండా పడుకో!"

వాళ్లిద్దరూ తోల్యాని స్ట్రెచర్‌మీద ఆస్పత్రిలోకి మోసుకుపోయారు. కాని వాళ్లు తనని ఎక్కడికి తీసుకెళ్తున్నారో చూడాలని వుండడంచేత, తోల్యా స్ట్రెచర్‌మీద కదలకుండా పడుకుని వుండడం బదులు, లేచి కూచుని, ఇటూ అటూ తలకాయ తిప్పుతూ నాలుగు దిక్కులూ కలియజూడడం మొదలెట్టాడు.

"ఇట్లాంటి మంకు పిల్లడు ఎక్కడ జతపడ్డాడ్రా మనకి! తొంగోరా అంటే టింగు రంగామని లేచి కూకుంటాడేంపుణ్యాం!" అని వెనక వున్న స్ట్రెచర్‌బేరరు సణిగాడు.

స్ట్రెచర్‌బేరర్లు తోల్యాని ఆస్పత్రి వసారాలోనుంచి, తెల్లని గోడలూ ఎత్తు సరంబీతో వెల్లడిగా వెలుగ్గా వున్న ఓ పెద్ద గదిలోకి తీసుకెళ్లి అక్కడ దించారు. వసారాలోలాగానే ఆ గదిలో కూడా అయొడీనూ, కార్బాలిక్ ఆసిడ్డూ, ఇంకా ఇతర మందుల వాసనలూ కొట్టుతున్నాయి. స్ట్రెచర్‌బేరర్లలో వొకడు తోల్యాను చంకకింద చేతులు పెట్టి మెల్లగా లేవదీసి, చల్లని తెలుపు మైనపుగుడ్డ పరచి వున్న దృఢమైన ఎత్తు బెంచీమీద పడుకోబెట్టాడు.

"ఇక్కడ పడుకో. ఇప్పుడే వస్తారు డాక్టరుగారు" అని ఆ స్ట్రెచర్‌బేరరు మెల్లగా చెప్పి, మరెందుకనో గాని, తోల్యావేపు "ఖబడ్దార్!" అన్నట్టుగా చూపుడువేలు ఝళిపించి వెళ్లిపోయాడు.

తోల్యా పడుకునే వున్నాడు. వాడికి హడలెత్తుకొచ్చింది. ఎంతో సేపైనా డాక్టరు ఇంకా రానేలేదు. తన గురించి అందరూ మరచిపోయారనుకున్నాడు తోల్యా. అలా కొంతసేపయాక, తలుపు తెరుచుకుంది. డాక్టరూ, మెడికల్ నర్సూ వచ్చారు.

డాక్టరు ముసలాయన, అంతా తెల్లని తెలుపు: శుభ్రమైన తెల్లని అంగరకా, తలమీద తెల్లని టోపీ, తెల్లగా నెరసిన కనుబొమలు. మరి, ముక్కుమీద కళ్లజోడు. "మరేమోనూ" అని దీర్ఘంతీయడం ఆయనకో సరదా. ఆయన తోల్యాని "మీరు" అనీ, "అబ్బాయిగారూ" అనీ సంబోధించాడు.

''మరేమోనూ, అబ్బాయిగారూ, మోటారుకింద ఎలా పడ్డారండీ?'' అని అడిగాడాయన.

తోల్యనుండి జవాబుకోసం ఆగకుండానే ఆయన ఈ చెవిలోనూ ఆ చెవిలోనూ చెరో సన్నని రబ్బరు గొట్టాన్నీ దోపుకొని, అదేదో అదొక మోస్తరు గుండ్రని లోహపు బిళ్లను తోల్య గుండెలపైన పెట్టాడు.

''మరేమోనూ, అబ్బాయిగారూ, దయచేసి గాఢంగా వూపిరితీయండి. మంచిది.... ఇంకా కాస్త గాఢంగా వూపిరితీయండి.... ఇంకా గాఢంగా....'' అని ఆయన పదేపదే అన్నాడు, ఆ లోహపు బిళ్లను తోల్య గుండెల పైన కుడిపక్కకూ ఎడమపక్కకూ జరుపుతూ.

తరువాత ఆయన తన చూపుడువేలిని తోల్య ముక్కుకు ఎదురుగా వుంచి అన్నాడు:

''దయచేసి నా చూపుడువేలు కొనకేసే చూస్తూండండి.''

అలా అని, ఆయన తన వేలిని అన్ని దిక్కులా కదిపాడు.

డాక్టరు తన వేలిని ఏ దిక్కు కదిపితే ఆ దిక్కుకల్లా — కుడివైపూ, ఎడమవైపూ, మీదకీ, కిందకీ — తోల్య తన దృష్టిని మళ్లించేందుకు ప్రయత్నించుతూ కళ్లు తిప్పాడు.

ఇదైన తరువాత, తోల్యను డాక్టరు ఇటువైపూ అటువైపూ తడిమి చూశాడు. ఆ తరువాత తళ తళ మెరుస్తూన్నట్టి లోహపు పిడి వున్న చిన్న రబ్బరు సుత్తితో తోల్య మోకాళ్ల చిప్పలమీద మెల్లగా తట్టాడు. ఇహ ఇదంతా అయాక ఆయన మెడికల్ నర్సుకేసి తిరిగి అడిగాడు:

''అంతా సిద్ధంగా వుందండీ, సెరఫీమా అన్ద్రేయెవ్నా?''

''అంతా సిద్ధంగా వుందండి'' అని ఆమె జవాబుచెప్పింది.

''ఐతే ఇహ మొదలుపెట్టండి'' అని డాక్టరు ఆజ్ఞాపించాడు.

''అయ్ బాబోయ్! ఈవిడె ఏమిటి మొదలెడుతుందో యేమిటో!'' అనుకున్నాడు తోల్య.

తోల్య హడలిపోయాడేమో, వాడి కళ్ల ఎదట నారింజపండురంగు గోళాలు నృత్యంచేయసాగాయి, వొళ్ళు ఝల్లుమంది.

''నాకు ఇంజెక్షను అవసరంలేదు! నేను బుద్ధిగా వుంటాను. అలాంటి పనులు ఇహెప్పుడూ చెయ్యను!'' అని ప్రాధేయపడ్డాడు తోల్య.

''ఓరి పిచ్చినాగమ్మా!'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా. ''నీకు ఇంజెక్షను ఇస్తానని ఎవరు చెప్పారు? అసలు ఇంజెక్షనే ఇవ్వను.''

ఈ మాటలంటూ, తన చేతిలో వున్న సిరింజి కనబడకుండా ఆ చేతిని వీపు వెనుక పెట్టేసుకుని, ఆమె తోల్య దగ్గరకొచ్చింది. ఆమె రెండో చేత్తో తోల్యని వొత్తిగిలించి పడుకోబెట్టి, హాస్యం ఆడుతూన్నట్టుగా వీపుమీద చిన్న సొంటిపిక్క పెట్టింది మెల్లగా.

''అబ్బా!'' అని అరిచాడు తోల్య, తన వొంట్లోకి సిరింజి సూది గుచ్చుకునే సరికి.

''నెమ్మదిగా వుండాలి బాబూ! ఇహ అయిపోయింది! బొబ్బలెట్టకు మరి! మరి నొప్పెట్టదులే!''

''అవును, నొప్పెట్టడంలేదు!'' అన్నాడు తోల్య ఏడుస్తూ.

''ఇప్పుడు ఓ అరగంట సేపు అలా పడుకుని వుండాలి. ఆతర్వాత ఇహ ఇంటికెళ్లిపోవచ్చు. కాని నుదుటి

మీద దెబ్బకి అయొడీను రాయడం మాత్రం మరచిపోకండేం!'' అన్నాడు డాక్టరు నర్సుతో. అలా అని ఆయన గదిలోనుంచి వెళ్లిపోయాడు.

సెరఫీమా అన్ద్రేయెవ్నా తోల్యా నుదుటికి అయొడీను రాసింది. తరువాత ఆమె మేజాబల్ల దగ్గర కూచుని ఏదో రాయడం మొదలెట్టింది....

''నీ పేరేమిటి అబ్బాయ్?'' అని ఆమె అడిగింది.

తన పేరు తోల్యా అని చెప్పాలనుకున్నాడు. కాని ఎందుచేతనో మరి, తన పేరు స్లావ అని చెప్పాడు. ఇంటిపేరు క్లూక్విన్ అని చెప్పడం బదులు ఒగొన్కోవ్ అని చెప్పాడు – అనగా తను ఉదయం ఏ నేస్తుడి యింటికి వెళ్తూండగా తన దారికి అడ్డుగా పిల్లి వచ్చిందో ఆ నేస్తుడు స్లావ ఒగొన్కోవ్ పేరు చెప్పాడు.

''మీ ఇంటి పేరు ఎంతో బాగుంది!'' అని, ఆమె తన రిజిస్టర్లో స్లావ ఒగొన్కోవ్ అనే పేరు నమోదు చేసేసుకుంది. ''మరి నీ ఎడ్రెసు?'' అని అడిగిందామె.

తన ఎడ్రెసు దెమ్యానొవ్స్కయా వీథి, 10 వ నంబరు ఇల్లు, 16 వ నంబరు ఫ్లాటు అని చెప్పడం బదులు, లొమొనోసొవ్స్కయా వీథి, 14 వ నంబరు ఇల్లు, 31 వ నంబరు ఫ్లాటు – అనగా మళ్లీ ఆ స్లావ ఒగొన్కోవ్ ఎడ్రెసే చెప్పేశాడు.

తను ఎందుకలా అబద్ధమాడాడో తదుపరి రోజుల్లో సహితం తోల్యా స్పష్టంగా చెప్పలేకపోయాడు. భవనం ఆఫీసులో తను నిజం చెప్పడమూ, తను చెప్పినది నిజమే అని వాళ్లని నమ్మింపజేసేందుకు తను ఎంతగా ప్రయత్నించినా అప్పుడు తనను ససేమీ ఎవ్వరూ నమ్మకపోవడమూ – ఈ సంగతి సరిగ్గా ఆ క్షణానికి తోల్యాకి జ్ఞాపకం వచ్చివుండాలి బహుశా. అంతేకాదు, మరో సంగతి కూడానూ: ఆనాడు జరిగిన సంగతులన్నిటి గురించి ఆస్పత్రినుండి తన తల్లికి కబురు ఎక్కడ వెళ్తుందో అని కూడా తోల్యా అతిభయపడ్డాడు. ఈ కారణాల మూలంగా, భవనం ఆఫీసులో తను ఏ కుర్రాడి గురించైతే విన్నాడో అచ్చంగా ఆ కుర్రాడికి మల్లేనే తోల్యా ప్రవర్తించాడు. ఆ కుర్రాడి గురించి తోల్యా వినకపోయుంటే, తన పేరు కాక వేరొక పేరూ, తన ఎడ్రెసు కాక వేరొక ఎడ్రెసూ ఇవ్వడమనే ఆలోచన తోల్యా బుర్రలోకి వచ్చివుండేదే కాదు, కాని విన్నాడేమో మరి, సరిగ్గా ఆ సమయంలో అదంతా తన బుర్రలోకి వచ్చేసింది.

''లొమొనోసొవ్స్కయా వీథా? ఇక్కడికి దూరమే'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా. ''మీ యింట్లో టెలిఫోనుందా?'' అని అడిగిందామె.

తోల్యా యింట్లో టెలిఫోను లేదు. కాని స్లావ యింట్లో టెలిఫోను వున్న సంగతి తోల్యాకి జ్ఞాపకం వచ్చి, టెలిఫోను వుందని జవాబుచెప్పాడు.

''టెలిఫోను నంబరు?''

''నంబరా?... నంబరా?...'' అని గొణిగి, ''నంబరు నాకు జ్ఞాపకంలేదు'' అన్నాడు తోల్యా.

''ఇదేమిటి? మీ టెలిఫోను నంబరే నీకు జ్ఞాపకంలేకపోవడమేమిటి?'' అని ఆమె వంకర నవ్వు నవ్వింది. ''అవును, మోటారుకింద పడిపోయావు కదూ. అప్పుడు నువ్వెంత హడలిపోయావంటే, మీ టెలిఫోను నంబరు సహితం మర్చిపోయావు. ఫరవా లేదులే. టెలిఫోను డైరెక్టరీలో చూస్తాన్లే!'' అందామె.

“అవును గానీ, మీరు టెలిఫోనులో పిలవడమెందుకూ?” అన్నాడు తోల్యా భయపడుతూ.

“మీ అమ్మతో చెప్పాలి, చెబితే ఆమె నీ దగ్గరకొస్తారు. మీ యింటికి నిన్ను నేనే దిగబెట్టుదును, కాని పని వదిలేసి వచ్చేందుకు వీల్లేదు నాకు” అందామె.

“మా యింటికి తోవ కనుక్కోలేనా యేమిటి? కనుక్కుని వెళ్లిపోతాను! నన్ను ఒకరు దిగబెట్టడమెందుకేమిటి!” అన్నాడు తోల్యా.

“వొద్దొద్దు, నాయనా. నిన్నొక్కడినీ వెళ్లనివ్వకూడదు. మళ్లీ వెంటనే ఏ మోటారుకిందేనా పడిపోతావు! వొద్దొద్దు!”

సెరఫీమా అన్ద్రేయెవ్నా టెలిఫోన్ డైరెక్టరీ పేజీలు తిరగవెయ్యడం మొదలెట్టింది.

“ఆఁ! దొరికింది – ఒగొన్‌కోవ్, లొమొనోసొవ్‌స్కయా వీథి, ఇంటి నంబరు 14, ఫ్లాటు నంబరు 31!”

ఆమె టెలిఫోనుకేసి చేయి చాచి, రిసీవరు తీసి, నంబరు డయల్‌చేసింది. తోల్యా హడలిపోతూ చూశాడు ఆవిడ చేస్తూన్నది. ఇదంతా ఏ విధంగా పరిణమిస్తుందో అని కాసుక్కూచున్నాడు. తను నిజంగా ఏమి ఆశించాడంటే స్లావ వాళ్లూ ఇంట్లో వుండరనే. కాని వాడి ఆస అడియాస అయింది. ఓ నిమిషం గడచిందో లేసేలేదో సెరఫీమా అన్ద్రేయెవ్నా అప్పుడే స్లావ తల్లితో టెలిఫోనులో మాట్లాడనే మాట్లాడుతూంది.

“హల్లో! శ్రీమతి ఒగొన్‌కోవాగారా?” అని సెరఫీమా అన్ద్రేయెవ్నా టెలిఫోనులో బొబ్బరించింది. “మీతో మాట్లాడుతూన్నది ఆస్పత్రినుంచి. మీ అబ్బాయిని చూడ్డానికి రావాలి మీరు. అవునవును, మీ అబ్బాయిని చూడ్డానికే, మీ అబ్బాయినే.... మీ అబ్బాయికి ఏమిటైందంటారా?... ఏమీ కాలేదూ. ఇక్కడ పడుకున్నాడు.... మీరేమీ గాభరాపడకండి. మీవాడికి ఏమీ కాలేదు. నిజం చెబుతున్నా. నా మాట నమ్మండి, ఏమీ కాలేదూ.... మరి, ఇక్కడెందుకు పడుకున్నాడంటే, టిటానస్ రాకుండా రోగనివారణ కోసమని ఇంజెక్షను ఇచ్చాం.... టిటానస్ రాకుండానూ.... అవును.... ఇంజెక్షను ఎందుకంటారా?... మీకు తెలుసుగా, గాయపడిన వాళ్లందరికీ టిటానస్ రాకుండా ఎప్పుడూ ఇంజెక్షను ఇస్తారనీ.... అబ్బే, లేదండీ! ఏ గాయమూ తగల్లేదండీ! గాయం తగిలిందని ఎవరన్నారండీ? మీవాడికి అసలు తగలే తగల్లేదు.... అవును, తగల్లేదండీ అని మీతో నేను చెబుతున్నానుగా! కొద్దిగా గీసుకుపోయింది. సాయంకాలానికల్లా మానిపోతుందండీ!... అబ్బే, మిమ్మల్ని మోసం చేయడంలేదండీ నేనూ! నా మాట నమ్మండి, నిజంగా చెబుతున్నాను, గీసుకుపోయింది, అంతే! గాయమంటూ అస్సలు తగల్లేదు.... ఏమంటున్నారూ?... ఎందుకు గీసుకుపోయిందా?... మరి, మోటారుకింద పడిపోయాడు, అనగా – అదికాదండీ, మోటారుకింద పడలేదు, మోటారు ఢీకొట్టిందండి, అనగా – ఢీకొట్టలేదని.... నే చెబుతున్నా కదండీ! వాడంతట వాడే పడిపోయాడు, వాడిదగ్గరకి రానేలేదు మోటారు – నిజం చెబుతున్నానండీ.... అబ్బెబ్బే, అదేమీ కాదండీ! మీరెందుకలా ఊహించుకుంటున్నారో మరి! మీరు గాభరాపడకుండా వుండేందుకని నేను చెప్పడంలేదని అనుకుంటున్నారేమో. వాడు బతికే వున్నాడండీ, నా మాట నమ్మండి, నిక్షేపంలా వున్నాడు. మీరెందుకలా వూరికేనే ఆందోళ పడిపోతున్నారో మరి! ఇదిగో, ఇక్కడే పడుకున్నాడు, నిజంగానే, నా మాట నమ్మండి మరి, పడుకున్నాడని చెబుతున్నాగా! నేనెందుకు అబద్ధం చెప్పాలండీ? మీరిక్కడికి రండి, వచ్చి స్వయంగా చూడండి!... ఏమంటున్నారు?... ఎక్కడికి రావాలంటారా?... తుర్గేనెవ్‌స్కయా వీథి, ఇరవైయ్యయిదో నంబరు.”

సెరఫీమా అన్‌ద్రేయెవ్నా రిసీవరు పెట్టేసి, చిరునవ్వు నవ్వి, తోల్యతో అంది:

''ఇదిగో, మరొక్క క్షణంలో మీ అమ్మ వచ్చేస్తారు.''

ఆ వార్త విని తోల్య బెంచీ మీదనుంచి చెంగున గెంతేశాడు. కాని సెరఫీమా అన్‌ద్రేయెవ్నా వాణ్ణి పట్టుకుని తీసుకొచ్చి బెంచీ మీద పడుకోబెట్టింది.

''ఇదుగో, నువ్వు పడుకునే వుండాలి, లేచావెందుకూ? ఇంజెక్షను ఎప్పుడిచ్చినా, ఇంజెక్షను తరువాత పడుకునే వుండాలి. మీ అమ్మ వస్తారు, నిన్ను యింటికి తీసుకెళ్ళిపోతారు.''

తోల్య పడుకున్నాడు. పడుకుని ఆలోచించాడు: స్లావ తల్లి అక్కడికి వచ్చి, స్లావ బదులు తనని చూసినప్పుడు ఆ చిక్కులోనుండి తను ఎలా బయటపడడమా అని.

''నేనసలు స్లావని కానని సెరఫీమా అన్‌ద్రేయెవ్నాతో ఒప్పేసుకుంటేనో?'' అని తలపోశాడు తోల్య.

అలా తలపోసినప్పటికీ, సెరఫీమా అన్‌ద్రేయెవ్నా ఎదుట ఆ విషయం తను ఒప్పేసుకుందుకు ఏమాత్రం నిశ్చయించుకోలేకపోయాడు తోల్య. తరువాత ఆమె గదిలోనుంచి వెళ్ళిపోయి, ఇహ ఇంతసేపటికీ రాలేదు, అంతసేపటికీ రాలేదు. ఆమె ఎంతసేపటికీ రాకపోవడం చూసి, తోల్య ఇహ నిశ్చయించేసుకున్నాడు — అక్కడ్నుంచి తను ఉడాయించడమే అన్నిటికంటే ఉత్తమం అని. సెరఫీమా అన్‌ద్రేయెవ్నా, స్లావ తల్లీ ఆ గదిలోకి రావడమూ, తను అక్కడ లేకపోవడమూ, తనకోసం వాళ్ళిద్దరూ ఆస్పత్రి అంతా వెతకడం ఆరంభించడమూ — ఇదంతా తన మనసులో ఊహించుకున్నాడు; స్లావ తల్లి ఇంతా అంతా కాదు, ఎంతైనా గాభరాపడుతుంది, సహజంగానే మరి, అయితే యేం, చివరికి ఆమె ఇంటికెళ్ళిపోయే సరికి — స్లావ అక్కడుంటాడు, వాణ్ణి చూసి ఆమె స్తిమితపడుతుందికదా అనుకున్నాడు.

తోల్య ఇదంతా ఆలోచించుకుని, అంతవరకూ బెంచీమీద పడుకున్నవాడల్లా బెంచీమీదనుంచి దిగిపోదామని కాలు కిందకి దించాడో లేనేలేదో, సరిగా ఆ క్షణానికి సెరఫీమా అన్‌ద్రేయెవ్నా, ఆమె పక్కను స్లావ తల్లీ — ఇద్దరూ గదిలోకొచ్చారు. స్లావ తల్లి ముఖాన రక్తంలేదు, ఆమె పూరకే గాభరాపడిపోతూంది.

''ఇదిగో చూడండి, మీవాడు బతికి బంగార్లా వున్నాడు, నవ్వుతున్నాడు కూడానూ!'' అంది సెరఫీమా అన్‌ద్రేయెవ్నా.

తోల్య బెంచీమీద కూచుని తెర్రమొగమేసి చిరునవ్వు నవ్వుతున్నాడు.

''ఏడీ, మా అబ్బాయి ఎక్కడున్నాడండీ?'' అని స్లావ తల్లి, తోల్యని గమనించనట్టుగా ఆ గది నాలుగు చెరగులా పరకాయించి అడిగింది.

''అదుగో, అక్కడున్నాడుగా!'' అంది సెరఫీమా అన్‌ద్రేయెవ్నా నవ్వుతూ తోల్యకేసి చెయ్యి చూపించి. ''మీ అబ్బాయినే మీరు పోల్చుకోలేకపోతున్నారేమిటి?''

''ఏడీ, మా అబ్బాయి ఎక్కడున్నాడు?'' అని, స్లావ తల్లి చెమిటిదానిలా మళ్ళీ రెట్టించి అడిగింది. ''తోల్య, స్లావ ఏడీ?'' అని ఆమె తోల్యని అడిగింది.

''నాకు తెలీదు'' అని గొణిగాడు తోల్య.

''మీరిద్దరూ కలిసి జేన్య జైత్సెవ్ దగ్గరకెళ్లారుకాదూ? అక్కడ్నుంచి మీరిద్దరూ ఎక్కడికెళ్లారు? నాదగ్గర యేమీ దాచకుండా చెప్పు, తోల్యా!'' అంది స్లావ తల్లి.

''ఇదేమిటి? వీడు తోల్యకాడే! వీడు స్లావ!'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా.

''ఎవడు స్లావ?'' అంది ఆశ్చర్యంతో స్లావ తల్లి.

''వీడే! మరెవడు?'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా.

''ఇదిగో, నా మాట వినండి. ఏమిటిదంతా? దీని అర్థమేమిటి? ఇంతకీ, చెప్పండి, నా కొడుకు ఎక్కడున్నాడు?''

''అయితే స్లావ మీ కొడుకు కాడా?'' అని అడిగింది సెరఫీమా అన్ద్రేయెవ్నా.

''స్లావ నా కొడుకే. కాని వీడు స్లావ కాడు, వీడు తోల్య! తోల్య క్ల్యాక్విన్ వీడి పేరు. అర్థమైందాండి? అబ్బ, ఎన్నిసార్లు చెప్పాలండీ మీకూ? అప్పడే లక్షసార్లైనా చెప్పంటాను! ఇదంతా చూడగా, నాకు మతిపోతూంది!''

''నీ పేరేమిట్రా అని అడిగితే, నా పేరు స్లావ ఒగొనోక్‌కోవ్ అని చెప్పావుకావ్రటా?'' అంటూ సెరఫీమా అన్ద్రేయెవ్నా తోల్యమీద విరుచుకుపడింది. ''ఏమండోయ్, నన్ను క్షమించండి. కాని ఇందులో నా తప్పేమీ లేదు. తను ఒగొనోక్‌కోవ్‌నని చెప్పాడు వీడు. అందుచేత మీకు టెలిఫోనుచేశాను. నువ్వసలు ఒగొనోక్‌కోవ్ కానప్పుడు, ఒగొనోక్‌కోవ్‌నని ఎందుకుచెప్పావ్? నీకేమి మతిపోయిందా ఇలాటి పెంకెతనం చెయ్యడానికి? లేకుంటే, మోటారుకింద పడిపోయినప్పుడు బహుశ హడలిపోయుంటావేమో? ఏమండోయ్, మీరు వీణ్ణి చూడలేదు. వీడు హడలిపోయి, ఏమిటి చెప్పాలో తెలియక, బహుశ ఒకదానికొకటి చెప్పేసి వుండాలి. ఒక్కొక్కప్పుడు అలా జరుగుతుందిలెండి.''

''ఎవ్వరిని తప్పు ఎంచుతున్నాను? ఎవ్వరినీ తప్పు ఎంచడంలేదే. నాక్కావలసినదంతా మా అబ్బాయి ఎక్కడున్నాడో తెలుసుకోవడమే'' అంది స్లావ తల్లి.

''ఏమండోయ్? మీ అబ్బాయి ఎక్క దున్నాడో నా కెక్కడ్నుంచి తెలుస్తుంది చెప్పండీ? మా దగ్గర లేడని మీరు స్వయంగా చూస్తున్నారుగా!'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా.

''అంటే దాని అర్థం, వాడు మోటారుకింద పడిపోలేదనేనా?'' అని అడిగింది స్లావ తల్లి.

''బహుశ ఇంతవరకూ పడలేదన్నమాటే'' అంది సెరఫీమా అన్ద్రేయెవ్నా, చేతులు బారజాపుతూ. ''మోటారుకింద పడిపోయుంటే వాణ్ణిక్కడికి తీసుకొచ్చి వుండేవాళ్లే.''

''ఇదిగో, తోల్య!'' అంది స్లావ తల్లి తోల్యకేసి తిరిగి. ''నాకొక్క సంగతి మాత్రం చెప్పు: నువ్వూ స్లావ కలిసి జేన్యదగ్గరనుండి ఎప్పుడు వెళ్లిపోయారు?''

''నేనసలీవేళ జేన్య దగ్గర కెళ్లానా?'' అని అడిగాడు తోల్య.

''నువ్వసలీవేళ వెళ్లనే లేదా? పొద్దున్న నువ్వు కూడా అక్కడికెళ్లావనుకున్నానే?''

''అక్కడికి వెళ్లాలనే — వెళ్లాను, కాని అక్కడికి చేరలేదు. వాడిదగ్గరకి వెళ్లడం పడలేదు నాకు. ఏమంటే — ఇక్కడికి రావడం పడింది మరి'' అన్నాడు తోల్య.

''ఐతే మరి, స్లావ బహుశ ఇప్పుడు జేన్యదగ్గర వుంటాడేమో? జేన్య టెలిఫోను నంబరు నీకు జ్ఞాపకం వుందా?'' అని స్లావ తల్లి తోల్యని అడిగింది.

''లేదు'' అన్నాడు తోల్య.

''ఐతే యేంలెండి. టెలిఫోన్ డైరెక్టరీలో చూస్తే తెలుస్తుందిగా'' అంది సెరఫీమా అన్‌ద్రేయెవ్నా.

ఆమె చప్పున టెలిఫోన్ డైరెక్టరీ తీసి జేన్య జైత్సవ్ నంబరు చూపించింది స్లావ తల్లికి. స్లావ తల్లి వెంటనే టెలిఫోనుచేయగా, స్లావ అక్కడ వున్నట్టు తెలిసింది. టెలిఫోనులో మాట్లాడిన తరువాత ఆమె స్తిమితపడి, సెరఫీమా అన్‌ద్రేయెవ్నాని అడిగింది — గుండె దడకి నాల్గు చుక్కలు అరకు ఇప్పించండని. సెరఫీమా అన్‌ద్రేయెవ్నా కాసింత అరకు ఓ చిన్న గ్లాసులో పోసి ఆమెకిచ్చి, అంది:

''ఇహిప్పుడు తోల్య తల్లిగారికి టెలిఫోను చెయ్యాలి. చేస్తే ఆవిడె వీడిదగ్గరకొస్తుంది.''

''వొద్దొద్దు!'' అంది స్లావ తల్లి. ''తోల్య తల్లిగారికి టెలిఫోనుచెయ్యకండి, ఆవిడె హడలిపోయి, ప్రాణాలు పోయేటంత పని అవుతుంది.''

''అలా అంటారేమిటండీ! ఆవిడె హడలిపోయేటట్టు కబురుచెబుతానటండీ ఆవిడెతోనూ? ఆవిడెతో ఎలా చెప్పాలో నాకు తెలుసుగా!'' అంది సెరఫీమా అన్‌ద్రేయెవ్నా.

''వొద్దు లెండి. తోల్యని నేనే వాళ్లింటికి తీసుకెళ్లి దిగబెడతా. అన్నట్టు, వాళ్లింట్లో టెలిఫోను లేదు కూడానూ'' అంది స్లావ తల్లి.

స్లావ తల్లి తోల్యను చేయిపట్టుకుని, సెరఫీమా అన్‌ద్రేయెవ్నాకి వీడ్కోలుచెప్పి, వీథిలోకి బయల్దేరింది.

''అవును గాని, నువ్వు ఆస్పత్రిలో పడ్డావే, అదంతా ఎలా జరిగింది కదా?'' అని స్లావ తల్లి తోల్యని అడిగింది.

పొద్దున్న తను స్లావదగ్గరకు వెళ్దామని బయల్దేరడమూ, దారిలో పిల్లి రోడ్డుకడ్డంగా పరుగెత్తడమూ, అందుకని తను వెనక్కి తిరిగిపోవడమూ, ఆ కారణంచేత స్లావదగ్గరకి చేరుకునేసరికి ఆలస్యమైపోగా, స్లావ అప్పటికప్పుడే యింటినుంచి వెళ్లిపోవడమూ, అందుచేత వాణ్ణి కలుసుకోలేకపోవడమూ; అక్కడ్నుంచి తను జేన్య యింటికి బయల్దేరడమూ, కాని దారిలో సైకిలు ఎక్కడమూ, ఎక్కి చెత్తడబ్బాలో పడడమూ, ఆతర్వాత కొందరు పిల్లలతో కలిసి వాలీబాల్ ఆడ్డమూ, తను కొట్టిన బంతి కిటికీ అద్దానికి తగిలి కిటికీ అద్దం బద్దలైపోవడమూ, ఓ పాపిష్ఠి ముసలమ్మ చేతిలో తను చిక్కుకోవడమూ, ఆమె తనను మిలీషియా వాళ్లదగ్గరకి లాక్కుపోవడమూ, తను ఆమె చేతిలోనుంచి తప్పించుకుని రోడ్డుమీద పరుగెత్తడమూ, మోటారు ఒకటి తనను ఇంచుమించు ఢీకొన్నంత పని జరగడమూ, అది జరిగిన తరువాత తనను ఆస్పత్రికి తీసుకువెళ్లడమూ, టిటానస్ రాకుండా అక్కడ తనకి ఇంజెక్షను యివ్వడమూ — ఆ వివరాలన్నీ వరసగా పూసగుచ్చినట్టు చెప్పాడు. నమ్మశక్యంగాని ఈ కథనం అంతా స్లావ తల్లి విని, తన ముఖాన జీరాడిన చిరునవ్వును అణచుకోలేకపోయింది.

కాస్సేపయాక ఆమె అంది:

''ఎంత చోద్యమైన మనిషివి నువ్వు! పోనీగాని, ఇప్పుడు చెప్పు, నీ దారికడ్డంగా పిల్లి వెళ్లడం చూశావు, చూసి నువ్వు వెనక్కి తిరిగిపోకుండా, ఏ చీకూ చింతా లేకుండా నువ్వు నీ దారంట ముందుకు సాగిపోయుంటే ఏమై యుండును?''

''ఏమై యుండునా?... ఏమై యుండదూ, మూడొంతులు ఏమీ అయివుండదు'' అని జవాబుచెప్పాడు

తోల్య. "స్లావను ఇంటిదగ్గర కలుసుకుని, అక్కడ ఇద్దరం చదరంగం ఆడుకునుందుం, జేన్య యింటికి బయల్దేరి వుండను, కిటికీ అద్దం పగులగొట్టి వుండను, ముసలమ్మ దగ్గరనుండి పారిపోయుండను, మోటారుకింద పడిపోయుండను."

"చూశావా మరి! ఇదంతా జరగడానికి కారణం – నువ్వు మూఢవిశ్వాసాలుపెట్టుకున్న మనిషివి అవడమూ, నానా రకాల చెత్తా నమ్మడమూ" అందామె.

"మూఢవిశ్వాసాలంటే?"

"మూఢవిశ్వాసాలంటే యేమిటో నీకు తెలీదూ?" అని అడిగిందామె నవ్వుతూనూ. "నీకు అర్థమయేటటు చెప్పడానికి ప్రయత్నిస్తాను. మానవుడు ఇంకా బాగా ఆటవికుడుగానూ, ఇంకా అజ్ఞానుడుగానూ వుండిన కాలంలో, ఇంకా సరిగా సబబుగా ఆలోచించలేకపోయేవాడనీ, తన చుట్టూ జరుగుతూన్న విషయాలెన్నో అతడికింకా అర్థమయేవికావనీ నీకు బహుశ తెలిసేవుంటుంది. సూర్యుడికి గ్రహణం పట్టినప్పుడు, ఈ అకస్మాత్తు సంఘటనను అతడు అర్థంచేసుకోలేక, దాన్ని చూసి హడిలిపోయి, అదేదో మహోత్పాతాన్ని సూచించే దుశ్శకునమని దిగ్భ్రమ చెందిపోయేవాడు. మరి, అర్ధాత్తుగా ఓ పిల్లికానీ, మరే జంతువుకానీ తన దారికి అడ్డంగా పరుగెత్తినట్టాయెనా, అది కూడా ఒక దుశ్శకునమే అనీ, తను తలపెట్టిన కార్యం ఏదైనా సరే చెడిపోతుందనీ అతడు అనుకునేవాడు. ఈ విధంగా ఎన్నో మూఢవిశ్వాసాలు పుట్టుకొచ్చాయి. వీటికి మూఢవిశ్వాసాలని ఎందుకు పేరు వచ్చిందంటే, మానవుడు తన వివేచనాశక్తిని, లేదా తన వివేకాన్ని ఇంకా బాగా ఉపయోగించడం నేర్చుకొనక పూర్వం వుండిన విశ్వాసాలు కాబట్టి ఆ పేరొచ్చింది."

"అంచేత వాటిని మూఢవిశ్వాసాలనడంకంటె, పూర్వవిశ్వాసాలనడమే మంచిది" అన్నాడు తోల్య.

"'మూఢ' విశ్వాసాలను, 'పూర్వ' విశ్వాసాలను – ఎలా అన్నా ఫర్వాలేదు" అంది స్లావ తల్లి. "'మూఢ విశ్వాసాలు' అనే అందరూ అంటారు, ఆ పదమే రూఢం. సరే, అదలా వుండనీ. సూర్యుడికి గ్రహణం పట్టినప్పుడు, సూర్యుడికి అడ్డుగా వస్తాడు చంద్రుడు. అంతేగాని అది ఏ కీడుకీ శకునం కాబోదు. దారంట వెళూన్నవాడికి అడ్డంగా పిల్లి వెళ్తే, వాడికి ఏం కీడు కలుగుతుంది?" అని ప్రశ్నించింది స్లావ తల్లి.

"ఏం కీడు కలుగుతుందా? అబ్బే ఏం కీడూ కలగదూ" అని జవాబుచెప్పాడు తోల్య. "ఆ మనిషి వాడి మానాన వాడు వెళ్లిపోతాడు, పిల్లి దాని దారంట అది పరుగెత్తిపారిపోతుంది".

"చూశావా మరి! దీన్ని నువ్వు బాగా అర్థంచేసుకున్నావు" అంది స్లావ తల్లి. "కీడు ఎప్పుడు కలుగుతుందంటే, ఏ పనికిమాలిన చెత్త సంగతిని – పిల్లి దారికి పరుగెత్తడం వంటి సంగతిని – అడ్డం పెట్టుకుని, తను చెయ్యాల్సిన విధి చేయనప్పుడే కీడు కలుగుతుంది. నీకు ఓ నేస్తుడున్నాడనుకో. వాడు ప్రమాదంలో వుంటాడు. వాణ్ణి రక్షించేందుకని నువ్వు ఆదరా బాదరా పరుగెత్తుతావు. కాని సరిగ్గా ఆ సమయానికి నీ దారి కడ్డంగా పిల్లి పరుగెత్తుతుంది. అప్పుడేంచేస్తావు నువ్వు? నీ నేస్తుణ్ణి రక్షించడం బదులు, గిర్రున వెనక్కితిరిగి వెళ్లిపోతావా?"

"అబ్బే, నేస్తాన్ని రక్షించడానికే వెళ్తాను!"

"సరిగ్గా చెప్పావ్! తన విధి ఏం చెబుతుందో ఆ పనే మనిషి ఎల్లప్పుడూ చెయ్యాలి, అంతేగాని ఏ పిల్లి

మీదనో, లేకుంటే మరే సింగినాదమూ జీలకర్రా మీదనో తనకు నమ్మకం కలిగించే పని చెయ్యకూడదు. నువ్వు పొద్దున్న స్లావదగ్గరకి వెళ్లావు. ఎందుకు వెళ్లావంటే, వాణ్ణి కలుసుకుంటానని ఖరారుచేశావు. అనగా దాని అర్థం వాడి దగ్గరకు వెళ్లడం నీ విధి. మరేమో నువ్వు ఏ పనికిమాలిన పిల్లిమీద నమ్మకాన్నో అడ్డంపెట్టుకుని, దారంట వున్న ఏ ఉచ్చులోకో మెడ దూర్చావు. కొసకి ఏమైంది? మోటారుకింద పడిపోయినంత పనైంది! మీరు ఎంతటి చోద్యమైన కుర్రాళ్లురా, అబ్బాయీ! మన దేశంలో విజ్ఞానశాస్త్రం బ్రహ్మాండమైన విజయాలు సాధించింది. మన విజ్ఞానశాస్త్రజ్ఞులు అద్భుతమైన యథార్థతతో లెక్కలుకట్టి, భూమినుండి చంద్రమండలానికీ ఇతర గ్రహాలకీ రోదసీ రాకెట్లను పంపగల్గుతున్నారు; ఇహ కొద్దికాలంలో అంతర్గ్రహ యాత్రమీద మానవుడే బయల్దేరబోతున్నాడు. మరి ఇదే సమయంలో, పిల్లిమీదనూ ఇతర పిచ్చిపిచ్చి వెర్రిమొర్రి విషయాలమీదనూ నమ్మకం వున్న కుర్రాళ్లూ వున్నారు'' అంది స్లావ తల్లి.

దీన్నంతనీ స్లావ తల్లి తోల్యకి స్పష్టంగా బోధపరచి చెప్పే వేళకి లొమొనోసొవ్స్కయా వీథి రానే వచ్చింది. వాళ్లిద్దరూ స్లావ యింటి దగ్గరకి వచ్చేసరికి తోల్య అన్నాడు:

''మరి మీరు ఉండండి, నాతో ఇహ రానక్కర్లేదు. ఇహ నా అంతట నేను మా యింటికి వెళ్లిపోగలను.''

''సరే. నువ్వు వెళ్లగలుస్తే వెళ్లు'' అంది స్లావ తల్లి.

తోల్య కషీర్స్కియ్ సందులోకి మళ్లి, తన యింటికేసి నడిచాడు. నడుస్తూ అనుకున్నాడు:

''ఈ మూఢవిశ్వాసాలన్నిటి వెనుకా ఎంత పనికిమాలిన చెత్త బయల్దేరవచ్చో కదా! ఇహ అంతా బాగా అంతం కావడం ఇంకా బాగా వుంది! డ్రైవరు సరిగ్గా వేళకి బ్రేకు వేయకపోయుంటే అంతా మరీ ఘోరంగా అంతమయేది!''

తన మెదడులో జరుగుతూన్న హేతువాదానికి ఎర్రని జాలు పిల్లి రూపంలో తటాలున అంతరాయం కల్గింది. ఆ పిల్లి ఓ యింటిమూలనుండి ఒక్క గంతేసి, తోకను బాకాలా పొటమరించి, చప్పున రోడ్డుకడ్డంగా పరుగెత్తింది. ఇది అనుకోకుండా జరిగినందువల్ల తోల్య ఛటుక్కున జంకి, నడుస్తున్నవాడల్లా అక్కడికక్కడే ఆగిపోయి, శిలావిగ్రహంలా నించుండిపోయాడు.

''ఈవేళ పొద్దున్న అదృష్టం సరిగా లేకపోతే ఇహ ఈనాడల్లా అంతే మరి!'' అనుకున్నాడు తోల్య చికాకు పడుతూ. ''ఇప్పుడేమిటి చెయ్యడం? వెనక్కి తిరిగిపోయి, మళ్లీ ఏ సింగినాథమో జీలకర్రో సంభవించడం, ఏ చెత్తడబ్బాలోనో పడడం, ఏ రాయో రప్పో నెత్తిమీద పడడమా? అలాగవుతే ఇహ వెయ్యేళ్లకి కూడా యిల్లు చేరుకోవడం వుండదు!''

తోల్య ఏ నిశ్చయానికీ రాలేక ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ చూసి తనలో తనే అనుకున్నాడు:

''ఛీ! ఇదంతా ఈమాటుతో సరి! ఏమిటి, నేను మనిషినా, మనిషిని కానా? నేను మనిషిని! మరి మనిషి అంటే అర్థం — వివేకమూ అభిమానమూ వున్న ప్రాణి అన్నమాట. అతను రాకెట్లను రోదసిలోకి పంపిస్తున్నాడు, అణుశక్తిని లొంగదీసి తన చెప్పుచేతల్లోకి తెచ్చుకున్నాడు, ఆలోచనాశక్తిగల యంత్రాన్ని కనిపెట్టాడు. మనిషి అన్నవాడు ఏ పాడు పిల్లిమీదో నమ్మకంపెట్టుకోకూడదు, తన విధి చూపెట్టే దారినే ఎల్లప్పుడూ చేప ట్టాలి. ఇప్పుడు నా విధి ఏమిటి? ఇప్పుడు నా విధి ఇంటికి వెళ్లి భోజనం చేయడం. ఎందుచేతంటే, అప్పుడే

ఎంతసేపటినుంచో అమ్మ నా కోసం కనిపెట్టుకునుంటుంది. అసలు నిజంగా నా కోసం గాభరాపడుతూంటుంది కూడానూ.''

స్లావ తల్లి తోల్యవెంట చూపు సారించుతూ వీథి మొగను చాలాసేపు నించుంది. తోల్యకి ఇంకా మరేమైనా అవుతుందో ఏమిటో అని ఆమె భయపడింది. పేవ్‌మెంటుమీద నడుస్తూన్న తోల్య మరెందుకో గాని తటాలున పేవ్‌మెంటు నట్టనడాన ఆగిపోవడమూ, మనస్సు నిశ్చయించేసుకోలేనట్టు కాస్సేపు నించుండిపోవడమూ, తరువాత చేయి జాడించి సగర్వంగా తల పైకెత్తి సరదాగా ముందుకు నడిచివెళ్ళిపోవడమూ ఆమె చూసింది.



# ఏ వేళప్పుడు ఆ పని

మేష్టారు ఇచ్చిన లెక్క అక్కడ పడేశాను, తోటలో కుర్రాళ్లదగ్గరకి పరుగెత్తాను — ఎదురుగా వస్తున్నారు మేష్టారు.

''ఏమిటంత తొందర? గాలిదేవుడితో పందెం కట్టావేమిటి?''

''లేదండీ, తోట్లో కెళ్తున్నానండీ.''

ఆయన పక్కనే నడుస్తున్నాను. మనసులో ఆలోచనలు పరుగెత్తుతున్నాయి: ''ఇహ అడుగుతారు, లెక్క చేశావా, అన్సరు ఎంతొచ్చిందని -- ఏమని చెప్పడం? నేను లెక్క చేయలేదే.''

ఇక ఆయన అన్నారు:

''ఎండ హాయిగా వుందికదూ!...''

''అవునండీ'' అన్నాను, ''హాయిగా వుందండీ....'' నేను మాత్రం భయపడ్డాను, లెక్క చేశావా అని ఇహ అడిగేస్తారని.

ఇక ఆయన అన్నారు:

''ఇదేమిటోయ్, నీ ముక్కు అంత అలా ఎర్రబడిందీ!'' అని నవ్వారు.

''అదెప్పుడూ అలాగే వుంటుందండి. నా ముక్కు తీరే అంతండి.''

''అలాంటి ముక్కుతో ఈ జన్మంతా ఎలా గడుపుకొస్తావోయ్?''

నాకు భయంవేసింది:

''దానితో ఏం చేసేది?''

''అమ్మేసి, కొత్తది కొనుక్కో.''

''హాస్యంచేయకండీ!''

ఆయన మళ్లీ నవ్వారు.

ఆయన లెక్కగురించి అడుగుతారనే అనుకున్నాను.

ఆయన లెక్కగురించి అడగలేదు. మరచిపోయుంటారు, బహుశ.

మర్నాడు ఆయన నన్ను క్లాసులో పిలిచి,

''మరి, ఏదీ, లెక్కచేశావోయ్? చూపించు!'' అన్నారు.

ఆయన మరచిపోలేదన్నమాట.

# డెస్కు కింద

మేష్టారు పాఠం చెబుతూ బోర్డువైపు తిరిగారు. మరి నేనో — నేను ఛటుక్కున నా డెస్కుకింద దూరాను. మేష్టారు క్లాసువైపు తిరిగి, నా స్థలంలోనుంచి నేను మాయమైపోయానని ఎప్పుడైతే గమనిస్తారో ఇకప్పుడు నిజంగా మహా ఘోరంగా ఆశ్చర్యపడిపోతారు.

ఆయన ఏమనుకుంటారో తెలుస్తే బాగుండును! అందరినీ అడుగుతారు — నేను ఎక్కడ ఎవడి పక్కను కూచున్నానని. ఇకప్పుడుంటుంది గమ్మత్తు! అప్పుడే సగం పాఠం అయిపోయింది — మరి నేనేమో ఇంకా ఇక్కడే — ఈ డెస్కుకిందే కూచున్నానే. "నేను క్లాసులో లేకపోవడం ఇంకా ఎప్పుడు చూస్తారు మేష్టారు?" అని అనుకున్నాను. మరేమో — డెస్కుకింద కూచోవడం మహా కష్టంగా వుంది. అప్పుడే వీపు నొప్పెట్టేస్తూంది. అలా ఓమాటు కూచుని చూస్తే సరి — తెలుస్తుంది! నేను దగ్గాను — కాని ఎవ్వరూ వినిపించుకోలేదు. ఇక అట్టేసేపు అలా కూచోవడం నా తరమైందికాదు. అప్పటికే అంతసేపూ సెర్యోజ మోకాలితో నన్ను పోట్లు పొడిచేస్తున్నాడు. నేనిక భరించలేకపోయాను. క్లాసు అయిపోయే వరకూ అలా కూచోవడం నా వల్ల అయిందికాదు. డెస్కుకిందనుంచి పైకొచ్చేసి, నా స్థలంలో నుంచుని అన్నాను:

"క్షమించండి మేష్టారూ...."

మేష్టారు అన్నారు:

"ఏమిటి సంగతి? బోర్డుదగ్గరకి వస్తానంటావా?"

"అదికాదండి, క్షమించండి నన్ను, నేను డెస్కుకింద కూచున్నానండి...."

"ఏం? డెస్కుకింద కూచోవడమే నీకు సదుపాయంగా వుండెనా? ఈవేళ నువ్వు మహా నిశ్శబ్దంగా వున్నావు. ప్రతిరోజు పాఠం అవుతూన్నప్పుడూ నువ్విలాగే వుండాలి."

# అదీ అసలు సంగతి

"పాఠం అవుతూన్నప్పుడే మళ్లీ మొదలెట్టావూ ఫలహారం?" అన్నారు మేష్టారు.

వాల్యా ఫలహారపు సామాన్ని గబాగబా కాగితంలో చుట్టేసి డెస్కులోకి తోసేసింది.

"పాఠం అవుతూన్నప్పుడే అందరూ ఫలహారం మొదలెడితే ఇకప్పుడేమిటి వుంటుంది?" అని అడిగారు మేష్టారు.

క్లాసు అంతా గొల్లుమంది. ఏమంటే ఇకప్పుడేమిటి వుంటుందో అందరూ వొక్కసారే చెప్పాలనుకున్నారు.

కోల్య అన్నాడు:

"మాంచి గమ్మత్తుగా వుంటుంది!"

మీష అన్నాడు:

''నమలడం వుంటుంది!''

మాషా అంది:

''ఆకలి తీరి తృప్తిగా వుంటుంది!''

''మరి, ఏమిటి వుండదు?'' అని అడిగారు మేష్టారు.

క్లాసు అంతా వూరుకుంది. ఏమిటి వుండదో ఎవ్వరికీ తెలియలేదు.

మేష్టారే జవాబుచెప్పాలనుకున్నారు. ఇంతట్లో తటాలున ఎవరో కేకేశారు:

''పాఠం వుండదు!''

''అదీ అసలు సంగతి!'' అన్నారు మేష్టారు.

# వూలు అల్లిక

మీరు ఆశ్చర్యపడతారు, సహజంగానే మరి. ఏమంటే — నేను మగకుర్రాణ్ణి.... అసలు సంగతి అది కాదనుకోండి. అసలు సంగతేమిటంటే, నేను వూలు అల్లిక నేర్చుకున్నాను. బామ్మ నాకు నేర్పింది. నా స్కీటోపీ నా అంతట నేనే అల్లుకున్నాను.

ఇదీ సంగతి. నన్ను చూసి మా నేస్తులందరూ నవ్వారు: ''ఒరేయ్, ఆడపిల్లవిరా, నువ్వు! ఆడపిల్లలే వూలు అల్లుతార్రా! మగపిల్లలు అల్లర్రా! ఛీ ఛీ!''

నాకు మహా చిన్నతనమనిపించింది. అవును మరి —వూరికే ఉడికిస్తే ఎవరికేనా ఏడుపు రాదేమిటి? అందుకని నాకు వూలుఅల్లిక రావడంలేదని నమ్మించబోయాను. ఇక ఏడవకూడదనుకున్నాను! కాని నేను వూలు అల్లుతూండగా ఘూరిక్ చూశాడు. వాడు నా దగ్గరకొచ్చి చూశాడు. ఇప్పుడు నాతో అన్నాడు: ''అబద్ధాలాడుతున్నావురా! నేను చూశానుగా!''

మరునాటినుంచీ కుర్రాళ్లు నన్ను ''అల్లికవాడు'' అని పిలవడం మొదలెట్టారు.

''అదిగో వచ్చాడ్రా, అల్లికవాడు!... అదిగోరా వచ్చాడు అల్లికవాడు!... ఒరేయ్, అల్లికవాడా, ఇలా రారా!...''

మరి మీరే ఊహించుకోండి, ఎంత ఘోరమో మరి?!

కాని నేను అల్లడం మానేయలేదు, అల్లుతూనే వున్నాను. వాళ్లు ఉడికించుతే ఉడికించనీ నాకేం! నేను అల్లుకుంటూండమే నయం. మరేమో నేను బామ్మతో చెబితే బామ్మ అంది:

''నువ్వు అల్లుతూనే వుండు. లేకపోతే వుత్త పుణ్యానికే వాళ్లు వుడికిస్తారు.''

నాకోసం స్వెటర్ ఒకటి అల్లుకున్నాను. మంచి పసుప్పచ్చనిది — చక్కని ఆకుపచ్చని చారలు. ఎంతో అందంగా వుంది. నిజమే, బామ్మ సాయంచేసిందనుకోండి. అయినా అసలు అల్లిక అంతా నేనే అల్లాను.

స్వెటర్ వేసుకుని వెళ్లాను క్లాసుకి.

కుర్రాళ్లందరూ చూశారు స్వెటర్. ఎవ్వరూ ఉడికించలేదు. అందరూ అలా చూస్తూ ఉండిపోయారు. తరువాత షూరిక్ తటాలున అన్నాడు:

''ఎంత బాగుందో స్వెటర్!...''

మీష కూడా అన్నాడు:

''ఎంత బాగుందో స్వెటర్!...''

నా కిహ ఉండబట్టక అనేశాను:

''నేనే అల్లాను!''

''ఏమిటి, నిజంగానే?'' అంటూ వాళ్లు ఆశ్చర్యపోయారు.

''కాకపోతే మరేమిటి?'' అన్నాను, ''అల్లడం నేర్చుకున్నాను, అల్లాను.''

కుర్రాళ్లు స్వెటర్‌కేసి అదే చూడ్డం చూశారు. స్వెటర్ వాళ్లకి భలే నచ్చింది.

వాళ్లలో ఒక్కడైనా ఉడికించలేదు, అవును మరి. ఉడికించడానికి ఏముంది గనుక. ఊలు అల్లిక నేర్చుకోవడంలో నామూషీ ఏమీ లేదు. ఆ సంగతి వాళ్లందరికీ స్పష్టంగా తెలిసొచ్చింది.

# సందూకా పెట్టెలో గుమ్మడికాయ

నా గుమ్మడికాయ చూశారా మీరు? చూడలేదూ? దాన్ని నేనే పండించాను. ఎక్కడోకాదు, మా బాల్కనీ మీదనే, మా బామ్మ పాత సందూకా పెట్టెలో పండించాను.

సందూకా పెట్టె నిండా మన్ను పోశా. పెట్టె మూత పీకి పారేశా. పెట్టెలో విత్తనం నాటా. ఇకనేముంది, గుమ్మడి చెట్టు మొలిచింది, నాకోసం గుమ్మడికాయ కాసింది. మా యింటికొచ్చిన వాళ్లందరికీ గుమ్మడికాయ చూపెట్టాను. గుమ్మడికాయ చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు, అందరూ దాన్ని ముట్టుకు చూశారు. సందూకా పెట్టెలో గుమ్మడికాయ పండించడమంటే గమ్మత్తు ఏమిటి?! ''దీన్ని ఎగ్జిబిషనుకి తీసుకెళ్లాలి!'' అన్నారందరూ. ''మాస్కో ఎగ్జిబిషనుకే. మన వూళ్లో ఎలాంటి గుమ్మడికాయ కాసిందో వాళ్లు చూస్తేనరి!''

ఈ గుమ్మడికాయ చూసి నే నెంతో మురిసిపోయాను. నా కళ్లన్నీ దానిమీదే వుండేవి.

''చూడవే ఎలా పెద్దదవుతూందో!'' అన్నాను అమ్మతో. ''నిన్నటికి ఇంతకంటె బాగా చిన్నదే సుమా! నువ్వు చూశావుగా?''

నాకనిపించేది, బహుశ అది రాత్రిపూటే పెద్దదవుతూంటుందని. ఒక్కొక్కప్పుడు మళ్లీ ఇటించయు అనిపించేది — పెద్దదల్లా చిన్నదైపోతూన్నట్టు. అలా అవడం ఎంతమాత్రం వీల్లేదనుకోండి, అయినా అలా అనిపించేది.

ఎంతసేపూ ఎగ్జిబిషన్ గురించే కలలు కనేవాణ్ణి: నేను దీన్ని స్వయంగా ఎగ్జిబిషన్‌కి తీసుకెళ్తాను. తీసుకెళ్లి వాళ్లతో అంటాను: ''ఇదిగో చూడండి, ఇది నేను స్వయంగా పండించిన గుమ్మడికాయ! సందూకా పెట్టెలో!'' వాళ్లంటారు కదా నాతో: ''ఓహోహో, ఎంత ఫసందుగా వుందో! సందూకా పెట్టెలో మొలచిన చెట్టుకాయే ఇది? అబ్బే, అదెలా సాధ్యమండీ? ఇంతవరకూ ఇటువంటి గుమ్మడికాయ మా ఎగ్జిబిషన్‌లో లేదు! ఇదిగో, మీ గుమ్మడికాయ ఇలా తీసుకురండి!'' దాన్ని ప్రత్యేకమూ ఓ టేబిలుమీద పెడతారు. దాని పక్కను ఓ సైన్ బోర్డు వస్తుంది. ఆ సైన్‌బోర్డుమీద, ''సందూకా పెట్టె గుమ్మడికాయ'' అని రాసి వుంటుంది. సందూకా పెట్టెలో మొలిపించిన చెట్టుకాయ కదా మరి, అందుకని. బోర్డుమీద రెండో పంక్తిలో వుంటుంది నా పేరు. దాన్ని పండించినది నేనే కదా, అందుకని. బహుశ నాకు నగదు బహుమానం కూడా ఇస్తారేమో.

నేను ఎప్పుడు చూసినా గుమ్మడికాయ గురించే మాట్లాడేవాణ్ణి. ఆ చెట్టుకి వేళతప్పకుండా నీళ్లు పోసేవాణ్ణి. ఇక నాన్ననీ అమ్మనీ అడిగేవాణ్ణి, గుమ్మడికాయను నేను సరిగా పండించుతున్నానా లేదా అని. దాంతో గుమ్మడికాయ గురించి వినడమంటేనే నాన్నకి గిట్టిందికాదు.



''మీ గుమ్మడికాయతో నాకు విసుగెత్తిపోతూంది'' అన్నాడు నాన్న. ''దానితో నాకు మతిపోతూంది. ఎంతసేపూ దానిగురించే ఎవరు మాట్లాడినా. పనిచేసుకుని యింటికొచ్చాను. కాస్సేపు విశ్రాంతి తీసుకుందామనీ, చదువుకుందామనీ వుంది.... ఈ గుమ్మడికాయ మాట నాకు వినబడనీయకండి! దీనితో నన్ను చంపక వదిలిపెడుదురూ, మీకు పుణ్యముండేనూ!''

నాన్న అక్కడనుంచి లేచి తన గదిలోకి వెళ్లిపోయి తలుపు బిడాయించేసుకున్నాడు.

నేను అందరితోనూ గుమ్మడికాయ గురించే మాట్లాడాను. గుమ్మడికాయను గురించిన ఆలోచనలతోనే నా మనసంతా నిండిపోయింది. గుమ్మడికాయను గురించిన ఆలోచనలు నాలోనుంచి పొంగి పొరలిపోయి పైకి వచ్చేశాయి. నా కలలన్నీ సందూకా పెట్టె గురించీ, గుమ్మడికాయ గురించీనీ.

దీన్నంతనీ తేల్చేశాడు మా పొరుగింటి కుర్రాడు అలేక.

''ఏమిటిది?'' అని అడిగాడు. ''గుమ్మడికాయా?''

''అవును'' అన్నాన్నేను. ''కాకపోతే మరేమిటనుకున్నావురా?''

''ఆఁ, మరేంలేదూ'' అన్నాడు వాడు, ''పుసిరికాయ అనుకున్నానులే!''

''ఏం పుసిరికాయ?'' అన్నాన్నేను కోపంతెచ్చుకుని.

''మరి కాకపోతే, ఇదేం గుమ్మడికాయరా?'' అని, వాడు నన్ను స్కూలు ప్రయోగాత్మక క్షేత్రానికి తీసుకెళ్లాడు. అక్కడ చూశాను గుమ్మడికాయలు! బ్రహ్మాండంగా వున్నాయి ఆ గుమ్మడికాయలు. ఒకటీ, రెండూ కాదు — పదులూ పాతికలూనూ!

''స్వయంగా పండించాంరా!'' అన్నాడు అలేక.

నా గుమ్మడికాయను తల్చుకుని సిగ్గుపడిపోయాను. కాని నేనన్నాను వాడితో:

''నా గుమ్మడికాయ — సందూకాపెట్టె గుమ్మడికాయ. దాన్ని నేను సందూకా పెట్టెలో పండించాను!''

# పిట్ట

పాఠానికీ పాఠానికీ మధ్య విరామసమయంలో స్కూలు ప్రాంగణంలోకి వెళ్ళాను. ఎండ హాయిగా కాస్తూంది. గాలి వెయ్యడంలేదు. వాన కురవడంలేదు. మంచు పడడంలేదు. సూర్యుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు.

తటాలున కనబడింది, ఎక్కడనుంచో వచ్చిన పిల్లి దేన్నో పట్టుకోబోతూంది. దేన్నో పట్టుకుంటూంది కదా అనుకున్నాను. నాలో జిజ్ఞాస బయల్దేరింది. పిల్లి వెనకాతలే జాగ్రత్తగా వెళ్ళాను. తటాలున పిల్లి చెంగున గుంతువేసింది! చూసేసరికి పిల్లి ఓ పిట్టని పళ్ళతో పట్టుకునుంది. అది పిచ్చికపిల్ల. పిల్లిని తోకతో ఒక్క ఈడ్పు ఈడ్చి పట్టుకున్నాను.

"ఊ! పిట్టని వదిలేయ్!" అని గద్దించాను పిల్లిని. "వదిలిపెట్టేయ్ తక్షణం!"

పిట్టని వదిలేసి పిల్లి పారిపోయింది.

పిట్టని పట్టుకుని నేను క్లాసులో కెళ్ళాను. దాని తోకఈకలు కొన్ని కొరికేసి వున్నాయి. కుర్రాళ్ళందరూ నా చుట్టూ మూగి కేకలెట్టారు:

"చూండ్రా! పిట్ట! బతికున్న పిట్ట!"

మేష్టారు అన్నారు:

"పిల్లులు పిట్టల్ని పట్టుకున్నప్పుడు వాటి పీక పట్టుకుంటాయి. నీ పిట్ట అదృష్టం బాగుంది. దీని తోక మాత్రమే పట్టుకుంది పిల్లి."

కుర్రాళ్ళందరూ నన్ను అడిగారు పిట్టని వాళ్ళకి ఇచ్చేయమని. నేను మాత్రం దాన్ని వాళ్ళెవరికీ ఇవ్వలేదు. వాటిని పట్టుకోవడం ఇష్టం వుండదు పిట్టలకి.

పిట్టని కిటికీ గడపమీద వుంచాను. ఒక్క క్షణం క్లాసువైపు తిరిగి, మళ్ళీ కిటికీవైపు తిరిగాను. పిట్ట అక్కడలేదు. కుర్రాళ్ళందరూ కేకలెట్టారు:

"మతాబా కాల్చాండ్రా! మతాబా!"

పిట్ట ఎగిరి పారిపోయింది.

అయినా నేను విచారించలేదు. దాన్ని నేను రక్షించాను కదా. అదే ముఖ్యమైన విషయం.

# బ్యూగ్లర్లు

బ్యూగిల్ వూదడం బ్రహ్మవిద్యేమీ కాదు, ఇస్సి, ఇట్టే వూదొచ్చు అనుకున్నాను. ఏముంది, నోటిదగ్గర పెట్టుకుని గట్టిగా వూదుతే సరి – అదే వాగుతుంది. కాని తీరా చూసేసరికి – అలా జరగనే లేదు.

ఓనాడు బ్యాగ్లర్ స్నానానికని నదికి వెళ్లాడు. వోవ నేనూ వాడి బ్యాగిల్ తీశాం. రెండు మూడు పాటలు వాయించుదాం, తరువాత దాన్ని మళ్లీ అక్కడ వుంచేద్దాం అనుకున్నాం.

వోవ అన్నాడు:

''ఒరేయ్, ఏమిటి వాయించమన్నావురా?''

''నాకు సరదా అయిన పాట వాయిద్దూ!'' అన్నాను.

''సరేలే, నాకు సంగీత జ్ఞానం వుందిగా!'' అన్నాడు వాడు.

వోవ బ్యాగిల్ని నోటిదగ్గర పెట్టుకుని, దాన్ని పైకెత్తి తన శక్తి అంతటితోనూ వూదాడు. కాని దానిలో నుంచి ఏ ధ్వనీ రాలేదు.

''నువ్వు మెల్లగా వూదుతున్నావురా'' అన్నాన్నేను.

''అబ్బే, లేదురా'' అన్నాడు వాడు. ''ఎంత గట్టిగా వూదగలనో అంత గట్టిగానూ వూదుతున్నాను.'' అలా అని వాడు దమ్ముపట్టి వూదేసరికి వాడు నిజంగా పేలిపోతాడనే అనుకున్నాను. వాడి చెవులు ఎర్రగా అయిపోయాయి. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

''నీకు చేతకాదు. నా కియ్యరా!'' అన్నాను.

నేనూ వూదాను, వూదాను — అది పలుకుతేనా, అసలు పలకలేదు!

''నువ్వు చెప్పినదే నిజంరా. ఇది పలకదురా.''

00 0004

''ఒరేయ్, దీన్ని ఎలా వూదడమో మనకి తెలియదేమోరా బహుశ?''

''ఇలాక్కాకపోతే మరెలారా వూదడం?''

''మరెలాగో మరేదో మరొక మోస్తరుగా వూదాల్సి వుంటుందిరా దీన్ని!''

మేమిద్దరం మళ్లీ మరోమాటు ప్రయత్నించాం. మా శ్రమంతా వొట్టి దండుగైంది. బ్యాగిల్ కుంయ్ అనలేదు, కైంయ్ అనలేదు.

ఇంతట్లోకి మీష వచ్చాడక్కడికి. వాడికిచ్చాం దాన్ని వూదమని. వాడు వూదితే వూదగలడేమో.

మీష వూదాడు — అది కిక్కురుమనలేదు, కక్కురుమనలేదు.

తరువాత మరికొందరు కుర్రాళ్లు కూడా వచ్చారక్కడికి. వాళ్లూ ప్రయత్నించారు ఒకరి తరువాత ఒకరు. దాన్లోనుంచి ఏ స్వరమూ పెగల్లేదు.

ఆతరువాత కోల్య వూదాడు. తటాలున వచ్చింది — ధ్వని. మెల్లని ధ్వని. అయితేనేం — ధ్వని అంటూ వచ్చింది కదా. మేమందరం పెద్ద గోలచేశాం.

''ఒరేయ్, మాకు బోధపరచి చెప్పరా, దాన్ని ఎలా పలికించావో!'' అని మేం కేకలేశాం.

....వాడికి తెలిస్తేగా మాకు బోధపరచి చెప్పడానికి! వాడికి తెలియేలేదు!

''నేను వూదాను, వూదాను, తటాలున అది — బొంయ్ అని కూతపెట్టింది!'' అన్నాడు వాడు.

తరువాత వాడు మళ్లీ ఎన్నో సార్లు కష్టపడి వూదాడు — అంత కష్టమూ శుద్ధ వృథా అయింది.

అది ఏ చోట వుండేనో అక్కడే వుంచేశాం దాన్ని. అది చెడిపోయిన బ్యూగిల్ — ఆ సంగతి స్పష్టంగా తెలిసిపోతూనే వుంది.

ఆ సాయంకాలం బ్యూగిల్ చప్పుడు వినబడింది. క్యాంపుకి ఎగువగా శ్రావ్యంగా వినబడుతూంది బ్యూగిల్.

ఆ బ్యూగిల్ వూదుతూన్నది మరెవ్వరూ కాదు - మా బ్యూగ్లర్ ల్యోవ.

నిజంగా అద్భుతమే!...



తాతకోసం ఉల్డూజ్ కనిపెట్టుకుంది. సముద్రగర్భపు నూనె బావుల పరిశ్రమలో పనిచేస్తున్నాడు తాత. మరేమో, ఈవేళ తాత యింటికి తిరిగిరావాల్సి వుంది. కాని తుపాను రేగుతూంది. ఈ రోజు సముద్రపు కెరటాలు అల్లకల్లోలంగా మూడంతస్తుల మేడ ఎత్తున లేస్తున్నాయనీ, విచ్చు కత్తులు నరుకుతూన్నట్టు చలిగాలి నరుకు తూందనీ, బూడిదెరంగు మేఘాలు ఆకాశాన ఎంత దట్టంగా అలముకున్నాయంటే కన్నుపొడుచుకున్నా ఏమీ కానరానంత అంధకారంగా వుందనీ చెప్పుకుంటున్నారట.

సముద్రంలో ఒక మహాపట్నం కట్టుతున్నారని తాత చెప్పగా వింది ఉల్డూజ్. ఆ మహాపట్నంలో వీధులు తిన్నగానూ పొడుగ్గానూ వుంటాయట. ఇహ యిళ్లు ఎన్నో అంతస్తులతో బ్రహ్మాండగా వుంటాయట. అలాంటి ఒక యింట్లో తాత వుంటాడు. తను ఇప్పుడు ఆయిల్ డెరిక్ దగ్గర పనిచేస్తూ వారం రోజులూ అక్కడే వుంటాడు. వారం అయిపోయాక ఇంటికొస్తాడు. ఇంటికొచ్చి విశ్రాంతి తీసుకుని, ఆతర్వాత మళ్లీ పనిలోకి వెళ్లడా నికని సముద్రంలో కడుతూన్న పట్నానికి వెళ్లిపోతాడు. నిజం చెప్పాలంటే, ఉల్డూజ్ అంతగా నమ్మలేదు: సముద్రం నట్టనడాన అచ్చమైన పట్నం వుండడమేమిటి అనుకుంది. ''తాత ఏవో గంధర్వగాథలు చెబుతూన్నట్టు ఏదో వూరికే కబుర్లు చెబుతున్నాడు కాబోలు?'' అని ఉల్డూజ్ మనసులో అనుకుంది. అలా అనుకుని ఇక తాతని ప్రశ్నించడం ఆరంభించింది.

''తాతా, తాతా! మరీ, నువ్వు చెబుతున్నావే మీ పట్నం అని, మరి మీ పట్నంలో సినీమా వుందీ?''

''వుందే!'' అని తాత జవాబుచెప్పాడు.

''మరి, షాపులున్నాయా?''

''ఓ, షాపులూ వున్నాయి!''

''మరీ, గ్రంథాలయం కూడా వుందా?''

''ఆహా, అది కూడా వుంది!''

''మరీ, మోటార్లో?''

''అడుగుతావా యింకా! కార్లేమిటి, లారీ లేమిటి, మా వూళ్లో ఎన్నున్నాయో మరి చెప్పలేం అన్నమాట!''

''మరైతేనూ, జూ కూడా వుందా?''

తాత చిరునవ్వు నవ్వి, తల అడ్డుగా వూపాడు:

''ఉన్నవేవో వున్నాయి, లేనివేవో లేవు. జూ లేదు సుమా, ఇంకా కట్టలేదు. కాని ఆ లోపం తీర్చేసేందుకు మా వూళ్లో పక్షులున్నాయి. ఎన్నో ఎన్నో పక్షులు. నీ జిజ్ఞాసకి అంతం వుందా, ఇంకా మరేమేనా తెలుసుకోవాల్సి వుందా, చిట్టితల్లీ?''

ఇంకా ఏమిటడుగుదామా అని ఉల్డూజ్ ఆలోచించేసరికి ఓ ప్రశ్న తట్టింది.

''మీ వూళ్లో పువ్వులున్నాయి?'' అని అడిగింది.

''ఇంకా అడుగుతావా? పువ్వులూ పువ్వులచెట్లూ లేని వూరు ఎక్కడేనా వుంటుందే? నీ క్కావాలంటే మంచి పూలగుత్తి పట్టుకొస్తాను. పట్టుకురమ్మన్నావా?''

''నాక్కావాలి, నాక్కావాలి, తప్పకుండా పట్రావాలి సుమా!''

అందుకని తాత ఎప్పుడొస్తాడా అని ఇప్పుడు ఉల్యాజ్ కనిపెట్టుకునునుంది. కాని అదేదో శాపం పెట్టినట్టు, గాలి మరింత బలంగా వీస్తూంది. అవ్వ ముంగిట్లోకి వెళ్ళి చూసింది. మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయి, విచారంగా తల వూపి అంది:

"ఈవేళమరి తాత వచ్చేటట్టు కనబడ్డంలేదు!"

చలి వెళ్ళిపోయింది. మృదువైన వెచ్చని గ్రీష్మం ప్రవేశించింది. సూర్యరశ్మి భూమిని సుకుమారంగా వెచ్చజేస్తూంది.

ఇలాంటి రోజుల్లో ఓనాడు తాత తన పనినుండి యింటికి వచ్చేశాడు. వచ్చేసి, తను తీసుకొచ్చిన ఎర్ర గులాబీలను చిట్టిమనవరాలకిచ్చాడు.

"మా వూళ్ళో పువ్వులు పూస్తాయన్నానే, మరిప్పుడు నా మాటలు నమ్ముతావా పెంకెతల్లీ?" అన్నాడు తాత.

గులాబీలను ఉల్యాజ్ పూలవాజులో పెట్టింది. తాత నాలుగు రోజులు యింట్లో వుండి, తన అద్భుతమైన పట్టణానికి మళ్ళీ వెళ్ళిపోయాడు. ఈమాటు సముద్రం ఎంత ప్రశాంతంగా, ఎంత నిర్మలంగా, ఎంత పారదర్శకంగా వుండెనంటే, సముద్రజలాలో ఆడుకుంటూన్న చేపలు స్పష్టంగా కనబడుతున్నాయి.

చెక్కస్తంభాలతో కట్టిన వారధివీధిలోనుంచి వెళ్తున్నాడు తాత. వారధికి రెండు వైపులా అమర్చిన చెక్క కుండీలలో వున్న పూలచెట్లు రంగురంగుల పూవులతో కన్నులపండువుగా కానవచ్చాయి. ఆ పువ్వులపైన తేట రంగులతో మెరిసిపోతూన్న సీతాకోకచిలుకలు వలయాలు చుట్టుతూ ఎగురుతున్నాయి. సాయంకాలం ఇంటికి తిరిగివచ్చేస్తూ తాత, సీతాకోకచిలుక ఒకదాన్ని పట్టుకుని దాన్ని డబ్బాలో పెట్టి ఇంటికి తీసుకొస్తున్నాడు.

"ఏమయ్యోవ్! ఆ పులుగుని పట్టుకున్నావెందుకయ్యా?" అని అతని స్నేహితులు అడిగారు.

"మా మనవరాలికోసం తీసుకెళ్తున్నా. సముద్రంలో వున్న పట్నంలో ఎటువంటి అందకత్తెలు విహరించుతున్నారో అది చూసి సరదాపడుతుంది."



వీక్తొర్ ద్రగూన్‌స్కియ్

# బంతిమీద డాన్సుచేసిన అమ్మాయి

ఒకనాడు మా క్లాసు పిల్లలు అందరం కలిసి సర్కస్‌కి వెళ్ళాం. నే నెంతో సంబరపడ్డాను. ఏమంటే, నాల్గు రోజులు పోతే నాకు ఎనిమిదేళ్ళు నిండుతాయా మరి, ఇంతకుముందు నేను సర్కస్‌కి వెళ్ళినదల్లా ఒకేఒక మాటు, అందుకని నాకు మరీ సంబరంవేసింది. అందులోనూ, అల్యోంకాకి ఆరేళ్ళు వెళ్ళి ఏడేళ్ళు వచ్చాయో లేనేలేదో అదప్పుడే ఒకసూటుకాదు, రెండుమాట్లు కాదు, మూడుమాట్లు చూసింది సర్కస్. ఇది నా కెంతో చిన్నతనమనిపించింది. మరి, ఇప్పుడు మా క్లాసు పిల్లలు అందరం కలిసి వెళ్ళాం సర్కస్‌కి. నే నిప్పుడు బాగా పెద్దాణ్ణయిపోయానుకదా, ఇహ ఈ మాటు సర్కస్ సరిగ్గా చూస్తాను కదా అనుకున్నాను. మరి కిందటిమాటు వెళ్ళినప్పుడు నే నింకా బాగా చిన్నాణ్ణే. సర్కస్ అంటే ఏమిటో, అక్కడ ఏం జరుగుతుందో నా కప్పుడు అర్థమే కాలేదు. అప్పుడేమో, రంగంలోకి వచ్చారు మొగ్గలేసేవాళ్ళు, వచ్చి ఒకడి బుర్రమీద ఒకడూ, వాడి బుర్రమీద మరొకడూ — అలా నిలబడేసరికి నాకు ఎంతో గమ్మత్తనిపించిపోయి పొట్ట చెక్కలైపోయేటట్టు ఘోరంగా నవ్వేశాను. వాళ్ళు అందరినీ నవ్వించడానికనే అలా చేశారని అనుకున్నాను. ఏమంటే పెద్దాళ్ళు ఒకరిమీదొకరు ఎగబాకి ఎక్కిపోవడం ఇంటిదగ్గర నే నెన్నడూ చూడలేదు. మరి, ఇటువంటిది వీథిలో కూడా ఎన్నడూ జరగలేదు. అది చూసి ఇహ నేను గొంతుక బద్దలయేటట్టు కేరించాను. తమ నైపుణ్యాన్ని ప్రదర్శించేందుకే వాళ్ళీ ఫీట్సు చేస్తున్నారన్న సంగతి నాకు అర్థంకాలేదు. కిందటిమాటు సర్కస్‌కెళ్ళినప్పుడు మరొకటి కూడానూ: అన్నిటికంటె హెచ్చుగా నేను ఆర్కెస్ట్రా కేసే చూశాను, వాళ్ళు ఎలా వాయిస్తున్నారో — ఎవరు బాజా వాయిస్తున్నారో, ఎవరు బాకా వూదుతున్నారో. ఆర్కెస్ట్రా కండక్టరేమో తన చేతిలో వున్న బెత్తాన్ని కిందకీ మీదకీ ఊపుతూనే వున్నాడు, కాని వాద్యగాళ్ళు ఎవ్వరూ అతనికేసి చూడ్డమేలేదు. ఇహ వాళ్ళందరూ ఎవరిష్టమొచ్చినట్టు వాళ్ళు వాయించుకుపోతున్నారు. ఇది నాకు ఎంతో సరదావేసింది. కాని ఈ వాద్యగాళ్ళని అలా చూస్తూ కూచున్నానేమో, ఈలోపున ఆటగాళ్ళు రంగం మధ్యకి వచ్చేశారు. కాని వాళ్ళు రావడం నేను చూణ్ణేలేదు, ఆ విధంగా అన్నిటికంటే ఆసక్తిదాయకమైన ఫీట్సుని చూసే అవకాశం పోగొట్టుకున్నాను. అవును మరి, నా కేమీ తెలిసేదికాదేమో, ఆ రోజుల్లో నేనింకా వొట్టి వెర్రివెంగళాయలాగే వుండేవాణ్ణి.

మరి ఈ మాటేమో సర్కస్‌కి మొత్తం మా క్లాసంతా కలిసి వెళ్ళాం. సర్కస్‌లోపలికి వెళ్ళీవెళ్ళడంతోనే నా కెంతో సరదావేసింది. ఏమంటే, అక్కడేమిటో కాని అదో ప్రత్యేకమైన వాసన వేస్తుంది, మరి మంచి సరదాగా వున్న బొమ్మలున్నాయి గోడలపైన, గుండ్రంగా చుట్టూ మంచి వెలుగ్గా వుంది, మరి మధ్యనున్న రంగంలో ఎర్రని తివాసి వుంది. సరంబీ మంచి ఎత్తుగా వుంది, అక్కడనుంచి రకరకాల ట్రెపీజియమ్‌లు తళ తళ మెరిసిపోతూ వేలాడుతున్నాయి. మేం వెళ్ళేసరికి ఆర్కెస్ట్రా వాయిస్తున్నారు. సర్కస్ చూడ్డానికొచ్చిన వాళ్ళందరూ ఎవరి స్థలాల్లోకి వాళ్ళు దూసుకుపోయారు. తరువాత ఐస్‌క్రీము కొనుక్కుని సావకాశంగా తినడం మొదలెట్టారు. ఇంతట్లో తటాలున అదేమిటో గాని, మంచి అందమైన దుస్తులు — బంగారు జరీ చారలున్న ఎర్రటి దుస్తులు — వేసుకున్న మనుషులు ఒక రోళాకి రోళా ఎర్రని తెరవెనుకనుంచి వచ్చారు. వాళ్ళు తెరముందు ఇటూ అటూ ఐమూల వరుసలో నించున్నారు. అప్పుడు వాళ్ళ మధ్యనుంచి వచ్చాడు — నల్లని సూటు వేసుకున్న సర్కస్ మేనేజరు. అతడు పెద్ద గొంతుకతో అదేమిటో బాగా అర్థంగాని మాటలు అన్నాడు. అతడలా అనగానే ఆర్కెస్ట్రా అంతకంతకు మరింత మరింత గబాగబా వాయించడం మొదలెట్టింది. దాంతో సర్కస్ గారడీవాడు

రంగం మధ్యకొచ్చాడు. ఇహప్పుడు ప్రారంభమైంది తమాషా! గారడీవాడు ఎన్నో బంతుల్ని — అవి ఎన్నుంటాయో మరి, పదే వుండునో నూరే వుండునో — మీదకి ఎగరేస్తూ, పట్టుకుంటూ, ఎగరేస్తూ, పట్టుకుంటూ అలా ఎంతో సేపు వాటితో ఆడాడు. తరువాత రంగురంగుల బంతి ఒకటి తీసుకొచ్చి, దానితో గమ్మత్తులు చేయడం మొదలెట్టాడు.... బంతిని తలకాయతోనూ, పెడతలతోనూ, నుదుటితోనూ కొట్టాడు, అలా దాన్ని కొట్టి నప్పుడల్లా — అయస్కాంతానికి అంటుకున్న ఇనుప ముక్కలా — ఆ బంతి అతని వొంటికి అంటుకుపోయి, వొళ్ళు అంతటిమీదనుండి దొం(డుకుపోయేది. ఇది నిజంగా మంచి భేషుగ్గా వుండెను. ఆ బంతిని గారడీవాడు మా దగ్గరకి — ప్రేక్షకుల మధ్యకి — విసిరేసరికి, ఇహప్పుడు అసలైన గడబిడా అల్లరీ మొదలైంది — బంతిని నేను అందుకుని, దాన్ని ఒక అబ్బాయికేసి విసిరాను, దాన్ని వాడు అందుకుని మరొక అబ్బాయికేసి విసిరాడు, వాడు దాన్ని అందుకుని, గురిపెట్టి తటాలున ఆర్కెస్ట్రా కండక్టరుమీదకే సరాసరి విసిరాడు. బంతి మాత్రం ఆర్కెస్ట్రా కండక్టరుమీదకి వెళ్లిపడకుండా బాజామీదకెళ్లి పడింది! ఢామ్ అని చప్పుడు! డ్రమ్మరు ఉగ్రుడైపోయి, బంతిని గారడీవాడిపైన తిరిగివిసిరేశాడు, కాని బంతి గారడీవాడికేసి ఎగరడం మానేసి ప్రేక్షకులలో ఒక అందమైన ఆవిడ కొప్పుమీదకెళ్లి పడింది. అందంగా ముడిచి పెట్టుకున్న కొప్పంతా రేగిపోయి కళ్లలో పడిపోయింది. మేమంతా ఇహ అది నవ్వుకాదు. నవ్వి నవ్వి మరి నవ్వలేక చచ్చామన్నమాట!

గారడీవాడు తెరవెనక్కి వెళ్లిపోయినా మేం మాత్రం ఎంత సేపటివరకో గాని మా సంతోషాన్ని అణచు కోలేకపోయాం. ఇంతట్లోకి బ్రహ్మాండమైన ఒక నీలిరంగు బంతిని రంగంలోకి దొర్లించారు. ఫీట్లు అన్నీ ఎనా న్సుచేస్తూన్న మనిషి రంగస్థలం మధ్యకొచ్చి, పెద్ద గొంతుకతో ఏమిటో అస్పష్టంగా బొబ్బరించాడు. అతడు యేమి చెబుతూన్నదీ వొక్క ముక్క అయినా మేం అర్థంచేసుకోలేకపోయాం. ఆర్కెస్ట్రా మళ్లీ మొదలెట్టింది వాయించడం — అదేమిటి వాయించిందో గాని మంచి సరదాగా మాత్రం వుంది, కాని వెనకటంత గబగబా వాయించలేదు.

ఇంతట్లో తటాలున ఓ చిన్న అమ్మాయి రంగంలోకి పరుగెత్తుతూ వచ్చింది. అంత చిన్న అమ్మాయినీ, అంత అందమైన అమ్మాయినీ నే నిదివరకెన్నడూ చూడలేదు. కళ్ళు నీలంగా వున్నాయి, కళ్లచుట్టూ నిడుపాటి రెప్పవెంట్రుకలు. ఆమె వెండి గౌను తొడుక్కుంది. గౌనుపైన ఉల్లిపొరలాంటి ఉత్తరీయం వేసుకుంది. చేతులు సుతారంగా వున్నాయి, చేతులు వూపుతూంటే పక్షి రెక్కలు ఆడిస్తూన్నట్టే వుంది అచ్చంగా. తనకోసమే దొర్లు కొచ్చిన ఆ బ్రహ్మాండమైన బంతిమీదకి ఆ అమ్మాయి ఎగిరింది. ఎగిరి బంతిమీద నించుంది. ఆతరువాత తటా లున అలా బంతిమీద నించునే — బంతిమీదనుండి గెంతేయాలని తను అనుకుంటూన్నట్టుగా పరుగెత్తడం ఆరంభించింది, కాని తన పాదాలకింద వున్న బంతి గిరగిర తిరిగిపోతూ ముందుకు వెళ్లిపోతూంటే, బంతిపైనున్న తను కూడా బంతితోపాళంగా పరిగెత్తుతూన్నట్టుగా అలా బంతిమీద నించుని నిజంగా రంగస్థలంచుట్టూ ప్రారిచేసింది. అలాంటి అమ్మాయిని నే నిదివరకెన్నడూ చూడలేదు. కడం అమ్మాయిలందరూ మామూలుగానే వున్నారు, కాని ఈ అమ్మాయి మాత్రం మామూలు అమ్మాయికాదు, అదేమిటో అసాధారణమైన అమ్మాయి. ఆ బంతిమీద నించుని తన చిట్టి చిట్టి పాదాలతో ఎలా పరుగెత్తిందంటే, నున్నగా గచ్చుచేసిన నేలమీద పరుగెత్తి నట్టే పరుగెత్తింది. ఇహ ఆ నీలిరంగు బంతి తనపైన ఆ అమ్మాయిని నిలబెట్టుకుని తీసుకెళ్తూంది.

మరి ఆ అమ్మాయేమో బంతిమీద నించుని, సూటిగా ముందుకీ, వెనక్కీ, ఎడమపక్కకీ, తన ఇష్ట ప్రకారం ఎక్కడపడితే అక్కడకి స్వారీచేయగల్గింది! ఆ అమ్మాయి గాలిలో తేలిపోతూన్నట్టుగా అలా ఎగిరి పారి పోతూన్నప్పుడు సరదాగా నవ్వింది. ఆమెను చూసి అప్పుడనుకున్నాను—ఆమె నిజంగా దుయ్‌మోవొచ్కాయే* అనుకున్నాను — అంత బుచ్చిబుచ్చిగానూ, అంత ముద్దులు మూటకట్టుతూనూ, అంత అసాధారణంగానూ వుంది ఆ అమ్మాయి. ఈ సమయానికి ఆమె ఆగిపోయింది. ఎవరో ఒకతను ఆమెకి రకరకాల మువ్వల కంకణాలూ కడియాలూ ఇచ్చాడు. ఆమె కడియాలను పొండలున్న కాళ్లకి పెట్టేసుకుంది, చేతులకి కంకణాలు తొడిగేసుకుంది, మళ్లీ బంతిమీద నించుని డాన్సుచేయబోతూన్నట్టుగా నింపాదిగా గిరగిర తిరిగింది. ఆర్కెస్ట్రానుండి నెమ్మదిగా వస్తూంది సంగీతం. ఆ సంగీతంలోనుంచి వినబడింది — అమ్మాయి సన్నని చేతులకున్న బంగారపు మువ్వల గలగల. అదంతా అచ్చంగా గంధర్వగాథలో వున్నట్లే వుండెను. దానికి తోడు దీపాలు ఆరిపోయాయి. ఇహ అన్నిటికీ మించి, ఆ అంధకారంలో ఆ అమ్మాయి ధగధగ వెలిగిపోతూంది, రంగస్థలంచుట్టూ బంతిమీద నింపాదిగా తేలిపోతూంది. అలా తేలిపోతూంటే తళతళ ప్రకాశించింది, గలగల ధ్వనించింది. అదంతా అత్యద్భుతంగా వుండెను — అటువంటి దృశ్యాన్ని నా జీవితం అంతట్లోనూ నేను చూడలేదు.

ఇహ దీపాలు మళ్లీ వెలిగేసరికి, సర్కస్ భవనం యావత్తూ ''సెబాష్!'' అంటూ కేరింతాలతోనూ చప్పట్లతోనూ మారుమోగింది. నేనూ అరిచాను ''సెబాష్!'' అని. అమ్మాయి బంతిమీదనుండి గెంతేసి, తటా లున మెరుపులా ముందుకు పరుగెత్తి, ఒకసారి రెండు సార్లు, అలా ఎన్నో సార్లు గిరగిర గిరగిర తిరుగుతూ అలా అంతకంతకు మరింత ముందుకు, మరింత ముందుకు మాకు దగ్గరగా వచ్చేసింది. అలా గిరగిర తిరుగుతూ ముందుకు వచ్చేస్తూందేమో, రంగస్థలానికీ ప్రేక్షకులకీ మధ్య వున్న దడిని ఇహ క్షణంలో ఢీకొంటుందనే నా కనిపించిపోయింది. నేను తటాలున హడలిపోయి, కూచున్నవాణ్ణల్లా చెంగున ఎగిరి, ఆమెను రక్షించేందుకు ఆమెను పట్టుకుందామని ఆమెదగ్గరికి పరుగెత్తాలనుకున్నాను. కాని ఆ అమ్మాయి ఛటుక్కున, సుతారంగా నాజూగ్గా వున్న చేతులు చాచి, నేలకి అంటుకు పోయినట్టు నిలబడిపోయింది. ఆర్కెస్ట్రా నుండి సంగీతం ఆగిపోయింది, ఆమె నించుని చిరునవ్వు నవ్వింది. ఇహ అందరూ వాళ్లకున్న యావచ్ఛక్తితోనూ చప్పట్లు కొట్టారు, పాదాలతో దబదబ చప్పుడుచేశారు. సరిగ్గా ఆ క్షణంలో ఆ అమ్మాయి నన్ను చూసింది. ఆమె నన్ను చూసిందనీ, నే నామె కేసి చూస్తున్నాననీ, ఆమెకేసి నేను చూడడం ఆమె కనిపెట్టిందనీ నేను గమనించాను. ఆమె నాకేసి చూస్తూ చెయ్యివూపి చిరునవ్వు నవ్వింది. ఆమె నా ఒక్కడికేసే చెయ్యి వూపి నా ఒక్కడికోసమే చిరునవ్వు నవ్వింది. ఆమె దగ్గరకి పరుగెత్తాలని మళ్లీ మరోసారి అనిపించింది నాకు. ఆమెకేసి నేను చేతులు చాచాను. తటాలున ఆమె తన చెయ్యి ముద్దెట్టుకుని, ఆ ముద్దు మా కందరకీ విసిరేసి ఎరుపు తెరకేసి పరుగెత్తి పారిపోయింది. తరువాత హాస్యగాడు తన కోడిపుంజును వెంటేసుకొచ్చి, అదే తుమ్మడం, కింద పడిపోయి దొర్లడం మొదలెట్టాడు. కాని నా మనసు వాడిమీద లేనేలేదు. నా మనసంతా అంతసేపూ ఆ బంతిమీద డాన్సుచేసిన అమ్మాయిమీదే వుండి,

---

*దుయ్‌మోవొచ్కా — ప్రఖ్యాత డేనిష్ బాలసాహిత్య రచయిత హాన్స్ అన్‌డెర్‌సెన్ రచించిన ఒక గాథలో కథానాయిక. — సం.

ఆమె ఎంత అద్భుతంగా వుండెనో, ఆమె నా వంక ఎలా చెయ్యి వూపి చిరునవ్వు నవ్విందోకదా అని తలపోశాను. ఇహ అక్కడ జరుగుతూన్నది దేనినీ చూడాలనిపించలేదు, చూడాలనిపించక పోవడమే కాకుండా, ఆవెర్రి వెంగళాయి హాస్యగాడినీ, వాడి ఎరుపు ముక్కునీ చూడకుండా వుండేందుకని కళ్లు గట్టిగా మూసేసుకున్నాను: ఏమంటే ఆమె తన నీలిరంగు బంతిమీద నా కళ్లఎదట ఇంకా అలా డాన్సుచేస్తూన్నట్టే వుండెను. వీడివల్ల అదంతా పాడై పోతూంది.

తరువాత ఇంటర్వల్ అని ఎనౌన్సుచేశారు. ఇహ అందరూ లిమొనేడ్ తాగేందుకని బూఫ్ఫెకి పరుగెత్తారు. నేను మాత్రం మెల్లగా కిందకి వెళ్లి సర్కస్ ఆటగాళ్లు రంగస్థలంనుండి వెళ్లిపోతూ ఏ ఎర్రతెరవెనకాతల నిష్క్రమించారో ఆ ఎర్రతెర దిశగా వెళ్లాను. ఆ అమ్మాయిని మళ్లీ మరోసారి చూద్దామని నా కెంతో అనిపించి, ఆ తెరదగ్గర నించుని చూశాను — వెంటనే ఆ అమ్మాయి బయటికి వస్తుందని. కాని ఆమె బయటికి రానేలేదు.

ఇంటర్వల్ అయినాక రంగంలోకి సింహాలు వచ్చి ఫీట్లు చేశాయి. సింహాలను మచ్చికచేసిన మనిషికి ఇహ అంత సేపూ వాటి తోకలు మెలెయ్యడం నాకు నచ్చింది కాదు — అవి సింహాలు కాక, ఏవో కునిష్టి పిల్లులైనట్టు — వాటిని అతగాడు ఇక్కడ కూచున్నదానిని అక్కడ కూచునేటట్టూ, అక్కడ కూచున్నదానిని ఇక్కడ కూచు నేటట్టూ స్థలాలు మార్చుకోమని ఆజ్ఞాపించేవాడు. నేలపైన ఓ పక్కగా అవి పడుకునేటట్టు వాటిని ఆజ్ఞా పించి, అవి అలా పడుకున్న తరువాత, తను తివాసీమీద నడచినట్టుగానే వాటిమీద నడుచుకుంటూ వెళ్లేవాడు. ఇహ సింహాల వైఖరి ఎలా వుండెనంటే, మమ్మల్ని హాయిగా పడుకోనివ్వకుండా ఎందుకిలా అల్లరిపెడతారో కదా అన్నట్టుండెను. నా కిదేమీ ఆసక్తి కల్గించలేదు, ఏమంటే అనంతమైన పంపాస్ గడ్డి భూముల్లో సింహాలు కారెనుముల్ని వేటాడాలి, ఉరుముల్లాంటి గర్జనలతో పరిసరప్రదేశాలకు చాటుతూ ప్రజలను గజగజ వణకించాలి. అంతే గాని, ఇవి సింహాలో మరేమిటో నాకేమీ అర్థంకావడంలేదు.

సరి, చివరికి సర్కస్ అంతా పూర్తి అయిపోయింది, మేం యింటికెళ్లిపోయాం, ఇంటికెళ్తూన్నంతసేపూ నా మనసంతా బంతిమీద డాన్సుచేసిన ఆ అమ్మాయిమీదే వుంది.

సాయంకాలం నాన్న అడిగాడు:

''ఏం? సర్కస్ బాగుందా?''

అప్పుడు నేను చెప్పాను:

''నాన్నా! సర్కస్‌లో ఓ అమ్మాయి వుందికదా! ఆ అమ్మాయి నీలిరంగు బంతిమీద డాన్సు చేసింది నాన్నా! ఎంత చక్కనిదంటే — ఇహ అందరికంటే చక్కనిదనుకో! ఆ అమ్మాయి నా కేసి చిరునవ్వు నవ్వి చెయ్యి ఊపింది! నా వొక్కడి కేసే, నిజంగా చెబుతున్నా! నీ కర్థమైందా నాన్నా? వచ్చే ఆదివారం వెళ్దాం నాన్నా సర్కస్‌కి! అప్పుడు చూపిస్తాను నీకు ఆ అమ్మాయిని!''

నాన్న అన్నాడు కదా:

''తప్పకుండా వెళ్దాంరా! సర్కస్ అంటే నేను చెవి కోసుకుంటా నసలు!''

అమ్మ మా యిద్దరివంక చూసింది — ఎలా చూసిందంటే, ఆ క్షణమే మమ్మల్నిద్దర్నీ తొలిసారి చూసినట్టు!

....ఆ వారం చీమనడకతో నడిచింది. నేను భోంచేసేవాణ్ణి, స్కూలుకి వెళ్లేవాణ్ణి, రాత్రి పడుకునే వాణ్ణి, పొద్దున్న లేచేవాణ్ణి, నేస్తాలతో ఆడుకునేవాణ్ణి, వాళ్లతో పోట్లాడేవాణ్ణి – ఇన్నీ చేస్తూన్నా, ప్రతిరోజూ అనుకునేవాణ్ణి: ఎప్పుడు ఆదివారం వస్తుందా, నాన్నా నేనూ ఎప్పుడు సర్కస్‌కి వెళ్తామా, బంతిమీద డాన్సుచేసే అమ్మాయిని మళ్లీ ఎప్పుడు చూస్తానా, ఆ అమ్మాయిని నాన్నకి ఎప్పుడు చూపిస్తానా అని. ఒకవేళ నాన్న ఆ అమ్మాయిని మా యింటికి రమ్మనమని ఆహ్వానిస్తాడేమో, అప్పుడు నేను ఆ అమ్మాయికి నా పిస్టలు బహుమతిచేసి, అన్ని తెరచాపలూ విప్పుకున్న ఓడ బొమ్మ వేసి దాన్ని ఇచ్చేదాం అనుకున్నాను.

కాని నాన్నకి ఆదివారంనాడు రావడానికి వీలైందికాదు. నాన్నని చూడ్డానికని నాన్న స్నేహితులు మా యింటికొచ్చారు, అదేమిటో అదొకరకం డ్రాయింగ్ కాగితాలలో మునిగిపోయి, సిగరెట్లు తాగుతూ, టీ గ్లాసులు ఖాళీచేస్తూ అలా ఎంతో వేళయేవరకూ కూచున్నారు. వాళ్లు వెళ్లిపోయాక ఇహ అమ్మ తలనొప్పితో పడుకుంది. నాన్నా నేనూ టీ గ్లాసులూ అన్నీ తీసేసి బల్ల సర్దేసిన తరువాత నాన్న అన్నాడు:

''వచ్చే ఆదివారం వెళ్దాంరా. ఒట్టువేసి చెబుతున్నాగా, నా మాట నమ్ము!''

మళ్లీ ఆదివారం వచ్చేదాకా నేను కనిపెట్టుకున్నాను, ఇంకా మరొక వారం ఎలా గడిపానో నాకే తెలీదు. నాన్న మాట నిలబెట్టుకున్నాడు. ఇద్దరం కలిసి సర్కస్‌కి వెళ్లాం. నాన్న రెండో వరస టిక్కెట్లు కొన్నాడేమో, రంగస్థలానికి దగ్గరగా కూచుని అన్నీ బాగా చూడొచ్చు కదా అని నే నెంతో సంతోషించాను. సర్కస్ మొదలైంది. ఇహ నేను మొదలెట్టాను కనిపెట్టుక్కూచోవడం బంతిమీద డాన్సుచేసే అమ్మాయి ఎప్పుడు ప్రత్యక్షమవుతుందా అని. కాని ఫీట్లు ఎనౌన్సుచేసే మనిషి కడమ అందరి ఆటగాళ్లను ఒక్కొక్కరినీ రప్పించి వాళ్ల ఫీట్ల గురించి వివరించి చెప్పడమూ, వాళ్లు ఒక్కొక్కళ్లూ అవీ ఇవీ ఏవేవో నానా రకాల ఫీట్లు చేసి చూపించడమూ జరిగింది, కాని ఆ అమ్మాయి అప్పటికీ ప్రత్యక్షం కాలేదు. నే నిహ ఆత్రతతో గజగజ వణికిపోయాను. వెండి గౌను, ఆ గౌనుపైన ఉల్లిపొర ఉత్తరీయం వేసుకుని ఆమె ఎంత అసాధారణమైన అమ్మాయో, నీలిరంగు బంతిమీద ఆమె నించునే ఎంత నేర్పుగా పరుగెత్తుతుందో నాన్న చూస్తే బాగుండునని నాకెంతో అనిపించింది. ఇహ ఆ ఎనౌన్సుచేసే మనిషి తెరలోనుంచి వచ్చినప్పుడు ప్రతిసారీ నేను నాన్న చెవిలో చెప్పేవాణ్ణి:

''ఇదిగో, ఇప్పుడు ఎనౌన్సుచేస్తాడు నాన్నా, ఆ అమ్మాయి వస్తుందని!''

కాని ఎవరిమీదనో కసి తీర్చుకున్నట్టుగా ఆ మనిషి మరొక ఆటగాడెవడి గురించో చెప్పి, వాడి ఫీట్లను ఎనౌన్సుచేసేవాడు. మరి ఆ ఆటగాణ్ణి చూసేసరికే నాకు ఎక్కడలేని అసహ్యమూ పుట్టుకొచ్చేది. ఇహ అంతసేపూ నేను నాన్నతో అంటూండేవాణ్ణి:

''ఇదేమిటి? వొఠ్ఠి ఊకదంపు!''

నాన్న నా వంక చూడకుండానే అనేసేవాడు:

''నీ మాటలతో అడ్డురాకు, ఒరే! ఈ ఫీటు ఎంతో బాగుంది, అన్నిటికంటే ఇదే బాగుంది!''

నాన్నకి ఈ ఫీటే బాగుంటే, ఇహ నాన్నకి సర్కస్ అంటే ఏమిటో అసలు తెలీదన్నమాటే! – అని నా

కనిపించింది. నాన్న ఇదే బాగుందంటే, బంతిమీద ఆ అమ్మాయి డాన్సుచేయడం చూసి ఇహ ఆయన ఎంతలా చిత్తు అయిపోతాడో చూద్దాం! అమాంతం కుర్చీమీదనుంచి నిలువెత్తున ఎగిరినా ఎగరొచ్చు....

సరిగా ఆ క్షణానికి ఎనౌన్సుచేసే మనిషి తెరలోనుంచి వచ్చి, ఖంగ్‌మంటూ, చెవులు చిల్లులడే గొంతుకతో అరిచాడు:

''ఇం — టర్ — వల్!''

నా చెవులనే అసలు నేను నమ్మలేకపోయాను! ఇంటర్వలా? ఎందుకని? ఇంటర్వల్ తరువాత ఇహ ఒక్క సింహాలే వుంటాయే! మరైతే బంతిమీద డాన్సుచేసే నా అమ్మాయేదీ? ఆ అమ్మాయి ఎక్కడుంది? ఆ అమ్మాయి వొచ్చి ఫీట్సు చెయ్యదేమీ? ఒకవేళ ఆ అమ్మాయికి జబ్బుచేసుంటుందేమో? బంతిమీద డాన్సుచేస్తూ పడిపోతే మెదడుకి దెబ్బతగిలిందో ఏమిటో?

నాన్నతో అన్నాను:

''నాన్నా, మనం గబగబా వెళ్లి, ఆ అమ్మాయి ఎక్కడుందో కనుక్కుందాం నాన్నా!''

''అవునౌను! నీ బాలెన్సింగ్ ఫీట్సు చేసే అమ్మాయి ఏదిరోయ్? ఎక్కడా అవుపడ్లేదే! వెళ్లి ప్రోగ్రాం కాగితం కొనుక్కొద్దాంరా, ఒరేయ్, రా, వెళ్దాం!'' అన్నాడు నాన్న.

నాన్న మంచి సరదాగా వున్నాడు, ఫీట్లన్నీ నచ్చినట్టున్నాయి. నాన్న నాలుగు దిక్కులా పరకాయించి, చిరునవ్వు నవ్వుతూ అన్నాడు:

''వారేయ్! సర్కస్ అంటే నాకు చెడ్డ ఇష్టంరా! ఇంతా అంతా కాదు, మహ చెడ్డ ఇష్టం! ఈ వాసనే చాలు, పరవశమెత్తించేస్తూంది....''

నాన్నా నేనూ ముందుహాల్లోకి వెళ్లాం. అక్కడ మంచి రద్దీగా వుంది, జనం ఒకరినొకరు తోసుకుంటూ చాకలేట్లూ, పిప్పరమెంట్లూ, వేఫర్లూ కొనుక్కుంటున్నారు. అక్కడ గోడలకి — నోరు బారుగా తెరచుకొన్న పెద్దపులి తలకాయల ఫోటోగ్రాపులు ఎన్నో వేలగట్టున్నాయి. ఆ హాల్లో మేం కాస్సేపు అలా ఇటూ అటూ తిరిగాం — ప్రోగ్రాం కాగితాలు అమ్ముతూన్న టికెట్ చెకింగ్ మనిషి కనబడుతుందేమో అని. చిట్టచివరకి ఆ మనిషి కనబడింది. నాన్న ఆ మనిషి దగ్గర ప్రోగ్రాం కాగితం ఒకటి కొన్నాడు. కొని తను ప్రోగ్రాం చదువుతూ అక్కడ నించుండిపోయాడు. నాకు మాత్రం ఇహ ఉండబట్టక టికెట్‌చెకింగ్ మనిషిని అడిగేశాను:

''ఇదిగో, ఏమండోయ్! బంతిమీద డాన్సుచేసే అమ్మాయి ఇంకా ఎప్పుడొస్తుందండీ?''

''ఏ అమ్మాయి?'' అని అడిగిందామె.

''టి. వొరొన్‌త్సోవా బంతిమీద బాలెన్సింగ్ ఫీట్సు అని ప్రోగ్రాంలో వుందే. మరి, ఆ అమ్మాయి ఏదీ?'' అని అడిగాడు నాన్న.

నేను అలా మౌనంగా నించుండిపోయాను. టికెట్‌చెకింగ్ ఆవిడె అంది:

''ఓహో, మీరడుగుతున్నది తాన్యా వొరొన్‌త్సోవా గురించా? ఇక్కడ్లేదు, వెళ్లిపోయిందా అమ్మాయి. వెళ్లిపోయింది. ఇంతకుముందే రావల్సింది మీరు.''

నేను అలా మౌనంగా నించుండి పోయాను.

నాన్న అన్నాడు:

''అప్పుడే రెండు వారాలై మనస్థిమితం లేకుండా మహా గాభరాపడిపోతున్నాం, బాలెన్సింగ్ ఫీట్లు చేసే అమ్మాయి టి. వొరొన్త్సోవాని ఎప్పుడు చూస్తామా అని! ఇప్పుడేమో ఆ అమ్మాయి లేదాయె.''

టికెట్‌చెకింగ్ ఆవిడె అంది:

''అవునండీ, ఆ అమ్మాయి వెళ్లిపోయిందండీ.... తల్లితండ్రులతో కలిసి వెళ్లిపోయిందండి.... తల్లి తండ్రులు 'కంచు మనుషులు,' మీరు వినేవుంటారు బహుశా? అయ్యయ్యో!... నిన్ననే వెళ్లిపోయారుసుమండీ!''

నేనన్నాను:

''చూశావా నాన్నా మరి....''

నాన్నన్నాడు:

''నా కేంతెలుసు(్రనా ఆ అమ్మాయి వెళ్లిపోతుందనీ? ఆరె దేవుడా!... ఎంత పనైందిరా? అయ్యయ్యో! సరే.... ఇప్పుడిహ యేమీ చెయ్యలేం....''

టికెట్‌చెకింగ్ ఆవిడెని అడిగాను నేను:

''అనగా, వెళ్లిపోయినట్టే కచ్చితంగా?''

''కచ్చితంగా'' అందామె.

నేనడిగాను:

''ఎక్కడికెళ్లిందో మీకు తెలుసునండీ?''

''వ్లదివొస్తోక్'' అందామె.

అక్కడికెళ్లిందా! ఎంతో దూరం. వ్లదివొస్తోక్. అవును, నాకు తెలుసు — మాస్కోకి కుడిచేతివైపున మ్యాపు చిట్టచివరి కొసనుంది.

నే నన్నాను:

''ఎంతో దూరం.''

టికెట్‌చెకింగ్ ఆవిడె తటాలున మమ్మల్ని తొందరపెట్టింది:

''లోపలికెళ్లండి, లోపలికెళ్లి మీ సీట్లలో కూచోండి, ఇహ దీపాలార్పేస్తారు!''

ఆ మాట నాన్న అందుకుని:

''రారా, లోపలికెళ్దాం, ఒరేయ్ దెనీస్కా! ఇప్పుడొస్తాయి సింహాలు! జూలు సింహాలు, ఎలా గర్జిస్తాయో! అయ్ బాబోయ్! చూదాంరా, పరుగెత్తి రారా!''

''ఇంటికెళ్లిపోదాం నాన్నా!'' అన్నాన్నేను.

''అదా సంగతి....'' అన్నాడు నాన్న.

టికెట్‌చెకింగ్ ఆవిడె నవ్వింది. కాని మేమిద్దరం మా ఓవర్‌కోట్లు తెచ్చుకుందుకని క్లోక్‌రూముకి వెళ్లాం. నేను జేబులోనుంచి టోకెన్ తీసి ఇచ్చాను, ఓవర్‌కోట్లు వేసుకుని సర్కస్ భవనంలోనుంచి బయటి కొచ్చాం. రోడ్డుమీద అలా నడిచాం. అలా బాగా కొంత దూరం నడిచాక, ఇహప్పుడు అన్నాను:

"వ్లదివొస్తోక్ – మ్యాపులో అన్నిటికంటె చిట్టచివరి కొసనుంది. అక్కడికి రైలుమీద వెళ్లడమంటే పూర్తిగా నెల్లాళ్లు పడుతుంది...."

నాన్న ఏమనలేదు. నా మాటలు ఆయనకి వినపడినట్టులేదు – ఆయన మనసు మరెక్కడో వున్నట్టుంది. మేం మరికొంచెం దూరం వెళ్లాం. తటాలున నా కప్పుడు జ్ఞాపకం వచ్చింది విమానం మాట.

"కాని, 'టియూ – 104' మీద మూడు గంటలే అక్కడికి!" అన్నాను.

అప్పటికీ ససేమిరా నాన్న జవాబుచెప్పలేదు. నా చేయి గట్టిగా పట్టుకుని అలా మౌనంగానే నడిచాడు నాన్న. గోర్కి విధి చేరుకోగానే నాన్న అన్నాడు:

"అదిగో 'ఐస్‌క్రీమ్' కేఫీలో కెళ్దాంరా! రెండు ఐస్‌క్రీములు స్వాహా చేసేద్దాం, ఏం?"

"నా కేమీ అక్కర్లేదు నాన్నా!" అన్నాను.

"మంచి ద్రాక్షరసం అమ్ముతార్రా అక్కడ. అటువంటి మంచి ద్రాక్షరసం ప్రపంచంలో మరెక్కడా దొరకదనుకో!" అన్నాడు నాన్న.

"నా కక్కర్లేదు నాన్నా" అన్నాను.

నా మనసు మార్పించడానికి నాన్న ప్రయత్నించలేదు. మరింత గబగబా నడిచాడు నాన్న, నడుస్తూ నా చేయి మరింత గట్టిగా పట్టుకున్నాడు. నాకు నొప్పి పెట్టింది. నాన్న మరింత గబగబ నడిచాడు, నేను కాళ్లీడ్చు కుంటూనే ఎలాగో ఆయనవెంట పరుగెత్తాను. ఎందుకని ఆయన అంత గబగబ నడిచాడు? ఎందుకని ఆయన నాతో మాట్లాడలేదు? ఆయనకేసి చూడాలనిపించి తలపైకెత్తాను. ఆయన ముఖం ఎంతో గంభీరంగానూ విచారంగానూ వుంది.



కుర్రవాడు విమానంలో కూచున్నాడు, కిటికీకి కళ్ళు అంటించేశాడు. మరక్కడ్నుంచి వూడొచ్చాడుకాడు.

సూర్యుడు తళతళ ప్రకాశిస్తున్నాడు. సూర్యకిరణాలు కళ్ళు పొడిచేస్తున్నాయి. ఐనప్పటికీ కుర్రవాడు మాత్రం కిటికీలోనుంచి అలా చూస్తూనే వున్నాడు.

''ఒరే నాయనా, కిటికీ తెర వేసేయిరా, లేకుంటే పక్క సీటులోకి వచ్చేయ్. కిటికీ దగ్గర ఎండ మహా వేడిరా, బాబూ. నీకు అసలు యెండ పైత్యంచేస్తుంది'' అంది కుర్రవాడి తల్లి.

కుర్రవాడు తల్లివంక చికాగ్గా చూశాడు. తనకి ఎండ పైత్యంచేస్తుందని తల్లి అన్న మాటలు పైవాళ్ళెవరైనా వినడం కుర్రవాడికి సుతరామూ ఇష్టంలేకపోయింది.

''ఇక్కడ నా కెంతో బాగుందమ్మా. ఎండ నా కసలేమీ చెయ్యదు'' అన్నాడు కుర్రవాడు.

''అయితే సరే'' అంది తల్లి. ''అక్కడే కూచో. నే వెళ్ళి మరోచోట కూచుంటా.''

ఆమె తన సీట్లోనుంచి లేచిపోయి అటువైపు వరుసలో ఒక సీటులోకెళ్ళి కూచుంది. కుర్రవాడు అలా కిటికీలోనుంచి చూస్తూనే వున్నాడు.

కేబిన్‌లోనుండి పైలట్ బయటికొచ్చాడు. అతడే విమానం కమాండరు. అతడొచ్చి కుర్రవాడి పక్కను కూచున్నాడు.

కుర్రవాడు అతనివైపు చూశాడు. ఇప్పుడు తన పక్కను కూచున్న మనిషి అసలైన మనిషి కదా అనుకున్నాడు. కుర్రవాడికి ఆ మనిషితో మాట్లాడాలని కోరిక పుట్టింది. ఈ సంగతి గ్రహించాడు పైలట్. కనుబొమలు ముడివడి అలసిపోయిన అతని ముఖం కాసంత వెలుగొందింది. అతడు అలవాటు చొప్పున అడిగాడు కుర్రవాణ్ణి:

''ఏం బాగుందా?''

''మంచి బాగుంది!'' అని జవాబుచెప్పాడు కుర్రవాడు. 

''పైలట్ అవుదామని కూడా కలలు కంటున్నావా ఏమిటి?'' అని అడిగాడు పైలట్.

కుర్రవాడు తబ్బిబ్బుపడ్డాడు. తను పైలట్ అవాలని ఆ కుర్రవాడు ఎన్నడూ కలలు కనలేదు. ఏమంటే వాడివి బలహీనమైన ఊపిరితిత్తులు, మరి పైలట్‌కి అలాంటి ఊపిరితిత్తులుంటే వాడిపని అంతే. పైలట్ వేసిన ప్రశ్నకి ఎలా జవాబుచెప్పడమా అని కుర్రవాడు ఆలోచించాడు. తను అబద్ధం చెప్పలేడు, నిజంచెప్పడం ఇష్టంలేదు.

''నాకు బొమ్మలు వేయడమంటే సరదా'' అని కుర్రవాడు జవాబుచెప్పాడు. ''అదిగో చూడండి: తెల్లని మేఘాలు, తెల్లని ఏనుగుల్లా వున్నాయి. మొదటిదాని తొండం కింద దంతాలున్నాయి. అదే కడమవాటన్నిటికీ నాయకురాలు. అల్లక్కడున్నది — మబ్బు తిమింగిలం. దాని తోక ఎంత సొగసుగా వుందో!''

కుర్రవాడు పైలట్‌వంక చూశాడు, అతడు చిరునవ్వు నవ్వడం కనిపెట్టాడు. కనిపెట్టి ఇహ మాట్లాడ్డం మానేశాడు. వయస్సులో తనకంటె ఎంతో పెద్దవాడైన వ్యక్తితో — అందునా మరొకడితోనూ మరొకడితోనూ కాదు, ఏకంగా ఒక పైలట్‌తో — అదేమిటో మేఘాల్లో వున్న ఏనుగులను గురించీ తిమింగిలాలను గురించీ చెబుతున్నానే అని కుర్రవాడు సిగ్గుపడిపోయాడు.

కుర్రవాడు మళ్ళీ కిటికీకి కళ్ళు అప్పగించేశాడు.

పైలట్ కుర్రవాడి బుజంమీద చెయ్యివేసి, అన్నాడు:

"నీ ఊహ సరిగా పనిచేస్తూందోయ్! నిజానికి ఈ మేఘాలు అచ్చంగా ఏనుగుల్లా తప్ప మరోకలా లేనేలేవు సుమా! నువ్వు మహ తెలివిగా పోల్చుకున్నావోయ్!"

"నాకు అమ్మ మాస్కోలో రంగులు కొంటుంది — పెద్దవాళ్ళు వాడుతారే అలాంటి రంగులు" అన్నాడు కుర్రవాడు. "నే నప్పుడు బొమ్మలేస్తాను. నిజంగానే. ఇదిగో, చూడండి, భూమి! అచ్చంగా మొజేయిక్*లా వుంది — అలాంటి ఆట ఒకటుందిలెండి, పిల్లలాడుకునేది."

పైలట్ భూమికేసి చూశాడు. తను పైలట్‌గా ఎంతకాలంగానో పనిచేస్తున్నాడు కాని, భూమి ఇలా వున్నట్టు తను ఏనాడూ గమనించలేదు. అతడు కొంచెం చిన్నతనంపడ్డాడు కూడానూ: ఆ ఏనుగులన్నిటి పక్క నుండి తను అన్నిసార్లు తన విమానాన్ని తీసుకెళ్ళినా, ఒక్కసారైనా తను వాటిని గమనించలేదు. కళాత్మకుడైన ఆ కుర్రవాడి వంక ఎంతో మెప్పుతో చూశాడతడు.

ఆకాశాన్ని అతడెప్పుడూ తను పనిచేసే స్థలంగా మాత్రమే భావించుకున్నాడు, విమానయానానికి అనువైన దృక్పథంతోనే ఆకాశాన్ని విలువకట్టడం తనకి అలవాటైపోయింది: నిమ్న మేఘాలున్న ఆకాశమైతే విమానం దింపడం కష్టం, ఊర్ధ్వ మేఘాలున్న ఆకాశమైతే విమానం ఎగరడం అతి సౌఖ్యం, ఉరుముల మేఘాలున్న ఆకాశమైతే విమానయానం ప్రమాదకరం. విమాన పక్షాల వెనుక శత్రు ఫిరంగి బేటరీ ప్రేలుడుల మేఘాలను కూడా యుద్ధంలో తను అనేక పర్యాయాలు గమనించాడు — అవి ఉరుముల మేఘాలకంటేనూ ప్రమాదకరములైనవి.

ఇక తన దృక్పథంలో భూమి అంటే, విమానం దిగే స్థలం, ముందు రానున్న మరో యానంకోసం కని పెట్టుకునుంటూ విశ్రాంతితీసుకుందుకు అవకాశం ఇచ్చే స్థలం.

మరికాస్సేపటికి పైలట్‌కి కేబిన్నుండి కబురు వచ్చింది, అతడు లేచి, అక్కడికి వెళ్ళిపోయాడు.

ఇక కొద్ది నిమిషాలకల్లా కళ్ళు చీకట్లు కమ్మే మెరుపులూ చెవులు చిల్లులు పొడిచే ఉరుములూ తనకు ఎదురుగా రావడమూ, బ్రహ్మాండమైన బూడిదెరంగు మేఘాలు తనమీదకి వచ్చేయడమూ కుర్రవాడు చూశాడు.

కుర్రవాడి తల్లి తను కూచున్న సీటు మళ్ళీ మార్చేసి కొడుకు దగ్గరకి వచ్చేసి కొడుకు పక్కను కూర్చుంది. తన పక్కనుంచే వెళ్తూన్న రెండో పైలట్‌ను ఆమె చూసి అతణ్ణి అడిగింది:

"ఇదేమీ ప్రమాదకరమైనది కాదుకద? మెరుపుజల్లు కదా మరి."

"మాస్కోనుండి మాకు కబురందింది, మెరుపుజల్లు పక్కగా ఉత్తరదిశకి మళ్ళిపోవచ్చు అని" అన్నాడు పైలట్.

ఈలోపున ఒక్కపాళంగా విమానం అంతా చీకటైపోయింది. విమాన దిశగా తరలివస్తూన్న కారు మబ్బులకేసి ప్రయాణీకులు రెప్పవాల్చకుండా చూస్తూ వారిలో వారు కంగారు కంగారుగా మాట్లాడుకుంటున్నారు.

---

*చిన్నపిల్లల ఆట సెట్టు. ఇందులో రకరకాల రంగుల గోళీలు వుంటాయి. డిజైన్ల ప్రకారం రకరకాల నమూనాలను కూర్చాలి. — సం.

విమానం మలుపు తిరిగి, కారుమబ్బుల పక్కంటే వెళ్లింది. అలా ఎంత వెళ్లినప్పటికీ, దానిమీద ఆ కారు మబ్బులు విరుచుకుపడి దాన్ని రెండువైపులనుండీ పట్టుకోవడంచేత అది ఇంకా కుడివైపు, ఇంకా మరింత కుడి వైపు మళ్లవలసి వచ్చింది. మరి అది ఎలా జరిగిందో కాని, విమానం మెరుపుజల్లుల వలయంలో చిక్కుకుంది. ఆ వలయం మధ్య వున్న చిన్న ప్రదేశంలోనే అది ఇటూ అటూ కదిలిపోతూ చక్కర్లు కొట్టింది, కాని దాని చుట్టూ వున్న మెరుపుజల్లుల వలయం అంతకంతకు మరింత మరింత దగ్గరగా బిగుసుకుపోతూంది.

విమానంలో ముందు వరుసలో కూచున్న ఇద్దరు మగవాళ్లు వాళ్ల సీట్లలోనుంచి లేచిపోయి, విమానపు పృష్ఠ భాగానికి వెళ్లడం కుర్రవాడు చూశాడు. మరెందుకనో గాని, కడమ ప్రయాణీకులందరూ వీళ్లిద్దరివెంట కంగారుగా చూశారు. తరువాత మరో ఇద్దరు కూడా వాళ్ల సీట్లలోనుంచి లేచిపోయి, వీళ్లు కూడా విమానపు పృష్ఠభాగానికే వెళ్లిపోయారు. కేబిన్‌లోనుంచి బయటికి వచ్చాడు పైలట్ – విమానానికి కమాండరుగా వున్న పైలట్టే. ఖాళీగా వున్న సీట్లకేసి అతడు చూసి బిగ్గరగా అన్నాడు:

''దయచేసి ప్రయాణీకులందరూ తమ తమ సీట్లలోకి వెంటనే వచ్చి కూచోవాలి! విమానం ఎంతో కష్టంమీద బాలెన్సు నిలబెట్టుకుంటూంది.''

తొలి ప్రమాదసూచన అవుపడేటప్పటికల్లా తమని విమాన పృష్ఠభాగం రక్షించుతుందని అక్కడకి పారిపోయే ఈ రకం వ్యక్తుల పిరికితనం చూసి అతనికి అసహ్యం వేసింది.

''మీ ఆజ్ఞ నా కేమీ అర్థంకావడంలేదండీ!'' అన్నాడు, తమ అసలు సీట్లలోనుంచి లేచివచ్చేసి పృష్ఠభాగపు సీట్లలోకి మారిన మగవాళ్లలో ఒకతను. ''ఏమీ, ఎక్కడ కూచున్నా వొకటికాదా?'' అని అతను అడిగాడు.

''ఏమైనా సరే, మీ సీట్లలోకి వచ్చేసి కూచోండి'' అని పైలట్ జవాబుచెప్పాడు.

పైలట్ ముఖం కోపంగానూ కఠినంగానూ వుంది. వారందరూ వారివారి సీట్లలోకి వెళ్లి కూచునే వరకూ అతడు అక్కడనుంచి వెళ్లిపోలేదు. ఇది జరుగుతూండగా, కిటికీలోనుంచి చూస్తూన్న కుర్రవాడిమీద పైలట్ దృష్టి క్షణమాత్రం పడింది. తలవని తలంపుగానూ, ఇంతటి ప్రమాదకరమైన సమయానికి ఏమాత్రమూ తగని అతి లఘుచిత్తంతోనూ పైలట్ తన మనసులో అనుకున్నాడు: ''చిత్రం! ఈ మెరుపుజల్లుల మబ్బులు దేన్ని పోలివుంటాయో?''

విమానం ఉన్నతిని పుంజుకోవడం ప్రారంభించింది. దాని ఇంజన్లు అమిత ప్రయాసతో ఝుంకరించాయి, దానికి ఎదురుగా వస్తూన్న గాలి తాకిడికి దాని పంజరపు తొడుగు కిర్రు కిర్రు మంటూంది. అది తరుచుగా ఎయిర్ పోకెట్సులో పడుతూండేది, కాని కారుమబ్బులలోనుండి ఎగువకు లేవాలని మొండి పట్టుదలతో పైకి ఎగబాకేది, పైకి వచ్చి, మెరుపుజల్లు పోయేవరకూ తేలుగా వున్న ఉన్నతాకాశంలో కనిపెట్టుకునుండేది. పాత పద్ధతిలో నిర్మించిన విమానాలచేత ఉన్నతిని పుంజింపజేయడమనేది ఏమంత తేలికైన పని కాదు. అయినప్పటికీ విమానాన్ని మెరుపుజల్లుకంటె ఇంకా పైకి వెళ్లేటట్టు నడిపించగల్గాడు పైలట్.

ప్రయాణీకులందరూ మౌనంగా వున్నారు. భయంకరములైన కాలమేఘాలు తమ కంటబడకుండా వుండేందుకని వారిలో చాలామంది కిటికీ తెరలు వేసేశారు. ఒక్క ఆ కుర్రవాడు మాత్రం కిటికీలోనుంచి అలా

చూస్తూనే వున్నాడు. వాడికి ఎంతో నచ్చింది – కిరాతకమూ ఐంద్రజాలికమూ అయిన ఈ సౌందర్యం, తమ విమానానికి దిగువనున్నట్టి భీతావహమైన ఈ కారునలుపు. మెరుపుజల్లు అలముకున్న ఈ ఆకాశపు కారునలుపులోనుంచి ఏమీ కానరావడంలేదు.

కిందుగా, విమానానికి దిగువను, సర్వమూ ధగధగ జ్వలించింది, ధణేలు ధణేలుమని ధ్వనించింది, ఇదంతా విమానంలో ప్రతిఫలించింది. ఆ కారుమబ్బుకింద ఎక్కడో వుండెను మాస్కో. తటాలున విమానం తన నాసి కను దించి, బాణంలా చర్రున కిందకి దూసుకుపోయింది. విమానంలో ఇంధనం అయిపోయింది, ఇక విమానాన్ని పైలట్ కిందకి పడిపోనిచ్చాడు. ఏమంటే కేవలం గరిష్ఠ వేగంతో మాత్రమే మెరుపుజల్లులోనుంచి దూసుకు పోయేందుకు వీలవుతుంది.

ఆతరువాతి క్షణంలో దభీమని ఏదో విరగడం, చెవులు ఘడియలుపడే ధ్వనితో విమానాన్ని విరగ్గొట్టేట్టు ఏదో కిటికీలన్నిటినీ బాదడం మొదలైంది.

ఇలా ఐదు నిమిషాలపాటు జరిగింది, మరి అంతకంటె తక్కువసేపే జరిగిందేమో. ఇక తరువాత, పక్కనే కనబడింది భూమి, సిమెంటు కాంక్రీటు రన్‌వేమీద పరుగెత్తుతూంది విమానం.

వాన బరితెగించి బాదుతూంది. ప్రయాణీకులు విమానంలోనుంచి దిగిపోయి, విమానాశ్రయ భవనంలోకి తమను తీసుకువెళ్లే బస్సుకోసం ఆగకుండా భవనంలోకి పరుగెత్తారు. అందరికంటే వెనకాతల పరుగెత్తాడు పైలట్. వీరందరినీ వదలిపెట్టి వుండాలనిపించలేదతనికి, ఏమంటే తనతో కూడా వీరు గొప్ప ప్రమాదంలోనుంచి ఈ క్షణమే బయటపడ్డారు. అందుకని అతనికి వీరిదగ్గరనుండి వేరైపోవాలనిపించలేదు.

"మీరిప్పుడు ఎక్కడికెళ్తున్నారు?" అని అడిగాడు అతను కుర్రవాడి తల్లిని.

"మేం సిమ్‌ఫెరోపొల్ విమానానికెళ్లాలి. మరో రెండు గంటల్లో అది బయల్దేరాలి. బయల్దేరుతుందో లేదో మరి?"

"తప్పకుండా బయల్దేరుతుందీ!" అని పైలట్ జవాబుచెప్పాడు. "రెండు గంటల్లో ఈ మెరుపుజల్లు ఇక్కడ్నుంచి వెళ్లిపోతుంది. మరి నిమ్నమేఘాలున్నా, అవి 'టియూ'ని ఏమీ బాధించవు."

"రెండు గంటలా?" అని రెట్టించి అడిగాడు కుర్రవాడు. "బహుశ మనం రంగులు కొనుక్కోగలం."

"వాన యెలా కొట్టి కురుస్తూందో చూస్తున్నావా?" అంది తల్లి. "ఈ వానలో నీకు పడిసెం పట్టు కునేను. మనం తిరుగు ప్రయాణంలో వచ్చినప్పుడు రంగులు కొనుక్కుందాంలే."

కుర్రవాడేమీ జవాబుచెప్పలేదు.

"అబ్బాయీ, నే వెళ్లొస్తాను మరి!" అన్నాడు కుర్రవాడితో పైలట్. "నీతో పరిచయం కల్గినందుకు సంతోషంగా వుందోయ్!"

సిమ్‌ఫెరోపొల్ వెళ్లే "టియూ–104" లో ఎక్కడానికని కుర్రవాడూ, తల్లీ కడమ ప్రయాణీకు లతో కలిసి క్యూలో నించున్నారు. అప్పటికప్పుడే కుర్రవాడు రంగులు గురించి మరచిపోయి, విమానం ఎక్కేందుకు క్యూలో తన వంతు ఎప్పుడు వస్తుందా అని ఇక వుండలేక తొందరపడిపోతున్నాడు. సరిగా ఆ వేళకి కుర్రవాడి

యెదట అవుపడ్డాడు పైలట్. ఇందాకట్లా తడిసిపోయిన సూటులోనే వున్నాడు — సూటు మార్చుకుందుకు వేళలేకపోయింది అతనికి.

ఓ నిమిషంపాటు వారు మౌనంగా వున్నారు. పైలట్ ఎక్కడనుంచి వచ్చి తటాలున అక్కడ ప్రత్యక్షమయాడో కుర్రవాడికేమీ తెలియదు, కాని వూరకనే అక్కడ ప్రత్యక్షం కాలేదని మాత్రం కుర్రవాడికనిపించింది.

''ఇవిగో నీకు రంగులు. అన్ని రంగులూ — ఎరుపు, నీలం, ఆకాశనీలం, ఇంకా ఎన్నో రంగులు వున్నాయి'' అన్నాడు కుర్రవాడితో పైలట్. అలా అంటూ అతడు చేయి చాచి, నిడివిగా వున్న చెక్క పేటికను కుర్రవాడికి అందిచ్చాడు: ''తీసుకో, తీసుకుని బొమ్మలేస్తూండు!''

కుర్రవాడు బిడియపడుతూ రంగుల పేటిక పుచ్చుకుని తల్లివంక చూశాడు. క్యూలో నించున్న వారందరూ వీళ్లేకేసి చూశారు.

''ఇంత శ్రమెందుకు తీసుకున్నారండీ!'' అందామె. అంటూ అతనికి డబ్బు అందించింది. ''అంత కష్టమైన విమానయానం తరువాత....''

''ఓసారి మాట యిచ్చిన తరువాత ఇహ తప్పదు'' అన్నాడు పైలట్. అని వూరకున్నాడు.

అతని ముఖం క్రమక్రమంగా, చివరకి పూర్తిగా మేఘావృతమై కరకుదేరింది. అతడు చికాకుతో ఆమె దగ్గరనుండి డబ్బు తీసుకుని తన జేబులో పడేసుకున్నాడు.

ఇక అతడు విమానాశ్రయంలోకి తిరిగివెళ్లిపోయాడు. అంతటి ఆజానుబాహువూ ముందుకు వంగిపోయి, వెళ్లిపోయాడు. కుర్రవాడు రంగుల పేటికను గుండెలకు హత్తుకుంటూ విమానం ఎక్కిపోయాడు. కొన్ని వేల కిలోమీటర్ల ప్రదేశాన్ని నూటపది నిమిషాల్లో దాటబోతాడు. ఉన్నతినీ ఆధునిక విమానపు వేగాన్నీ అనుభవించబోతాడు. భూమిని — అదేమిటోగాని దానిని సరికొత్తగా చూస్తున్నట్టుగా — మళ్లీ మరొకమాటు ఊర్ధ్వంనుండి కిందకి చూడబోతాడు.



చాలా సేపట్నుంచి పడుతూంది వర్షం.

పెనంమీద కోడిగుడ్ల చందమామల్లా దీపాల ప్రతిబింబాలు ఆస్ఫాల్టు రోడ్డుమీద విరియబారాయి.

చెట్లూ, యిళ్లూ, కంచెగోడలూ, పత్రికలు అమ్మే బడ్డీకొట్లూ, ఆ చిన్న పార్కు గేటుదగ్గర వున్న బ్యాగ్లర్ల విగ్రహాలూ ఇటువంటి వాతావరణానికి అలవాటుపడిపోయాయి. మరిప్పుడు ఎంత తడిసినా వాటికి వొక్కటే. వాటి వాటి పనులను అవి చూసుకుంటున్నాయి: చెట్లు కొమ్మల్ని ఆడించుతున్నాయి, కంచెగోడలు తమను అంటిపెట్టుకున్నట్టి మాస్కోనుంచి వస్తూన్న సర్కస్ గురించి ప్రకటించే తడి పోస్టర్లను గట్టిగా పట్టుకున్నాయి, యిళ్లు తమ సింహద్వారాల తలుపులచే దభీ దుభీమని చప్పుడు చేయించుతున్నాయి, తమ కిటికీలచే దీపకాంతులను మెరిపింపజేస్తున్నాయి. మరి బ్యాగ్లర్లు తమ బాకాలను పెదవులదగ్గర పట్టుకుని, ఏదైన అవసరం పడితే వూదడానికి సిద్ధంగా వున్నట్టున్నారు.

ఒక్క పత్రికలమ్మే బడ్డీకొట్లు మాత్రం యే పనీ చేయడంలేదు. అవి అప్పటికప్పడే మూసేసి వున్నాయేమో, అవి కోపంతెచ్చుకుని వాటి నల్లని అద్దాలను మిలమిల ప్రకాశింపజేశాయి.

వానంటే ఇహ ట్రామ్‌బండ్లకు సరదావే. వానలో తడిసిన ట్రామ్‌బండ్లు తాము సరిగా ఆ క్షణమే తాజాగా వర్కుషెపులోనుంచి బయటకు వచ్చినట్టు తమ ఎర్రని పార్శ్వాలచే తళ్కులొత్తింపజేశాయి. అవి ఎంతో అలవోకతో పరుగెత్తాయి, మంచి సరదాగా హుషారుగా గంటలు మోగించాయి. ఇక ప్రతి జంక్షనుదగ్గరా చెమ్మగిలిన మరకతపు నిప్పురవ్వలను వెదజల్లాయి. అవి అసలు నిప్పురవ్వలు కానేకావు, అవి మండుతూన్న ఇనుప ముక్కలు. తడిసి వున్న ట్రామ్‌బండి కప్పులమీదనూ, కాంతులీనుతూన్న ఆస్ఫాల్టుమీదనూ అవి పడి చుంయ్‌మని చప్పుడు చేశాయి.

మూడు కార్లు కట్టిన ట్రామ్‌బండి వొకటి బ్యాగ్లర్లకు శరణు యిస్తూన్న ఆ చిన్న పార్కు దగ్గరకి వచ్చింది. ట్రాములో కొద్దిమంది ప్రయాణీకులు మాత్రమే వున్నారు. చివరి కారు కండక్టరు తన గడ్డాన్ని గుండెలమీద వాల్చి కునుకుపాట్లు పడుతూంది. ఆమె అనుభవంగల కండక్టరేమో, అలా కునుకుతూన్నా వైఖరి గంభీరంగా వుంది. ఆమెను వొక పక్కనుంచి చూసినట్టయితే, తన గుండెలమీద వేలాడుతూన్నట్టి తళతళ మెరుస్తూన్న తాళంచెవీ, నీలి టిక్కెట్ల చుట్టా వున్న చిన్న సంచిని ఆమె వూరకే పరకాయించుతూన్నట్టే అవుపడుతుంది.

ఆ ట్రామ్‌కారులోకి ఒక కుర్రాడు రావడంతో ఆమె మేల్కొని అంది:

''తీసుకో టిక్కెట్టు! ఊఁ, త్వరగా....''

కుర్రాడు తన షర్టు జేబులో చెయ్యిపెట్టి చూసుకున్నాడు. తరువాత పంట్లాం జేబుల్లో చెయ్యిపెట్టి తడుముకున్నాడు. ఎంత వెతికినా టిక్కెట్టు డబ్బు మూడు కోపెక్కులూ అవుపడలేదు. కుర్రవాడు ఇహ మారు మాటాడక, ట్రామ్‌కారు దిగిపోవడానికని వెనక్కితిరిగాడు.

''సరే, ఉండు....'' అంది కండక్టరు.

అప్పటికప్పడే ఆమె కునికిపాట్లను పాంతం వదలగొట్టుకుంది. వెళ్లిపోతూన్న ఆ కుర్రవాడివెంట ఆమె చూపు సారించింది. కుర్రవాడు చాలా దూరం వానలో నడిచాడన్న సంగతి ఆమె గ్రహించింది. అతడి తలవెంట్రుకలు ఒకదానికొకటి అంటుకుపోయి పాయలుగా విడిపోయి, తలవెనుక మెడమీద పొట్టి జడలా అల్లుకుపోయాయి.

జడ కొనవెంట, నీటిచుక్కలు వానకి తడిసిపోయి ఉబ్బిన షర్టుకాలరు కిందకి దొర్లాయి. ఇహ నానిపోయిన జోళ్లలోనుంచి నీరు పుసుకూ పుసుకూమని పైకి చిమ్ముతూంది.

"సరే, ఉండు!" అని కండక్టరు కేకేసింది. "అతిశయప్పిల్లడు, అదేమిటో!... రాత్రి అనేనా లెక్కచేయకుండా ఎక్కడికెళ్తున్నావ్?"

"సర్కస్‌వరకూ" అని కుర్రాడు జవాబుచెప్పి, వెనక్కితిరిగాడు. ఆ కుర్రాడికి అంతా వాకటే. అసలా ట్రాము సర్కస్‌వరకూ వెళ్తుందో లేదో ఆ కుర్రాడికి సరిగా తెలియే తెలియదు.

కండక్టరు సణుగుతూ టిక్కెట్టు చుట్టలోనించి టిక్కెట్టు చించి, కుర్రాడికి ఇచ్చి అంది:

"తీసుకో. టిక్కెట్టు కంట్రోలరు వస్తే...."

కుర్రవాడు తడివేళ్లతో టిక్కెట్టు అందుకున్నాడు. ధన్యవాదాలు చెప్పనే లేదు: బహుశ మరచిపోయుంటాడు. మరి, బహుశ చెప్పడానికి ఇష్టంలేకపోయిందేమో. కుర్రాడు అలా నించుని బొమలు ముడిపెట్టి చూశాడు — కిటికీ అద్దం అవతల వాన ఎలా బాదుతూందో. వాడు వానకి భయపడలేదు, ఇహ ఇంటినుంచి దూరంగా వెళ్లిపోడానికనే ట్రాము ఎక్కాడు.

ఎక్కడికి? ఎక్కడికైనా సరే. తనకు కలిగిన తలవంపు ఆ కుర్రాణ్ణి వెంటతరుముతూంది.

ట్రామ్‌కారు ఒక్క కుదుపు కుదిపి కదిలింది.

కండక్టరు తన గడ్డాన్ని మళ్లీ గుండెలమీదకి వాల్చేసుకుంది. నీలి టిక్కెట్ల చుట్ట తగిలించి వున్న సంచి వంక చూస్తూన్నట్టుగా మళ్లీ అలా నించుంది.

ట్రాములో బల్బులు మిణుకు మిణుకుమంటూ వెలిగాయి. వాన పడుతూన్నప్పుడెప్పుడూ అవి గుడ్డిగానే వెలుగుతాయి. షాపులపైన అమర్చిన సైన్‌బోర్డుల పచ్చరంగూ ఎరుపురంగూ అక్షరాలనుండి వస్తూన్న కాంతి చుక్కలు ట్రామ్‌కారు తడి అద్దాల పక్కనుండి పరుగులు తీశాయి. ఇది చూడ్డానికెంతో అందంగా వుండెను. కాని కుర్రవాడు అసలు ఈ రంగురంగుల చుక్కల గురించే ఆలోచించలేదు. వీటిని చూడడమేమో చూశాడు, చూసినప్పటికీ మొగం చిట్లించాడు, మూతి కొలకులు వాల్చేశాడు. వాల్చేసి, పూర్తిగా వేరొక సంగతి గురించి ఆలోచించాడు.

తరువాత ఆ కుర్రాడికి ఆకలేసి ఏమ్మైనా తినాలని బుద్ధిపుట్టింది. తను అలసిపోయినట్టనిపించింది. తలవంపులనిపించి బాధపడే మనిషి చప్పున అలసిపోతాడు. తలవంపుల బరువు తడి షర్టుకంటె పదింతల బలంతో బుజాలను కుంగదీసేస్తుంది. ఏది యేమ్మైనా, షర్టుని తీసేసి పిండేయొచ్చు. కాని తలవంపుల్ని ఏమిటి చేయడం?

ట్రామ్‌మీద ఇంకా అలా వెళ్లడానికే నిశ్చయించుకున్నాడు కుర్రాడు. ఊరకే అలా కూచుని, ఊరకే అలా వెళ్లడమే — ట్రాము వెళ్లినంత సేపూ. మరి, ఆ తరవాతో? ఆ తరువాత ఏమి జరుగుతుందో వాడికి అసలు తెలియదు.

ట్రామ్‌కారులో చాలా సీట్లు ఖాళీగా వుండెను. కాని ఆ కుర్రాడికి పెద్దవాళ్ల పక్కను కూర్చుంమకు మనస్కరించలేదు. వాళ్ల పక్కను తడిసి ముద్ద అయిన అల్లరిపిల్లకాయ కూచుంటే, వాళ్లు కోపంతో పెదవులు బిగించుతారు, మొగం గంటుపెట్టుకుంటారు, మరింత మరింత దూరంగా జరిగిపోయి కూచుంటారు.

ఒక బెంచీమీద కిటికీ పక్కనే ఓ అమ్మాయి పొందిగ్గా కూచుంది. ఆ అమ్మాయి పెదతలమీద లేతరంగు కురులు వాలి వుండడమూ, ఆ చిట్టి కురుల కొనలు రేగివుండడమూ, వెనక్కి వాల్చి వున్న బూడిదెరంగు ఓవర్ కోటుకున్న కుళ్లాయిపైన వానచినుకుల నల్లని మచ్చలు వొత్తుగా పడి వుండడమూ కుర్రాడు చూశాడు.

అడుగుల్లో అడుగులు వేసుకుంటూ కుర్రాడు ఆ బెంచీ దగ్గరకు వెళ్లి, బొమలు ముడిపెట్టి ఆ పిల్లని ఓరకంటితో చూశాడు. పిలవని పేరంటంగా వచ్చిన ఈ తడిసివున్న పొరుగుమనిషిని తను కూడా చూద్దామని ఆ పిల్ల కుర్రాడివంక ముఖం తిప్పింది. కుర్రాడు తబ్బిబ్బుపడి ఆ అమ్మాయిని పలకరించబోయాడు.

ఆ అమ్మాయి పరిచయమున్న అమ్మాయే.

వాస్తవానికి అంతగా పరిచయమున్న అమ్మాయి కాదు. కుర్రాడు అమ్మాయిని ఎరుగును. కాని బహుశ అమ్మాయి వాడిని ఎరిగుండదు.

శరత్కాలంలోనూ శీతకాలంలోనూ వసంతకాలంలోనూ ఇంచుమించు ప్రతిరోజూ ఆ కుర్రాడు ఆ అమ్మాయికి ఎదురుపడేవాడు.

ఆ కుర్రాడు 21 వ నంబరు స్కూల్లో చదువుకుంటున్నాడు. మరి ఆ అమ్మాయేమో 32 వ నంబరు స్కూల్లో చదువుకుంటూన్నట్టుంది. బహుశ ఆ అమ్మాయి కూడా ఆరో క్లాసులోనే చదువుకుంటూండాలి. ఏది యేమైనా, వాళ్లిద్దరి క్లాసులూ ఎల్లప్పుడూ సరిగ్గా ఒక్కవేళకే పూర్తి అయిపోయేవి. కుర్రాడు స్కూలు నుండి యింటికి వెళ్లిపోయేప్పుడు సదోవయా వీథిలోనుంచి వెళ్లేవాడు. మరి ఆ అమ్మాయి చేహొవ్ వీథిలోనుంచి వెళ్లేది. ఒకటవ మే వీథిలో ఇద్దరూ ఒకరికొకరు ముఖాముఖీ ఎదురుపడేవారు.

కుర్రవాడు మొదట్లో ఆ అమ్మాయి గురించి ఏమీ పట్టించుకోలేదు. అందరిలాగానే మామూలు అమ్మాయే కదా అనుకున్నాడు. ఇప్పుడైనా తను ఆ అమ్మాయిని గుర్తించడానికి కేవలం కారణం ఆమెను తరుచుగా చూస్తూండడమే. ఇంకా మరొక కారణం కూడా వుంది: ఏమిటంటే, ముడిచిపెట్టుకుని పడుకున్న పిల్లిలానే అచ్చంగా అవుపడిన నల్లని ఫర్‌టోపీ పెట్టుకుంటుంది ఆ అమ్మాయి. ఆ అమ్మాయి తొందరపడుతూ నడిచివెళ్తూన్నప్పుడు ఆ పెద్ద టోపీ ఆమె నుదుటిమీదకి దిగిపోతూండేదేమో, చూడ్డానికి కొంచెం నవ్వొచ్చేది. మరి ఆ అమ్మాయికి ఇంచుమించు ఎప్పుడూ తొందరే: గబాగబా నడిచివెళ్లిపోయేది. కాస్త ముందుకి వంగి ఆత్రంగా తన స్నేహితురాండ్రవంక చూసేది. ఆ ఆత్రత దేనికో మరి? ఎండుగడ్డిరంగు చిన్న ఉంగరాల కురులు టోపీకిందనుండి పైకి వచ్చేసి, పొడుగాటి నల్లని ఫర్‌లో చిక్కుకునేవి. మొత్తంమీద ఉత్తి మామూలు అమ్మాయే. స్కూలునుంచి వచ్చేటప్పుడు ఆ అమ్మాయిని రోడ్డుమీద చూడడం కుర్రాడికి ఒక మామూలు అలవాటుకింద ఏర్పడిపోయింది. అనగా, మాటవరసకి వీథి మొగను ఓ మూల అద్దాల బంకులో నుంచున్న మిలీషియా మనిషినీ, లేకుంటే ఎగ్రికల్చరల్ హైస్కూలు భవనానికున్న గడియారాన్నీ చూడడం ఎలా అలవాటైపోతుందో అలాగ. ఏమో మరి, అచ్చంగా అలాక్కాదేమో...? ఎటుతిరిగీ, గడియారం తీసివేయబడినప్పుడు తనకి ఏ విధమైన ఆందోళన పుట్టేది కాదు. కాని ఒక వారం రోజులు వీథిలో ఆ అమ్మాయి అవుపడకపోయేసరికల్లా తనకి అదేమిటో బెంగ ఒకటి మనసులో దేవేసినట్టు అనిపించేది. మళ్లీ అమ్మాయి ఎదురయేప్పటికి, మరెందుకో కాని, మనసులో మంచి ఉల్లాసంగా వుండేది. కాని తటాలున కుర్రాడికి కోపంవచ్చేసి ముఖం జేవురించింది. తన పక్కనే దర్జాగా అడుగు

లేసుకుంటూ నడుస్తూన్న సెర్యోజ దెర్యాబిన్‌కేసి తను ఓరగా చూశాడు. అప్పుడు తను నిశ్చయించుకున్నాడు, ఇక ఆనాటినుండి మరి ఆ అమ్మాయివంక ఒక్కసారైనా చూడకూడదని. ఏ అమ్మాయి అయినా యెదురుపడినప్పుడు తను ఆమెకేసి ఎందుకు చూడాలి?

కాని మనిషి స్వభావం మహా వెకిలిగా వుంటుంది. ఈ క్షణం ఏదైనా ఒకటి నిశ్చయించుకునే సరికల్లా, మళ్లీ ఉత్తరక్షణమే సరిగ్గా ఇటుంచటు చేయ బుద్ధవుతుంది.

మార్చినెల చివరి దినాల్లో, అసలైన వసంతకాలం ఇంకా నడుస్తూండగా, ఓనాడు ఉన్నట్టుండి భారీ నైరుతి గాడ్పులు బూడిదెరంగు మబ్బులను కొరడాలతో తోలుతూన్నట్టు ఆకాశాన తోలుతున్నాయి, ఇక ఆరంభమైంది మంచుపడడం – బంకలాంటి మంచు. పడింది, పడింది – అలా పడుతూనే వుంది, పోప్లార్‌చెట్లని వంచేసింది, నల్లని బురద గుంటల్ని కప్పేసింది, ఎలెక్ట్రిక్ తీగెల్ని పట్టుకుని వేలాడింది. దానంతటదే మనిషి అరచేతుల్లోకి వెళ్లిపోయి, కరకరమంటూ, వాటిచేత నేర్పుగా తనను మంచుబంతులుగా చేయమని అడుగుతూంది ఆ మంచు.

వాళ్లిద్దరూ స్కూలునుంచి వెళ్లిపోతూండగా,

''జాగ్రత్త!'' అని పళ్లుబిగించి అన్నాడు సెర్యోజ, ''దారిలో శత్రువు!''

నల్లని టోపీ పెట్టుకున్న శత్రువు ఎదురుగా రావడం వాళ్లకి కనబడింది. శత్రువు నడక ఎప్పటిలాగానే తొందర తొందరగా వుంది. దెర్యాబిన్ పన్నిన జిత్తులమారి పథకంవల్ల శత్రువుకి ఏ అనుమానమూ కలగలేదు.

సెర్యోజ మంచుకేసి నేలదిశగా వంగాడు. కుర్రాడు కూడా నేలదిశగా వంగాడు. బంతి సూటిగా ఢామని ఫర్‌టోపీకి తగలాల్సిందే! ఇహ అప్పుడు తెలుస్తుంది.... అప్పటికప్పుడే దెర్యాబిన్ ఎడమకంటితో ఓరగా చూసి, చేతిలో వున్న మంచుబంతిని విసరడానికి సిద్ధంగా వున్నాడు. దెర్యాబిన్ చేతికి మంచి గురి తెలుసును, కంటికి కూడా మంచి గురి వుంది. అయితే జరిగినదేమిటి, ఎలా జరిగింది? కుర్రాడు ఛటుక్కున నిటారుగ్గా లేచి, అదేదో అనుకోకుండా జరిగినట్టుగా, సరాసరి ఆ అమ్మాయి ఎదట నించున్నాడు.

ఇక తరువాత కుర్రాడు దెర్యాబిన్‌వైపు తిరిగి, మంచు వోడుతూన్న ముఖంతో, పళ్లుబిగించి అన్నాడు:

''నీ కళ్లు ఎక్కడున్నాయిరా?''

చికాకుపడి తత్తరబోయిన దెర్యాబిన్ ఏమీ జవాబుచెప్పలేదు. వాడొకవేళ పోల్చేసుకున్నాడేమో?...

ఎండకాలం వచ్చేసింది. కుర్రాడు ఆ అమ్మాయిని ఇహ కలుసుకోవడంలేదు. ఆ అమ్మాయిని మరచి పోయాడు కూడానూ.

కాని ఇప్పుడు తటాలున ఆ అమ్మాయిని, ముడుచుకుని పడుకున్న పిల్లిని జ్ఞప్తికి తెచ్చే టోపీ లేకపోయినప్పటికీ, పోల్చుకున్నాడు.

కుర్రాడు అమ్మాయి పక్కనే కూచున్నాడు. జాగ్రత్తగానే కూచున్నాడు, ఐనప్పటికీ అమ్మాయి తన మోకాళ్లమీద పెట్టుకున్న గొడుగుకొనను అన్వేసుకున్నాడు. ముఖం చిట్లించుకుని వెనక్కితిరిగి, తన తడి చేతితో అమ్మాయి రెయిన్‌కోటును అవకరంగా రాసుకుపోయాడు.

కుఱ్రాడు చిడిముడి పడుతూ, సీటు చిట్టచివరి అంచువరకూ జరిగిపోయి, తన మోచేతిని డొక్కకి నొక్కేసుకున్నాడు. ఆ అమ్మాయి దీనిని చూసిందేమో, అప్పుడు అంది:

''భయపడకు, అది వాటర్‌ప్రూఫే.''

''నేనేం భయపడ్డంలేదు'' అని కుఱ్రాడు గొణిగి, ట్రామ్‌కారు నేలకేసి చూడడం మొదలెట్టాడు.

ట్రామ్‌కారు నేలకి సన్నని చెక్కబద్దీలు డోరియాలు మాదిరిగా బిగించి వున్నాయి. తడిసిపోయిన టిక్కెట్లు చెక్కబద్దీలకి అంటుకుపోయి వున్నాయి....

''గొడుగు లేనప్పుడు బాగుండదు'' అంది అమ్మాయి కాస్త మెల్లగా.

అమ్మాయి మాటల్లో ఆడపిల్లలకి సహజమైన జాలి లేనేలేదు. ఆ మాటల్లో వున్నదల్లా పిసినిగొట్టు సానుభూతే. కుఱ్రాడు ఆలోచనలోపడి జవాబుచెప్పాడు:

''ఏమీ బాగుండదు....''

''వాన కొట్టి కురుస్తూంది'' అంది అమ్మాయి.

ఇది అనవసరమైన మాట. ఆ అమ్మాయి బాతాఖానీకోసం మాట్లాడినట్టు స్పష్టంగా కనబడుతూనే వుంది. అసలు అది అలా వుండగా, వాన కొట్టి కురవడంలేదు. చిన్న తుంపిళ్లు మాత్రమే పడుతున్నాయి. కుఱ్రాడు అదే అన్నాడు:

''అయ్యో, 'కొట్టి కురుస్తూంది'ట.... కల్పించి చెప్పొద్దు.''

''నేను కల్పిస్తున్నానా?'' అంది అమ్మాయి కోపంతెచ్చుకుని. ''అవును అంతా వుత్తదే. ఆకాశాన మేఘమే లేదు, వీథంతా పొడిగా వుంది. మరి, నువ్వూ వొత్తి పొడిగానే వున్నావు.''

''నీకు బాగానే వుంది'' అన్నాడు కుఱ్రాడు కోపంతో చిరునవ్వు నవ్వుతూ. ''రెయిన్‌కోటు వేసుకుని, దానికితోడు గొడుగు కూడా వేసుకుని. ఇంటి కప్పుకింద వున్నట్టు.''

''నాకు బాగానే వుంది'' అని అమ్మాయి వెంటనే ఒప్పుకుని, మరెందుకనో గాని నిట్టూర్చింది. తరువాత అంది: ''గొడుగు నాది కాదు. అమ్మది. అదిగో అక్కడ ఆ ముందు సీటులో కూచుంది.... మరి, నువ్వు గొడుగు తెచ్చుకోలేదేమి?''

''నాకు గొడుగు లేదు'' అని మాటలు స్పష్టంగా పలుకుతూ జవాబుచెప్పాడు కుఱ్రాడు. ''అసలు వుంటే నే నిప్పుడు యింట్లోనే కూచునుందును. అదీ అసలు సంగతి.''

అమ్మాయి ఆశ్చర్యపడడం కుఱ్రాడు సంతృప్తితో చూశాడు.

''గొడుగు లేకుండా వానలో బయల్దేరడమూ, మరి గొడుగుతో.... ఇంట్లో కూచోవడనూ?'' అంది అమ్మాయి.

''అవును'' అన్నాడు కుఱ్రవాడు. పెదవులు బిగించి, మొగం చిట్లించాడు. ''ఏం, అర్థంకాలేదా?'' అని అడిగాడు.

''నువ్వు అసలదేమిటో....'' అంది అమ్మాయి, కొంచెం కోపంతెచ్చుకుని.

''ఏమిటి?'' అని కుఱ్రాడు ధుమధుమలాడుతూ అడిగి, ఇంకా అన్నాడు: ''ఏం, తప్పు నాదా? అలా జరిగింది....''

''ఎలా?''

ఈ మాటను ఆ అమ్మాయి అతి నిర్లిప్తంగా అంది. కేవలం మర్యాదకోసం అందేమో కూడా. కాని అమ్మాయికి ఆసక్తికలగడం కుర్రాడు కనిపెట్టాడు.

కోపంతో మొగం చిట్లించడం మానేశాడు కుర్రాడు.

ఇంతకీ ఈ అమ్మాయి కాస్త పరిచయం వున్న అమ్మాయే. పరిచయస్థుడితో మాట్లాడినట్టుగానే తనతో మాట్లాడింది. మరి ఆనాడు ఆ అమ్మాయికి సూటిగా తగలబోతూండిన మంచుబంతి దెబ్బనుండి తను ఆ అమ్మాయిని రక్షించాడు కూడా. మంచుబంతి మంచి దృఢంగా వుండెను. నిజానికి ఆ సంగతి ఆ అమ్మాయికి తెలియనే తెలియదు. అయినా ఆ సంగతి అమ్మాయికి తెలియకపోవడమే నయం అనుకున్నాడు కుర్రాడు. మరేమో తన భంగపాటు గురించి ఆ అమ్మాయితో చెప్పాలని అనుకున్నాడు. ఒకటి మాత్రం నిజం. అందరికంటేనూ గట్టి మనస్సుగలవాళ్లకీ ఆత్మాభిమానం వున్నవాళ్లకీ సహితం ఒక్కొక్కప్పుడు తమ దుఃఖాన్ని ఇంకెవరితోనైనా సరే పంచుకోవాలని వుంటుంది. ఇందువల్ల మనస్సు స్తిమితపడుతుంది.

''చూశావుకదూ....'' అంటూ కుర్రాడు నిట్టూర్చి, తన కాళ్లకున్న నానిన జోళ్లను ఇటూ అటూ కాస్త కదిపాడు. ''చూశావుకదూ'' అని మళ్లీ మరోమాటు నిష్కర్షగా అన్నాడు, ''నేను ఓ డిస్కవరీ చేశాను.''

కుర్రాడు ''ఇన్‌వెన్‌షన్'' అనాలని అనుకున్నాడు, కాని దానంతటదే ''డిస్కవరీ'' అనే మాట నోటి కొచ్చేసింది. ఏమో మరి, కుర్రాడన్నదే సరైనదేమో....

ఇంతకీ కుర్రాడికి అసలా విషయం వాస్తవంగా డిస్కవరీలా అవుపడింది. అది మూడు రోజులకింద జరిగింది. ఆనాటికింకా వర్షం లేదు, సూర్యుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు. కుర్రాడు షెడ్డుకప్పుమీద నించున్నాడు, నించుని గొడుగేసుకున్నాడు.

''జంప్‌చేయరా!'' అని గోలచేశారు కిందనున్న కుర్రాళ్లు.

కుర్రాడు జంప్‌చేయలేదు.

''వాడికి హడలేస్తూందిరా'' అన్నాడు నేస్తులందరిలోనూ పొట్టిగా వలంగా వున్న అబ్బాయి. వాడు అలా అని పెదవి విరిచాడు.

కుర్రాడు మౌనంగా వుండిపోయాడు.

నేలమీద నించుని చూస్తే, షెడ్డు వుత్త మామూలుగానే అవుపడింది పాతదిగానూ పొట్టిగానూ. నేలకీ కిందకి దిగిపోయున్న చూరు అంచుకీ కేవలం మూడు మీటర్లే వుంటుంది. కుర్రాడు మామూలుగా వుంటాడు. పొడుగూ కాదు పొట్టీ కాదు, సన్నని చేతులు, వొత్తుగా పెరిగిపోయి కత్తిరవేస్తేవద్దనని పీచులాంటి జుట్టు. ఆగస్టునెల ఎండల్లో అందరి కుర్రాళ్లకులాగే బాగా కావిదేరిన వొళ్లు. నీలిరంగు బనియను పటకాకిందనుంచి పైకొచ్చేసి వుంది. కుర్రాడు వీరుడులా పిసరంతైనా అవుపించడంలేదు. అయినా ఆనాటివరకు పిరికితనమూ చూపెట్టలేదు.

ఇప్పుడేమో వాడు అలా నించున్నాడు, జంప్‌చేయలేదు.

''వెళ్లి, వాణ్ణి కిందకి ఒక్క తోపు తోస్తే సరి!'' అని కొంకినక్కలా సన్నంగానూ బిరుసు జుట్టూ వున్న

ఓ అమ్మాయి — మగకుర్రవాళ్లతోనే ఎప్పుడూ వుంటూ, వాళ్ళు చేసే అన్ని అపాయకరములైన పెంకెపనుల్లోనూ పాల్గొనే ఆడపిల్లల రకంలోకి వచ్చే అమ్మాయి — ఓ ప్రతిపాదన పారేసింది. ''నీకేనా చెబుతూన్నది! జంప్‌చేయ్! లేకుంటే బోర్లాపడు! ఏదో వొకటి చేయి, అంతే కాని ఇహ మమ్మల్ని అన్నేసేపు నిలబెట్టకు!'' అంది.

కుర్రాడు జవాబుచెప్పలేదు.

ఆకాశాన మేఘాలు పరుగెత్తుతున్నాయి — పసుప్పచ్చని ఎయిరోస్టాటుల్లా వున్న పెద్ద మేఘాలు, గుండ్రని మేఘాలు. నేలమీద నించుని చూసినప్పుడు వుత్త మామూలు షెడ్డులా అవుపడుతూన్న ఆ షెడ్డు, ఆకాశంలోకి లేచిపోతూన్న నౌక అయినట్టుగా మేఘాలను కలుసుకుందుకు తేలిపోయింది.

ఇక యింటి ముంగిలి — రోదసీ ఊర్ధ్వంలో పరస్పరం వీక్షించుకుంటూన్న గ్రహాల ఉపరితలాన్ని జ్ఞప్తికి తెచ్చింది. మధమధ్య డాండీలియన్ పుష్పశీర్షాలున్నట్టి దుమ్ముపట్టిన పసరిక లంకలు పసిడి దీవుల గుంపుల్లా వున్నాయి. ఇక షెడ్డు దగ్గర వున్న పీపాలోని నీరు నిట్టపు గట్లున్న గుండ్రని సరస్సులా అగపడి గాఢమైన నీలివర్ణంతో ప్రకాశించింది.

అన్నిటికీ పేర్లు పెట్టడమూ బిరుదులివ్వడమూ ఆ కుర్రాడికి ఎంతో సరదా. వాటిని ఎప్పుడూ కూడా వాడు చప్పున కల్పించేసేవాడు. పీపాలో ఒడుదొడుకులు లేకుండా అద్దంలా నిర్మలంగా వున్న నీటికి ''నీలికాంతుల సరస్సు'' అని పేరుపెట్టాడు, పసిడి మచ్చలున్న పచ్చికమళ్లని ''అజ్ఞాతారణ్య ద్వీపపుంజం'' అన్నాడు....

''ఇహ జంప్‌చేయరా!'' అని కేక. గొరకచీపురు జుట్టు అమ్మాయి గొంతుక చించుకుని అరచిన కేక అది.

కుర్రాడు తటాలున జ్ఞప్తికితెచ్చుకున్నాడు: సరే వేళైంది అనుకున్నాడు.

ఇహ గొడుగు పైకెత్తాడు.

నల్లని గొడుగు నూరురెట్లు తగ్గించిన సర్కస్ భవనపు డోములా వుంది, ఎటొచ్చీ ఆ డోము కిందను ఎల్లప్పుడూ దీపాలు వెలుగుతూంటాయి. మరి ఈ డోముకిందను మాత్రం అంతా చీకటిగా వుంది. ఒకేఒక వెలుగు రేఖ మాత్రం, పిసరంత రంధ్రం, మెరుస్తూంది. సూదిమొన బెజ్జంలాంటిది. నల్లని అంతరిక్షాన వున్న నీలినక్షత్రంలా, నలుసంత ఆకాశబిందువు వొకటి ఆ రంధ్రంలో తళతళ ప్రకాశించుతూంది.

''నీల లుబ్ధకం'' అని కుర్రాడు గుసగుస గొంతుకతో అన్నాడు. కొద్ది కాలంలో కల్గనున్న సంతోషంయొక్క ముందుసూచన ఆ కుర్రవాడి మనస్సులో మెదిలింది.

తన నడినెత్తినున్న తలవెంట్రుకలకి గొడుగుగుడ్డ తగిలేటట్టుగా, గొడుగుని బాగా కిందకి దించేశాడు కుర్రాడు. వాడికిప్పుడు నేల మాత్రమే కనబడుతూంది, నక్షత్రాలు వుండే ఆకాశం బదులు ఎండకి వేడెక్కి ఎందుచేతనో గాని సరేసులా వాసనేస్తూన్న నల్లని గొడుగుగుడ్డ వుంది. నక్షత్రంలాంటి కన్నంలోనుండి ఇందాక ట్లాగానే స్వచ్ఛమైన నీలవర్ణం ప్రకాశించింది. అటుతరువాత సూర్యుడు ఛటుక్కున ఆకాశంమీదకి వచ్చాడు. కళ్లు మిరుమిట్లు కొలిపే అగ్నిలా ఆ నక్షత్రం జ్వలించి, చిన్నచిన్న కాంతి కిరణాలనూ రంగురంగుల వలయాలనూ వెదచల్లింది.

''అతి కొత్త నక్షత్రం'' అన్నాడు కుర్రాడు మెల్లగా.

''ఓహో! 'దేవుడా, రక్షించు!' అని గొణుక్కుంటున్నాడ్రా వాడు!'' అని ఆ బక్కచిక్కిన పిల్ల అందరికీ బిగ్గరగా విశదపరచి, తన కోపం చూపించడానికని వెనక్కితిరిగిపోయింది.

''వాడికి ఖగోళపటం అంతా కంఠస్థమే, అయినా ఏం లాభం?'' అన్నాడు బుజాలెగరేస్తూ అక్కడున్న కుర్రవాళ్లందరిలో వయస్సులోనూ బుద్ధిలోనూ పెద్దవాడైన కుర్రవాడు. ''మూడు మీటర్లు జంప్‌చేయలేక పోతున్నాడు. ఇలాంటి రోదసీనావికుణ్ణి ఎక్కడైనా చూశారా?''

''ఏమిటీ?'' అని అడిగాడు, షెడ్డుకప్పుమీద నించున్న కుర్రాడు. వాడికి చిట్టచివరకి అర్థమైంది: తను భయపడుతున్నట్టు వాళ్లు నిశ్చయించుకున్నారన్నమాట!

కుర్రాడు ఏమీ తొందరపడకుండా సావకాశంగా గొడుగు మూసేశాడు: గొడుగును తనిప్పుడు జాగ్రత్త పెట్టడం అవసరం అనుకున్నాడు.

''గొడుగులేకుండా గెంతగలను!''

కుర్రాడు గొడుగు పారషూట్ పట్టుకోకుండానే జంప్‌చేసేశాడు! వంటచెరకు కుప్పల మధ్యనుండి వాలి, మోచేతులమీదా మోకాళ్లమీదా గడ్డిలో పడిపోయాడు — సూటిగా ''అజ్ఞాతారణ్య ద్వీపపుంజం''లోకల్లా పెద్ద ద్వీపంలో....

''ఇంతేనా!'' అంది గొరకచీపురు జుట్టు కొంకినక్క అమ్మాయి. ఏమనడానికీ తెలియనప్పుడు ఆడపిల్లలు ఎప్పుడూ ఈ మాటే అంటారు.

నేస్తులందరిలోనూ స్థూలకాయుడూ చిన్నవాడూ అయిన కుర్రవాడు బూరెబుగ్గలు నోట్లోకి పీల్చుకుని కొరుక్కున్నాడు.

''మరెప్పుడూ అలా గెంతలేడనుకున్నావుట్రా?'' అని ఠంగణా అడిగాడు. ఆ పొట్టివాడు రొజుకుంటూ తుప్పుతూ తూలుతూ వంటచెరకు కుప్పమీదనుంచి షెడ్డుకప్పుపైకి ఎగబాకడం మొదలెట్టాడు.

కుర్రాడు ఏమీ జవాబుచెప్పలేదు. గొడుగు తెరచి, గొడుగుగుడ్డ కన్నంలోనుంచి వస్తూన్న సూర్యుణ్ణి పట్టుకున్నాడు. గొడుగుగుడ్డ ఆకాశంమీద నక్షత్రం దోబూచులాడుతూంది. దానివంక కుర్రాడు కన్నుగీటి, మెల్లగా చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఈ విధంగా జన్మించింది ఆ డిస్కవరీ.

....ఇదంతా ఆ అమ్మాయికి తను చెప్పలేదు కద. ఇంతకీ చెప్పినా ఎంతో సేపు పట్టుతుంది, పట్టినా ఆ అమ్మాయికి అర్థంకాదేమో కూడా. కుర్రాడు కేవలం ఈ నాల్గు మాటలే చెప్పాడు:

''ప్లానెటేరియమ్ ఒకటి తయారుచేద్దామని బుద్ధిపుట్టింది. చిన్న ప్లానెటేరియమ్, ముడిచేయడానికి వీలుగా వుండేది. అన్ని తారాగణాలనీ గొడుగుమీద మోసుకెళ్లాలి. అర్థమైందా? గొడుగు తెరుస్తావు — ఇంకేముంది, నీ నెత్తిపైనుంటాయి నక్షత్రాలు. నక్షత్రాల స్థానంలో చిన్నచిన్న కన్నాలు పొడవాలి సూదితో — అంతే. ఇహప్పుడు పట్టపగలే తెలిసిపోతుంది — ఏ నక్షత్రం ఎక్కడవున్నదీ, అవి కంటికి కనబడనప్పటికీ కూడా. గొడుగు ఎలా పట్టుకోవాలో అదొక్కటే ముందుగా గణించాలి....''

''మరి, నీకు అన్ని నక్షత్రాలూ తెలుసునూ?'' అని ఆశ్చర్యపడుతూ అడిగింది ఆ అమ్మాయి. ''మరి, గణించావూ?''

''ఆఁ. సరిగ్గా వున్నట్టు రాత్రిపూట చూసుకున్నా....''

పచ్చగడ్డిలా, యేటిపై పొగమంచులా, పేవ్‌మెంటుమీద చల్లారుతూన్న ఆస్ఫాల్టులా వాసనేసింది రాత్రి.

కుర్రవాడు మేడమెట్లు దిగాడు. ఆ మేడలో దీపాలు ఆరిపోయున్నాయి. కిటికీ అద్దాలు మకమకలాడుతూ మెరిశాయి. పగటిపూట తాపానికి ఇంటిగోడలనుండి వేడి వస్తూంది. ఉష్ణదేశాలనుండి ప్రయాణంచేసివచ్చి, పరిచితమైన రేవులో లంగరు వేసుకున్న ఓ పెద్ద స్టీమరులా వుంది యిల్లు. మరి, ముంగిట లోలోపలికున్న షెడ్డు – నల్లగా నిటంగా వున్న పెద్ద కొండలా ముందుకు చొచ్చుకొనుంది.

కుర్రాడు ముంగిలి దాటి షెడ్డుమీదకెక్కాడు.

ఇప్పుడంతా వెనకట్లా లేనేలేదు. పచ్చిక మొలచిన మచ్చమచ్చల దీవులు చీకట్లో అదృశ్యమైపోయాయి. పీపాలో వున్న వర్షపు నీరు పిల్లసరస్సులా లేనేలేదు, నీరు నల్లగా వుంది. దానిలో నక్షత్రాలు రెండు ఏ చలనమూ లేకుండా వేలాడుతున్నాయి. ఎవరో గాని భూగోళానికి ఏకంగా పైనుంచి కిందవరకూ తవ్విన నుయ్యిలా వుం , ఇప్పుడీ గుండ్రని నూతిలోనుంచి దక్షిణ ఆకాశాన వున్న నక్షత్రాలు ఆ కుర్రాడికేసి చూస్తున్నాయి.

కుర్రాడి బనియనుకింద వున్న అలారమ్ టైమ్‌పీసు టిక్కుటిక్కు మంటూంది. ఎదురురొమ్ములో దాచుకున్న పిట్ట గుండెకాయలా అది భయపడుతూ భయపడుతూ కొట్టుకుంటూంది. తనకు సౌఖ్యంగా వున్న పడకగది టేబిలుమీదనుంచి తనను లాగేసి, బనియనుకీ నగ్నంగా వున్న పొట్ట చర్మానికీ నడుమ తనను దాచేసి, తను ఎన్నడూ ఎరగని ఎక్కడికో ఎందుకు తనను తీసుకొచ్చారో దానికేమీ అర్థంకాలేదు. తను అస్ట్రనామికల్ క్రోనామీటరుగా పనిచేయాల్సి వచ్చిన సంగతి ఆ అలారమ్ టైమ్‌పీసు ఏమాత్రమూ ఊహించుకోలేకపోయింది.

కుర్రాడు దాన్ని తీసుకొచ్చి బల్లచెక్కల పక్కను వుంచాడు. ఖైదులోనుండి తను విముక్తిపొందడం చూసుకుని అలారమ్ టైమ్‌పీసు వెంటనే స్తిమితపడి, పరాయి చోట కాకుండా కేవలం తన గదిలో వున్నట్టే వ్యవహారసరళిలో టిక్కుటిక్కుమని పనిచేయసాగింది.

ఒక కెరటంలా పాకుకొచ్చింది తేమ, ఏమంత బలంగా లేదు కాని, మరుక్షణంలో చల్లని గాలికింద పైకి లేచింది. కుర్రాడు కాస్త తటపటాయించాడు, మోకాళ్లు ముడుచుకుని, రెండు చేతులూ ఒకదానిమీద ఒకటి అడ్డంగా బుజాలమీద పెట్టుకుని కూచున్నాడు. అర్ధరాత్రికి ఇంకా పదినిమిషాలు తక్కువని అలారమ్ టైమ్‌పీసు రేడియమ్ ముళ్లు చూపెట్టాయి.

కుర్రాడు ఆకాశంవైపు చూస్తున్నాడు.

అది ఆద్యంతాలు లేకుండా ఎంత అనంతంగా కనబడిందంటే ఊపిరి తీయడానికే హడలేసుకొచ్చింది.

ఆ చిట్టచీకటిలో నక్షత్రాలు ఆర్ద్రతతో ప్రకాశించాయి. కుర్రాడికి ఉత్తరాకాశ పటం క్షుణ్ణంగా తెలుసును, కేవలం జ్ఞాపకంమీదనే ఆ పటం చిత్రించగలడు. సహజంగానే వాడు జ్ఞాపకం పెట్టుకున్నవి ప్రధానమూ,

ప్రకాశమానమైన నక్షత్రాలే – ఏడిగీతలతో తారాగణాల ఆకారాన్ని ఏర్పరచే నక్షత్రాలే. ఇప్పుడు వాడికి సాయంచేసేందుకు ప్రయత్నించుతూన్నట్టుగా, ఆకాశం తళ్కులీనుతూన్న తన యావత్తు నక్షత్రనిధినీ ఒక్కసారి వెలికి వెలిపేసింది.

కుర్రాడు ఎంతోసేపు ఆకాశాన్ని చూశాడు. చూస్తూన్నకొద్దీ మరిన్ని మరిన్ని నక్షత్రాలు అంతులేని ఆ చీకటిలోనుంచి వెలికి వచ్చేస్తున్నాయి. అన్నిటికంటెనూ దగ్గరగానూ వెచ్చగానూ ప్రకాశించినవి ఇవి కావు, అవి ఇతర నక్షత్రాలు – అవి ఇంత తేటగా ప్రకాశించడంలేదు కాని, అవి హెచ్చుగా వున్నాయి. వాటి వెనకాల ఎంతో దూరాన అగ్నికణాలతో నిండిన ఒక పొలానికి పొలమూ మిణుకు మిణుకుమని ప్రకాశించుతూంది. కాని ఇంతటితో పూర్తి అయిపోలేదు. ఆ దృశ్యానికి అలవాటుపడి చూసేసరికి, ఆకాశమంతా అతి సన్నని నక్షత్రధూళితో వెద చల్లబడి వుండడం ఆ కుర్రాడికి అవుపడింది. ఈ నక్షత్రధూళి దట్టమై పాలపుంత పొగమంచు చారగానూ ఇతర ఆకాశగంగలలోని కాంతివంతమైన చిన్నచిన్న ద్వీపాలుగానూ రూపొందింది.

కుర్రాడు దిగ్భ్రమచెందిపోయాడు. ఇన్నిటినీ తను జ్ఞాపకం పెట్టుకోలేకపోతాడేమో! ఇవన్నీ ఖగోళపటంలో లేవే!

అందులో ఇదంతా చిత్రించడం సాధ్యం కాకపోయుంటుంది....

కాని మరికాస్సేపటికి కుర్రాడు తన మనస్సు స్తిమితపరచుకున్నాడు. ముఖ్యమైన నక్షత్రాలు మాత్రమే తనకి అవసరమని తలపోశాడు. ఈ నక్షత్రాలతో ఏర్పడిన సముదాయాలు అవిగో – సప్తర్షి, కాస్యపి, ఉత్తరాభాద్ర. కనీసం ఆరంభించేందుకు చాలు.... వీటి పుణ్యమా అంటూ తనకు రాత్రి ఆకాశం పరిచయమైనట్టే. అవి మహా వృక్షాల్లా – వేటి పక్కనుండైతే దట్టమైన చిట్టడవులకు దారితీసే బాటలుంటాయో అటువంటి మహావృక్షాల్లా వున్నాయి; ప్రధాన ద్వీపాల్లా – వేటినిబట్టైతే నావికులు ద్వీపపుంజాల రేఖాకృతులను పోల్చుకుంటారో అటువంటి ప్రధాన ద్వీపాల్లా – వున్నాయి....

ఈ విధంగా కుర్రాడు తలపోశాడు, కాని ఇంకా కొత్త అగ్నికణాల కోసం, ఇంకా కొత్త మిణుగురుల కోసం తన కళ్లతో అలా వెతుకుతూనే వున్నాడు. వాటిలో ప్రతిదానిలోనూ ఒక రహస్యం గడగడ వణుకుతూ ప్రకాశించింది.

గాలి చెమ్మగానూ చలిచలిగానూ బద్ధకంలో వీస్తూంది. రోదసీశీతలం భూమినుండి వస్తూన్న ఉష్ణ వాయువులలోకి భారమైన బిందువులను ఇంకింపజేస్తూన్నట్టూ, చెమ్మగిలిన తేటదనాన్ని వాటిలో కరిగించుతూన్నట్టూ అనిపించింది. కుర్రవాడు జంకాడు. ఆకాశం విడుస్తూన్న చల్లని ఊపిరి నావికుణ్ణి ప్రయాణానికి రమ్మనమని పిలుస్తూన్న గాలిలా వుందని తనకనిపించింది. దారుణమైన ధ్వనులు నిశ్శబ్దాన్ని నిర్దాక్షిణ్యంగా నరికేస్తున్నాయి. కుర్రాడు బెదిరాడు, కాలి మడమతో అలారమ్ టైమ్‌పీసు బటను నొక్కాడు. టైమ్‌పీసు తల్లకిందులై, కోపంతెచ్చుకుని మౌనందాల్చింది. అర్ధరాత్రి ప్రవేశించింది.

కుర్రాడు ఆకాశంకేసి చూసి, ధ్రువతారను పోల్చుకున్నాడు. దానినుండి సరాసరి నిలువుగీత దిశగా ఉత్తరానికి – అంధకారమయంగా వున్న దిఙ్మండలం వరకూ, తరువాత దక్షిణదిశగా, తరువాత తూర్పుదిశగా, ఇహ అటుతరువాత పడమర దిశగానూ చూపు సారించాడు.

కుర్రాడు జ్ఞాపకంపెట్టుకున్నాడు.

నిజమే, వాడికి ఖగోళశాస్త్రం ఏమంత బాగా తెలియదు. అయినప్పటికీ ఏదోకొంత తెలుసును, దాన్నిబట్టి మామూలుగా తర్కించుకున్నాడు. ధ్రువతార చుట్టూ ఆకాశం తిరుగుతుంది, ఇరవైనాలుగు గంటలకి ఓసారి పూర్తి భ్రమణంచేస్తుంది. భూమినుండి అలాగే అనిపిస్తుంది. అనగా, నక్షత్రాలు గంటకి వృత్తంలో ఇరవై నాలుగో భాగం ప్రయాణించుతాయి. దీన్నిబట్టి ఏ వేళప్పుడు, పగలైనా సరే రాత్రి అయినా సరే, అవి ఎక్కడుం టాయో కచ్చితంగా చెప్పొచ్చు. ఐతే అవి అర్ధరాత్రప్పుడు ఎక్కడుంటాయో మనకి మొట్టదట తెలిసివుండాలి. కుర్రాడికి ఇప్పుడు అది కూడా తెలిసింది.

ఇహ తారాగణాలు తన చేతిలో వున్నాయన్నమాట....

''నే నంతా సరిచూసుకున్నాను, సరిగ్గా గణించాను'' అన్నాడు కుర్రాడు.

''మరి, తరువాత?'' అని అడిగింది అమ్మాయి.

''మరి, తరువాత.... అంతే. నాకు గొడుగు లేదు మరి.''

గొడుగు వుంది. దేనితోనైతే తను షెడ్డుకప్పుమీదనుండి కిందకి జంప్‌చెయ్యాలనుకున్నాడో ఆ గొడుగు. అది సొరుగుల బీరువా వెనక పడవేసి వుంది. ఏమంటే, కుర్రాడి తల్లితండ్రులు చినుకొస్తే ఇప్పుడు గొడుగు వేసుకోవడంలేదు, రెయిన్‌కోట్లు వేసుకుంటున్నారు. అందుకని ఆ గొడుగును వాడు తన సొంతానికిందే లెక్కేసుకున్నాడు.

అంతా ఓ పిచ్చి వ్యవహారంకింద తేలింది. దీనంతటి వెనుక వున్నది ఆ ఆముదపు జిడ్డు — వెరొనీకా దొడ్డమ్మ. ఇన్నాళ్ళూ సాయంకాలం అంతా ఆమె, ఇంటికి అంటుకుపోయినట్లు, ఇంట్లోనే కూచుంది. మరి ఈవేళేమో, ఇలాంటి వర్షంలో, తన భర్తగారి స్నేహితులింటికి వెళ్తానని చాటించింది. విన్నారా మరి, ఆవిడకి అక్కడోక పని వుందట. ఈ స్నేహితులదగ్గర అవేవో ఆయనగారి కాగితాలు వుండిపోయాయట. ఇప్పుడా కాగితాలను ఈవిడె తీసుకొచ్చితీరాలట. అవి అతిముఖ్యమైన కాగితాలట, ఇంకా అసంపూర్తిగా వుండిపోయిన ఆయనగారి డిసర్టేషనుకి సంబంధించినవట అవి.

''రేపు వెళ్ళి తీసుకురావచ్చునేమో, వెరొనీకా పావ్లొవ్నా?'' అని నాన్న అతి జాగ్రత్తగా అడిగాడు.

''అబ్బే! వీల్లేదు, వీల్లేదు!'' అందామె.

ఆమె గడ్డం చిన్నది, బూడిదెరంగు పెదవులు, జాలిచూపుల కళ్ళు, కళ్ళకి నీలిరంగు కాటుక పెట్టుకుంది ఆమె. మరేమో, చెవులకి పెద్ద జిప్సీ పోగులు — గిల్టు చంద్రవంకలు. అంత తెలివైన మనిషి కదా, చెవులకి అలాంటి మధ్యయుగాలనాటివి ఎందుకు పెట్టుకుందో ఆ కుర్రాడేమీ అర్థంచేసుకోలేకపోయాడు.

దీన్నిగురించి కుర్రాడు తండ్రిని అడిగాడు.

''ఆ సంగతి నీ కవసరంలేదు. పెద్దవాళ్లని చూసి నవ్వడం తప్పుకాదూ!'' అని తండ్రి కోప్పడ్డాడు.

పెద్దనాన్న భార్య వెరొనీకా పావ్లోవ్నా. ఆయన మూడేళ్లకిందట చనిపోయాడు. ఆయన భార్య ప్రతి సంవత్సరమూ వీళ్లని చూడ్డానికి వస్తుంది. వచ్చినప్పుడల్లా వీళ్లదగ్గరే రెండుమూడు వారాలపాటు వుంటుంది. పగలంతా ఆమెకి ఏమీ తోచక ఒక్కర్తే గదుల్లో తచ్చాడుతుంది. ఇహ సాయంకాలం అయేసరికి, అదేదో పురాతన హస్తలిఖితగ్రంథంపై పరిశోధన గురించి డిసర్టేషనుని అసంపూర్తిగా వుంచేసిన తన పెనిమిటి గురించే మాట్లాడుకునేటట్టుగా సంభాషణను ఆమె నడిపించుతుంది. పరిశోధన సమాప్తంచేయకుండానే అతను చనిపోయాడు. ఏది యేమైనా ఆయన పిహెచ్. డి. కదా. అందుకని వెరొనీకా దొడ్డమ్మకి గొప్ప గర్వం.

ఆవిడె ఎదట అమ్మా నాన్నా గడగడలాడేవారు. వాళ్లు అంత భయపడ్డానికి కారణం వాళ్లిద్దరూ పిహెచ్. డిలు కారనీ, చెట్ల బెరడుమీద రాయబడిన పురాతన పత్రాలపై పరిశోధనలను గురించి వారికి రవంత కూడా తెలియదనీ కాబోలు?

నిజంగా నవ్వొస్తుంది!

వెరొనీకా దొడ్డమ్మ దగ్గరబంధువుకిందే లెక్క, అయినప్పటికీ ఆమెను పిలచినప్పుడు ఆమె పేరూ పైతృక నామమూ రెండు కలిపే ఆమెను పిలచేవారు. కుర్రాడు మాత్రం ఆమెను పిలచేవాడేకాదుకదా, ఆమెతో అసలు మాట్లాడేవాడేకాదు.

''ఆవిడెతో మాట్లాడవెందుకురా నువ్వు?'' అని అడిగాడు తండ్రి.

''ఎందుకని?''

''నాతో వాదిస్తావట్రా నువ్వు?'' అని తండ్రి హూంకరించాడు. ''బొత్తిగా బరితెగిపోయావు. కాస్త బుద్ధిచెప్పాలి నీకు....''

''అయ్యో!'' అన్నాడు కుర్రాడు మెల్లగా.

అలా అనడం వాడికి అలవాటు. అలా అనడం వాడికే అసలు ఇష్టంలేదు. ఇహ కడమకుర్రాళ్లు వాణ్ణి ఉడికించేవారు, ఆడపిల్లల్లా ''అయ్యో'' అంటాడని. అయినా వాడు ఆ అలవాటు మానుకోలేకపోయాడు. తన ''అయ్యో''ని వాడు రకరకాలుగా అనేవాడు: నవ్వొచ్చినప్పుడు, ఆశ్చర్యపడినప్పుడు, నిర్లిప్తంగా ఆవులించినప్పుడు. ఇంకా మరెప్పుడైనా కూడానూ. అప్పుడప్పుడు బిగ్గరగా, అప్పుడప్పుడు గుసగుస గొంతుకతోనూ. ఈసారి మరీ మెల్లగా అన్నాడు. తండ్రికి వినబడేలేదు.

మరి, ఏమైతే యేం, వెరొనీకా దొడ్డమ్మతో మాత్రం కుర్రాడు మాట్లాడనే లేదు. ఆమె కూడా వాణ్ణి గురించి పట్టించుకోవడంలేదు.

కాని ఈవేళ ఆవిడెకి గొడుగు కావలిసొచ్చింది.

కుర్రాడు కిటికీదగ్గర కూచుని, గొడుగు విప్పి, గొడుక్కి సూదితో కన్నాలు పొడుస్తున్నాడు. గొడుగ్గుడ్డ మంచి చిక్కగా వుంది, ప్రతి పర్యాయం కన్నం పొడిచిన తర్వాతనూ కన్నం సన్నంగానూ గుండ్రంగానూ వుండేది. వలంపటి సూదితో — పెద్ద కన్నం, సన్నని సూదితో — చిన్న కన్నం. ఆకాశాన రకరకాల నక్షత్రాలు మరి....

కాని అందరికీ నక్షత్రాలమీద ఆసక్తి వుండదే.

''ఇది నొర్తి వాండలిజమ్*'' అంది వెరొనీకా దొడ్డమ్మ, మాటలను పొడిగా ఉచ్చరించుతూ. ''పురాతన వస్తువులను ఇంత ఘోరంగా పాడుచేయడం!''

ఆ గొడుగు పురాతనపుది కానేకాదు, అతి పాతది — అంతే. అది అలా వుండగా, వాండలిజమ్ అంటే ఏమిటో కుర్రాడికి అర్థంకాలేదు. అయితే యేం, తల్లితండ్రులిద్దరూ కుర్రాడివంక ఎలా చూశారంటే, వాడు ఏకంగా ఒక భోషాణపెట్టెడు అమూల్యమైన వస్తువులను ధ్వంసంచేసేస్తున్నట్టే చూశారు.

''మీరే చూడండి.... ఒకటి, రెండు, మూడు.... ఎనిమిది బెజ్జాలు పొడిచాడు'' అంది వెరొనీకా దొడ్డమ్మ, బెజ్జాలను సరిగ్గా లెక్కపెట్టుతూ.

సప్తర్షి తారాగణం అంటే ఆవిడకి కేవలం బెజ్జాలన్నమాటే!

''ఏడే! ఒకటి అదివరకే వుంది'' అన్నాడు కుర్రాడు.

''మాటకి మాటా కుడానా నువ్వు!'' అని ఎగిరాడు తండ్రి. ఎగిరి, ఆదరా బాదరా వెరొనీకా దొడ్డమ్మ వంక తిరిగి, అన్నాడు: ''నా దగ్గర ఇన్స్యులేటెడ్ టేప్ వుంది. దాన్ని ముక్కలుకింద కత్తిరించి, లోపలినుంచి మాసికలు అంటించేస్తా!''

వెరొనీకా దొడ్డమ్మకి అవమానమనిపించి మూతి బిగించింది: పిహెచ్. డి. గారి వితంతువును తాసిక మాసికలేసిన గొడుగు వేసుకుని వూళ్లోకి వెళ్లమని చెప్పడమా!

''మా పిల్లలు ఇలాంటి పనులు చేస్తూంటే దిమ్మితిరిగే తగిన శాస్తి చేయకుండా వుండేవాడుకాదు'' అంది ఆమె.

ఆమెకి పిల్లలు లేరు.

''ఆ మాట చెప్పాలా!'' అని వంతపాడాడు తండ్రి.

గిల్టు కగ్గిపోయిన చెవిపోగులు ఆడించుకుంటూ వెరొనీకా దొడ్డమ్మ ఆ గదిలోనుంచి చరచరా వెళ్లిపోయింది.

''పాటివారి ఎదట మాకు ఎలా సిగ్గుతెప్పించడమో అది మాత్రం తెలుసురా నీకు!'' అంది తల్లి దీర్ఘాలు తీస్తూనూ, ఎందుకో అర్థంకాని నిస్పృహతో.

''పాటివారి ఎదట....'' అన్నాడు కుర్రాడు.

కుర్రాడి కనురెప్పవెండ్రుకలు పొడుగ్గా తిన్నగా వుంటాయి. వాడు కోపంతెచ్చుకోకుండా కళ్లు వెడల్పుగా చేసుకుని సరదాగా వున్నప్పుడు అవి పైకి లేచి వుంటాయి. కాని వాడు ఓరగా చూసినప్పుడు మాత్రం అవి ముళ్లల్లా నిక్క పొడుచుకొచ్చినట్టే వుండేవి.

తండ్రికి కుర్రాడిమీద కోపంవచ్చేసి, కస్సుబుస్సుమంటూ ఏదో గొణిగి, పిడికిలితో అవకరంగా బల్లమీద ఒక్క గుద్దు గుద్ది కేకలేశాడు:

''మాటకి మాటా వాదనా కూడానా నువ్వు? నాకేసి ఓరచూపులా? మీదుమిక్కిలి నవ్వు ఒహటా?''

''ఉస్సు! మెల్లగా!'' అంది తల్లి బతిమాలుకుంటూనూ.

---

*వాండలిజమ్ — అమూల్యమైన సాంస్కృతిక వస్తుసామగ్రిని నాశనమొనరించడం. — సం.

''గొడుగ్గురించి మీరు బాధపడుతున్నారేమో మరి'' అన్నాడు కుర్రాడు, తన కళ్లవెంట కన్నీరుకారుతూ న్నట్టనిపించి. ''కాని మీరు బాధపడడంలేదు. ఆవిడకోసమే మీరీ పాట్లు పడుతున్నారా?... లేకుంటే ఆవిడంటే భయమా?

''బొడ్డూడని నాగమ్మా! కుర్రకుంకా! ఫో ఇక్కడ్నుంచి, ఫో!'' అని గొంతు తగ్గించేసి అరిచాడు తండ్రి.

కుర్రాడు మారుమాటాడలేదు, కిక్కురుమనలేదు, గదిలోనుంచి వెళ్లిపోతూ తలుపు దుభీమని మూసేయనూ లేదు. నెమ్మదిగా మేడమెట్ల దగ్గరకి వెళ్లిపోయాడు, మెట్ల చేతికమ్మిమీద పొట్టను ఆన్చి, మెట్లకింద సందులోకి చూశాడు. ఇల్లు పాతది. మేడమెట్లమీద చెమ్మగిలిని గిలాబా వాసనా, కిరసనాయిలు కంపూ కొట్టింది. తలవంపుల వల్ల తనకు వచ్చిన కోపం గొంతుకలో చిమచిమలాడుతూంది, కళ్లలో తాపం రేగుతూంది. ఇహప్పుడు కుర్రాడు మెల్లగా మెట్లుదిగి, వానలో కెళ్లిపోయాడు.

తడిసి పడిసెంచేసి తనకి చావు ముంచుకొచ్చినా అందుకు తనకేమీ అభ్యంతరంలేదు అనుకున్నాడు కుర్రాడు. అబ్బే, చావడమెందుకు? వొద్దు. కాని న్యూమోనియా వరకు వస్తే చాలు. అప్పుడు అందరికీ తెలుస్తుంది.... కాని వర్షం మంచి సరదాగానే వున్నట్టనిపించింది. అది కుర్రాణ్ణి చావులో ముంచేటట్టు లేనేలేదు. అది వాణ్ణి వెచ్చని చినుకుల ధారలతో ఆహ్వానించింది, అవమానంవల్ల కలిగిన కోపాన్ని కరిగించేసేందుకు ప్రయత్నించింది. కోపం కరిగిపోలేదు, వగరుగా బురదగా వున్న మడ్డి మిగిలింది. అయితే యేం, కుర్రాడు వర్షానికి ధన్యవాదాలు చెప్పుకున్నాడు. లోకంలో తమకిద్దరికీ వ్యతిరేకులు గొడుగులకింద శరణు పొందిన వాళ్లే అని వర్షానికీ కుర్రాడికీ అనిపించింది. వీథివెంట వెళ్తూన్నవాళ్లల్లో ఇటువంటివాళ్లు చాలా తక్కువమందే వున్నారన్నది నిజమే, చాలామంది రెయిన్‌కోట్లు వేసుకున్నారు. ఐతే యేం, కుర్రవాడు గొడుగుల గురించే ఆలోచిస్తున్నాడు, అవి ఒక్కటే వాడికి కనబడుతున్నాయి.

వర్షానికి తళతళ మెరుస్తూన్న వీథులవెంట ఎంతో దూరం అలా నడిచే వెళ్లాడు కుర్రాడు, ఏ యింటి గుమ్మంలోనో, ఏ పుస్తకాల బడ్డీకొట్టు మేలుకట్టు కిందనో ఒక్కసారైనా తలదాచుకోలేదు. ఇంటినుంచి ఇంకా దూరంగా వెళ్లిపోవడానికని కుర్రాడు ఇక ఆతర్వాత ట్రాము యెక్కాడు. ట్రామ్‌కారులోనే కలుసుకున్నాడు ఆ అమ్మాయిని.

''నాకు గొడుగు లేదు'' అన్నాడు కుర్రాడు. ''ఉండి వుంటే ఏ చిక్కూ లేకుండా అంతా సుళువుగా జరిగిపోయుండేది. ఉత్తరాకాశపటంలో వున్నట్టు నక్షత్రాలను గొడుగులోపల గుడ్డమీద చిత్రించాలి. అంతే. తర్వాత గొడుగును ఎలా పట్టుకోవాల్సుంటుందో అలా పట్టుకోవాలి, అంతే. అప్పుడు స్పష్టంగా తెలిసిపోతుంది ఏ తారాగణం ఎక్కడ వుందో!''

కుర్రవాడికి ఉత్సాహం వచ్చేసింది. అవమానంవల్ల కలిగిన కోపం కొద్దిగా అణిగింది, హృదయం మళ్లీ మరొకసారి ఉల్లాస తంతులను మీటడం మొదలెట్టింది. గొడుగును తన దగ్గరనుండి లాక్కుందుకు వీలుపడింది, కాని డిస్కవరీని తన దగ్గరనుండి లాక్కుందుకు వీలుపడదుగా.

''అది ఎలా చెయ్యాలో బోధపరుస్తాను'' అన్నాడు కుర్రాడు. ''ముఖ్యమైనదేమిటంటే, ధ్రువతార ఎక్కడుంటుందో జ్ఞాపకం వుంచుకోవడం. ఇది సులభమే. ఉత్తరం ఏ దిక్కున వుందో తెలిసివుంటే చాలు, ఆతర్వాత....''

''ఓహో, ఆగు ఒక్క నిమిషం!'' అంది అమ్మాయి. ''నాది ఉత్తి మట్టిబుర్ర! మొదట చిత్తరవు గీసేయ్, ఆతర్వాత బోధపర్చుదువుగాని.''

''ఎక్కడ.... గీయడం?''

''గొడుగుమీద'' అదొక పెద్ద ప్రశ్నకానట్టు. ''ఇదిగో'' అని, తాం(డపెచ్చు ఆటకోసమని ఆస్ఫాల్టు రోడ్డుమీద గళ్ళూ కొండా గీసుకుందుకు ప్రతి ఆడపిల్ల తన జేబులో వుంచుకునే సుద్దముక్కను ఆ అమ్మాయి పైకితీసింది. ''సూది అవసరంలేదు.... నక్షత్రాలను సుద్దముక్కతో గుర్తుపెట్టేందుకు వీలుంటుందిగా. ఏం? అటువంటి గొడుగు నాకెంతెనా పనికొచ్చునే!''

అరె, తనకిది తట్టలేదెందుకో? సుద్దముక్కే నయం! రాత్రప్పుడు కన్నాలు మనకి కనబడవు, మరేమో ఏ మాత్రపు గుడ్డివెలుగు వున్నప్పటికీ సుద్దబొట్లు కంటికి కనబడతాయి. అంటే రాత్రిపూట మబ్బేసినా కూడా ఆకాశాన్నున్న నక్షత్రాలను తను వెతికి తెలుసుకోగల్గుతాడన్నమాట!

అమ్మాయి గొడుగు తెరిచింది.

''తారాగణాలన్నీ ఎక్కడున్నాయో నీకు నిజంగా జ్ఞాపకం వుందా?'' అని అడిగింది.

కుర్రాడు అనుగ్రహపూర్వకంగా వౌనందాల్చాడు.

''నక్షత్రాలు గీయ్!'' అంది అమ్మాయి.

కాని, నక్షత్రాలను గీయడం మాత్రం జరగలేదు. కుర్రాడు సుద్దముక్కను అందుకున్నాడో లేనేలేదో, ఆ అమ్మాయి తల్లి – జేగురురంగు రెయిన్‌కోటు తొడుక్కుని, నిడుపాటి వాటర్‌ప్రూఫ్ కుళ్ళాయి పెట్టుకుని, పొడుగ్గా నిర్దాక్షిణ్యంగా అవుపడుతూన్న స్త్రీ – వాళ్లమీదకు వంగింది.

''తత్యానా! నాకు తెలిసిందప్పుడే. ఒక్క క్షణం నిన్నొక్కర్తెనీ వొదిలిపెట్టకూడదు కదా! రా, పోదాం, మనమిక్కడ దిగిపోదాం. పచారికొట్టులోకెళ్లి వస్తువులు కొనుక్కోవాలి'' అంది.

ఆమె కుర్రాడివంక కన్నెత్తి చూడనైనా చూసిందికాదు. అమ్మాయి మాత్రం చూసింది. చూసి, వెళ్లిపోతూ కుర్రాణ్ణి ఉద్దేశించి గట్టిగా అనాలనే అంది:

''మళ్లీ కలుసుకుందాం.''

''మళ్లీ కలుసుకుందాం'' అన్నాడు కుర్రాడు కరుకుగా. అని, వెనక్కి తిరిగిపోయాడు. తన ముఖం మళ్లీ మరొకసారి జేవురించిందనుకున్నాడు. ఇంతకీ తను ఏమిటి చేశాడని? ఆ అమ్మాయికి బోధపరచి చెప్పాలను కున్నాడు – నక్షత్రాలు ఆకాశాన అవుపడనప్పుడు ఏ యే నక్షత్రాలు ఎక్కడెక్కడుంటాయో....

కుర్రాడు కిటికీ దగ్గరకి జరిగాడు. ఏదో డొక్కలో గుచ్చుకుంది. ముఖం వంకరగా పెట్టి, షర్టు జేబులో చెయ్యి పెట్టి తడిమి చూసుకునేసరికి. వాడి చేతికి సుద్దముక్క దొరికింది.

ట్రాము చిట్టచివరి స్టాపు చేరుకుని, సర్కస్‌కి ఎదురుగా ఆగిపోయింది. కుర్రాడు ట్రాము దిగిపోయాడు. సర్కస్ భవనపు డోము బ్రహ్మాండమైన వెండి గొడుగులా వుంది. దాని చూరుకిందనుండి నిడుపాటి కిటికీలు గాజు రేపుల్లా మెరుస్తున్నాయి. ఆ కిటికీల్లో ఏవేమిటో రంగురంగులవి చకచక పరుగెత్తుతూ మిణుకుమిణుకు మని ప్రకాశిస్తున్నాయి. అక్కడ రక్షకమైన ఆ వెండి గొడుగుకింద చిత్రోపమైన వేడుకలు మిణుకుమిణుకు మన్నాయి, గలగల చప్పుడుచేశాయి. సంగీతం చెళ్లున పైకి తుళ్లుతూంది, కాని భారీ చినుకులతో దానిని నేలకి అణిచేసినట్టు అది సన్నగిలింది. చెమ్మగిలిన బల్లచెక్కల వాసవేస్తుంది. వన్యమృగాలకు శిక్షణ యివ్వడంలో ప్రసిద్ధిచెందిన మహిళ బుగ్రీమొవా తర్ఫీదు చేస్తూన్న బ్రహ్మాండమైన స్టైపుడ్డు సింహాల ఎర్రని దవడలు సర్కస్‌లోపలికి వెళ్లే ద్వారంపైన ఇకిలిస్తున్నాయి. సింహాలు బాగా ఎదిగినవే, అవి యేమీ భయంకరంగా లేవు, అవి శుభ్రంగా తడిసిపోయి గెడ్డాలున్న పిల్లుల్లా విచారంగా వున్నాయి. వాటిని చూసి కుర్రాడికి జాలేసింది.

తను అలా అక్కడ నించుని వుండడమూ, పరాయివాళ్ల పండుగ కేరింతాలను వింటూండడమూ కుర్రాడికి విసుగెత్తింది. కుర్రాడు వెనక్కితిరిగి, ట్రామ్‌స్టాపు దగ్గరకే మళ్లీ వెళ్లిపోయి, మెటలర్జికల్ నగర్‌నుండి వస్తూన్న ట్రాము ఎక్కాడు.

మంచి మనస్సుగల ఆ ట్రామ్‌కండక్టరు కుర్రాడికేసి చూసి, నోరెళ్లబెట్టింది, ఏమీ అనలేదు. పోనీ వెళ్లనీ, ట్రాములో జాగా వుంది కదా అనుకుంది.

ట్రామ్‌కారు ఇంచుమించు ఖాళీగానే వుంది. ఎవరో ఒకతదు కిటికీని ఆనుకుని టోపీని కళ్లమీదకి దించేసుకుని నెమ్మదిగా గుర్రుతీస్తున్నాడు. ఇతగాడికి ఎదురుగా వున్న బెంచీమీద మిలిటరీ ఆఫీసరు ఒకాయన కూచున్నాడు.

ఆఫీసరు మంచి అందమైన మనిషి. అతడు కాలుమీద కాలేసుకుని నిటాగ్గా కూచున్నాడు. ట్రామ్‌కారు కదలడంతో, ఆ కుదుపుకి ఆయన బూటుమొన ఊగిసలాడేది, ట్రామ్‌కారులో వున్న ఎలెక్ట్రిక్ దీపాల ప్రతిబింబాలు ఆ బూటుమొన మీద పరుగెత్తేవి. ఇటువంటి వాతావరణంలో కూడా ఆఫీసరు బూట్లు పొడిగానూ మెరుస్తూనూ వుండడం నిజంగా ఆశ్చర్యమే. ఆయనకి సంబంధించిన కడమదంతా కూడా — తోపురంగు తోలుపటకా, గుండీలూ, టోపీ చూరూ, చిట్టచివరికి నున్నగా క్షౌరంచేసుకున్న గడ్డం కూడా — నిగనిగలాడుతూంది. బుజంపట్టీలమీద వున్న నక్షత్రాలనుండి పసిడి చురకలు వెలువడుతున్నాయి. ఆ నక్షత్రాలన్నీ కలిసి మృగశిర తారాగణపు మధ్యభాగంలా వున్నాయి.

ఆఫీసరు మోకాళ్లమీద చెమ్మకి నల్లబడిన రెయిన్‌కోటు వుంది, రెయిన్‌కోటు పైన — గొడుగు. వొంపు తిరిగిన తెల్లని పిడి వున్న పెద్ద నల్లని గొడుగు.

కుర్రాడు గొడుగును చూసి, ఆఫీసరుతో చెబుదామా అని తటపటాయించాడు. ఏమిటి చెప్పడమో తనకి తెలుసు. అద్భుతమైన తన ఇన్‌వెన్షన్ని తనకొక్కడికే చెందాలని తను అనుకోలేకపోయాడు. తనకొక్కడికే చెందడం తనకి ఇష్టమూ లేదు. అది తనకొక్కడికీ అవుసరంలేదు కూడానూ. ప్రతి డిస్కవరీ, అది అత్యంత స్వల్పమైనదైనా సరే, ఇతరులకు సంతోషం కల్గించాలి — ఈ భావాన్ని కుర్రవాడు స్పృశించాడు. కాని ఆ డిస్కవరీ గురించి ఎలా చెప్పవలసి వుంటుందో అలా చెప్పలేనని భయపడ్డాడు.

''కామ్రేడ్ ఆఫీసర్!...'' అన్నాడు కుర్రాడు. ''మీతో మనవిచేసుకుందుకు నాకు అనుమతివ్వండి, కామ్రేడ్ ఆఫీసర్!'' అని సైనికునివలె వినవించుకున్నాడు.

ఆఫీసరు కన్నెత్తి చూశాడు. చూసి, ఆయన ఆశ్చర్యపడ్డాడో ఏమిటో కుర్రాడు మాత్రం గమనించలేదు. ఆఫీసరు ముఖాన ఏ చలనమూ లేదు. ఆఫీసరు అంటే అలాగే వుండాలికదా మరి.

''సరే, మనవిచేసుకో'' అని ఆయన అంగీకరించాడు.

''మీ గొడుగుమీద నక్షత్రాలను చిత్రించనుంటారాండి?'' అని కుర్రాడు అడిగి, చిన్న నిట్టూర్పు విడిచాడు.

''ఏ నక్షత్రాలు?''

''ఆకాశంమీద వున్నవేనండి'' అన్నాడు కుర్రాడు. ''ఇది ఎందుకంటే సరిగ్గా తెలుసుకుందుకు....''

ఆఫీసరు ఎడమ కనుబొమ అదిరింది.

''అబ్బాయ్, ఆగు! అర్థంకాలేదు. సరిగ్గా రిపోర్టుచెయ్యి. ఏ ఆకాశాన? ఏ లక్ష్యంతో?''

''సరే, అలాగేనండి'' అన్నాడు కుర్రాడు అందుకు ఒప్పుకుంటూ. ''వివరంగా చెబుతానండి. అసలు సంగతి ఇదీ. గొడుగు తెరిచి, నక్షత్రపటంలో వున్నట్టుగా నక్షత్రాలను గొడుగులోపల చిత్రించినట్టయితే మీకు ఓ చిన్న ప్లానెటేరియమ్ లభించుతుంది. దీన్ని నా అంతట నేనే ఆలోచించాను'' అని కుర్రాడు చెప్పలేకుండా వుండలేకపోయాడు.

''ఎందుకు?'' అని ప్రశ్నించాడు ఆఫీసరు.

''ఎందుకో.... నాకు తెలీదు.... ఇది నా అంతట నాకు తోచింది'' అన్నాడు కుర్రాడు. అని అవకరంగా చిరునవ్వు నవ్వి బుజాలెగరేశాడు.

''నే నడిగింది అదికాదు'' అని స్పష్టీకరించాడు ఆఫీసరు. ''నీ ప్లానెటేరియమ్ ఏ లక్ష్యంకోసమని? ప్రతి కార్యానికీ ఓ లక్ష్యం వుండాలి'' అన్నాడాయన. ఆయన బిగ్గరగా అనలేదు. ప్రతి మాటా కూడా ఆపుకొన్న ఆవులింతలా ధ్వనించింది. నున్నగా క్షౌరంచేసుకున్న గడ్డం ఇంచుమించు కదలనే లేదు.

''మరి.... ఎలాంటి లక్ష్యమా? ఇదిగో ఇలాంటిది. ఏ నక్షత్రం ఎక్కడ వున్నదీ పట్టపగలే కచ్చితంగా చెప్పొచ్చు. లేదా రాత్రిపూట మబ్బులున్నప్పుడు కూడా కచ్చితంగా చెప్పొచ్చు. గొడుగు విప్పి సరిగా పట్టుకోవడం ఒక్కటే అవసరం.... ధ్రువతార దిశగా పట్టుకోవాలి, ఆతర్వాత....''

''సరే. మరి ఎందుకని?''

''ధ్రువతార దిశగా ఎందుకనా? ఎందుకంటే, ఆ నక్షత్రం ఆకాశాన ఎల్లప్పుడూ ఒకే చోట వుంటుంది కనుక. అది ఒక అక్షం అవుతుంది. దానిచుట్టూ నక్షత్రాలన్నీ తిరుగుతూన్నట్టు భూమినుండి కనబడుతుంది కదా.''

ఈ సంగతి ఆఫీసరుకి ఎక్కడైనా తెలియకుండా వుంటుందా?

''అదికాదు అసలు సంగతి'' అన్నాడు ఆఫీసరు మూతి విరిచి. ''ఫలానా నక్షత్రాలు ఫలానా చోట్ల వుండాలని తెలుసుకోవడం ఎందుకని? దిక్స్థాపన కోసమా? అందుకు గొడుగు కచ్చితమైనదికాదు. ఇంతకంటె సునిశితమైన పద్ధతులున్నాయి. ఇంకెందుకైనా అంటావా? ఎందుకని?''

వాస్తవంగానే, ఎందుకని? దీని ఉపయోగమేమిటి? అది కుర్రవాడికి తెలియలేదు: తన డిస్కవరీకి తనే మురిసిపోయాడు, దీని ఉపయోగమేమిటని అసలు తను ఆలోచించనే ఆలోచించలేదు. మొత్తానికి ఉపయోగమున్నది ఏమిటి?... పరిచితాలైన నక్షత్రాలు — స్నేహితుల మాదిరిగా వాటివంక నువ్వు కన్నుగీటగల్గుతావు — ఇదీ ఉపయోగమేనా? లేక దానికది అంతేనా?

ఉత్తరాభాద్ర, ప్రజాపతి, సింహం, దేవయాని — ఇవి ఎటువైపున్నాయో తెలియడం — ఆకాశాన ఒక్క నక్షత్రమైనా లేకపోయినప్పటికీ ఇవి ఏ వైపున్నాయో తెలియడం — ఎవరికేనా ఉపయోగించుతుందా?

బహుశా ఎవ్వరికీ ఉపయోగించదేమో?

"నాకు తెలీదు...." అన్నాడు కుర్రాడు. అలా అని, ఆఫీసరువంక చూడ్డం మానేశాడు. "నే ననుకున్నాను.... ఒకవేళ చంద్రుణ్ణిగానీ, అంగారకుణ్ణిగానీ చేరేందుకు రోదసీనౌకను ప్రయోగించి, దానిగురించి సమాచారం ఇవ్వాలనుకున్న పక్షంలో: ఈవాళ అది ఈ తారాగణం దగ్గర, రేపు మరొక తారాగణం దగ్గర వుంటుంది.... మరి, ఆకాశాన మబ్బులున్నప్పుడు ఏమీ కనబడదు — అప్పుడు గొడుగు విప్పి ఎలా పట్టుకోవాలో అలా పట్టుకుంటే, చప్పున కనబడుతుంది, ఎక్కడ యే యే తారాగణాలున్నాయో, రాకెట్టు ఎక్కడ ఎగురుతూందో...."

"అక్కడికి చేరడం అసలు విషయం" అన్నాడు ఆఫీసరు. "అలాంటప్పుడు, దాని స్థానాన్ని లొకేటర్స్* తెలుపుతూనే వుంటాయి."

కిటికీ దగ్గర నిద్రపోతూన్న వ్యక్తి కదిలాడు. తన టోపీని పైకి ఎగదోసుకుని అడిగాడు:

"ఏమిటి? రాకెట్‌నో, స్పూత్నిక్‌నో మళ్లీ వదిలారా ఏమిటి?"

"ఊరుకోవయ్యా! నిద్దరమత్తులో స్టాపు దాటిపోగలదు!" అని కండక్టరు కునుకుతూ గదమాయించింది.

ట్రాముకి బ్రేకుపడింది. ఆఫీసరు చురుగ్గా లేచాడు. పొడుగ్గా వున్నాడు, నిటారుగ్గా నించున్నాడు. ఆకుపచ్చని రెయిన్‌కోటు బుజంమీద వేసుకున్నాడు.

"గొడుగుమీద చిత్రించడం కూడనిపని" అని ఆఫీసరు వీడ్కోలుచెప్పి, ట్రాము నిష్క్రమణద్వారం దగ్గరకి వెళ్లిపోయాడు. గొడుగుని రెయిన్‌కోటు కప్పేసింది. అవును మరి, ఆఫీసరు గొడుగు వేసుకోవడం కూడనిపని. ఆయన గొడుగును తనకోసం తెచ్చుకోకుండా ఇంకెవరికోసమో తీసుకెళ్తుండాలి.

"కూడనిపని" అని నవ్వుతూ బదులుచెప్పాడు కుర్రాడు.

తన భంగపాటుకి కుర్రాడేమీ బెదిరిపోలేదు. డిస్కవరీవల్ల కల్గిన ఆనందం వెనకటి తలవంపులవల్ల తెచ్చుకున్న కోపాన్ని చల్లార్చేసి, మళ్లీ కొత్తగా తన మనస్సులో వెచ్చని నీటిబుగ్గలా ఉప్పొంగింది. కుర్రాడు అలా కనిపెట్టుకునే వున్నాడు: నక్షత్రాలు అవసరమున్న మనిషి తనకి ఛటుక్కున ఎదురుపడవచ్చేమో ఎవరు చెప్పగలరు!

ఇద్దరు మనుషులు ట్రామ్‌కారు ఎక్కారు. ఇంచుమించు అన్ని బెంచీలూ ఖాళీగానే వున్నప్పటికీ వెనక ప్లాట్‌ఫారంమీదే నించున్నారు.

---

*లొకేటర్ — వస్తువులనుండి వెడలే శబ్దతరంగాల, రేడియో తరంగాల ప్రతిఫలనాలనుబట్టి, ఆ వస్తువుల స్థానాలని నిర్దేశించే పరికరం. — సం.

వారిద్దరిలోనూ వొకడు యువకుడు, పొడగరి, మెరుస్తూన్న పొట్టి రెయిన్‌కోటు తొడుక్కున్నాడు. పెద్ద కళ్లజోడు పెట్టుకున్నాడు. అది ఇంచుమించు అతని ముఖాన్నంతనీ కప్పేసింది. కళ్లజోడు అద్దాలు దళసరిగా వున్నాయి. ఎత్తైన నుదుటిమీద నల్లని వుంగరాల జుట్టు వొత్తుగా వుంది. జుట్టు నడుమ వాన చినుకులున్నాయి. ఇతనికంటె రెండోవాడు బాగా పెద్దవాడు. మామూలుగా వున్నాడు: వయసుమళ్లిన మనిషి, రోజూ పనిచేసుకుని అలసిపోయే వ్యక్తి, నిగనిగ మెరుస్తూన్న ఓవరాల్సు తొడుక్కున్నాడు, బూడిదెరంగు టోపీ పెట్టుకున్నాడు. చంకను – గొడుగు.

ఎవరి పేర్లైనా తనకి తెలియనప్పుడు, తను కల్పించి వాళ్లకి పేర్లు పెట్టేవాడు కుర్రాడు. వీళ్లకి కూడా వెంటనే పేర్లు పెట్టేశాడు. ఆ పేర్లు వాటంతటవే వాడికి తట్టాయి.

మొదటివాడికి ''చదరంగపు ఆటగాడు'' అని పేరుపెట్టాడు. ఇహ రెండోవాడికి ''వర్కుషాపు ఫోర్మేను'' అని పేరుపెట్టాడు – అచ్చంగా అలా కనబడ్డాడు ఆ కుర్రాడి కంటికి మరి.

వాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్నారు. నిజానికి, మాట్లాడినదంతా ఫోర్మేనే. ఇతనితో కూడా వున్నతను కేవలం వూకొట్టుతున్నాడు మర్యాదా కోసం – చూడగా, ఆ సంభాషణలో అతడికి ప్రత్యేకం ఏ ఆసక్తీ లేనట్టే వుంది.

''వాడి మంచికోసమే అన్నాను వాడితో: 'ఓయ్, ఆర్కిమెడీస్ మహానుభావా! నీ కళ్లు ఎక్కడున్నాయోయ్, నెత్తిమీదున్నాయా? ఇక్కడ ఎంత టాలరెన్సు ఇవ్వొచ్చు? సున్నా సున్నా మూడు! నువ్విచ్చినది సున్నా వొకటి!' అందుమీద వాడన్నాడు కదా: 'అయితే, వెళ్లండి, వెళ్లి వర్కుషాపు ఇంజనీరుకి రిపోర్టు చేయండి. అంతే గాని, ఉన్నదానికీ లేనిదానికీ తప్పులెంచుతూంటే నేను పడను' అన్నాడు.''

'' 'ఉన్నదానికీ లేనిదానికీ' అంటే?'' అని అడిగాడు కళ్లజోడతను చిరునవ్వు నవ్వుతూ.

'' 'ఉన్నదానికీ లేనిదానికీ' అని సరిగ్గా అలాగే అన్నాడు.... అప్పుడు నేను సూటిగా అన్నాను: 'నే వెళ్లను ఇంజనీరు దగ్గరకి. నీ పైన ఇంజనీరుని నేనే. నీకు నచ్చచెప్పేందుకని ఈ హోస్‌ని ఇప్పుడే తీసుకొచ్చి రెండు మడతలుపెట్టి ఇలాగు....''

తను ఆ దరిద్రగొట్టు పేచీకోరు మనిషికి ఎలా బోధపరచాడో చూపేందుకని చేతిని అతగాడు కొద్దిగా వెనక్కి తిప్పాడు. కాని చూపించేందుకు అతడికి వీలుపడలేదు. గొడుగు దేనికో తగిలింది. ఎవరో క్షణమాత్రం ఊపిరి ఉగ్గబట్టినట్టు వెనకనుండి వినబడింది. వాస్తవానికి అది ఉగ్గబట్టుకాదు, చప్పుడు – అనుకోకుండా కల్గిన నొప్పి పళ్లసందునుండి పీల్చే ఊపిరి చప్పుడు.

''క్షమించండి!'' అన్నాడా ఫోర్మేను ఆదరా బాదరా, తను వెనక్కితిరిగి చూసుకొనేలోపునే. ఇహ వెనక్కితిరిగి చూసుకునేసరికి – కుర్రాడు అవుపడ్డాడు.

గొడుగుపోటు తగిలిన తన మోకాలుచిప్పను కుర్రాడు తన అరచేత్తో రుద్దుకుంటున్నాడు. ఫోర్మేను ముఖంలో ఒక పూర్తి సెకండుపాటు కలవరమూ మంచితనమూ కనబడ్డాయి. ఆతరువాత ఫోర్మేను మొగం చిట్లించి అన్నాడు:

“ఇదిగో మరి.... ఇరుగ్గా లేదుకదా, కాస్త దూరంగా నించుంటే ఏం పోయింది? దెబ్బ తగిలిందా ఏమిటి?... అస్సే, చప్పగా తడిశావ్!”

కుర్రాడిగురించి తనకు కలిగిన భయాన్ని కోపం చాటున మరుగుపరచాలనుకున్నాడు ఫోర్మేను. “క్షమించండి” అనే మాటను తను మరీ తొందరపడిపోయి పారేసినందుకు బహుశ బిడియపడ్డాడేమో కూడాను. ఏది యేమైనప్పటికీ, కుర్రవాళ్ల యెదట క్షమాపణ చెప్పుకోవడం చిన్నతనమనిపించుతుంది మరి.

“తగలవలసిన వాడికి కాక ఇంకొకడికి తగిలింది” అన్నాడు చదరంగపు ఆటగాడు అనవసరమైన ఉల్లాసంతో, “మీరు చూసుకో లేదు, వీక్తార్ సెమ్యోనొవిచ్.”

కుర్రాడు నిటాగ్గా నించున్నాడు.

“తప్పు నాదేనండి.... అక్కడ నించుంటాను....” అన్నాడు కుర్రాడు, ఫోర్మేనువంక చూసి. ఆ చూపులో వుండెను, మాటల రూపంలో వ్యక్తపరచనవసరంలేని కోరిక.

“సరేలే, ‘నాదే’....”

“నిజంగా నాదే....” అని కుర్రాడు ఇంచుమించు ఫిర్యాదుచేస్తూన్నట్టు ఆ మాటే పునశ్చరణచేశాడు. “ఏదో ఆలోచిస్తున్నానండి” అన్నాడు.

“ట్రామ్‌కారులో ఏదో ఆలోచించడం – ప్రగాఢమూ కవితాత్మకమూ అయిన మనిషి లక్షణం” అన్నాడు చదరంగపు ఆటగాడు, ముఖాన నవ్వు లేకుండా. అంతేకాదు, ఇటుంచటూ, అనవసరపు గంభీరతతో, అన్నాడు: “మోకాలి దెబ్బ మానిపోతుంది.... మరి, తరువాత యేమైంది, వీక్తార్ సెమ్యోనొవిచ్? హోస్ మడతపెట్టడం దగ్గర ఆగిపోయారు....”

“దయచేసి, మామయ్యగారూ,” అంటూ కుర్రాడు గొంతు దించి తొందరగా చెప్పాడు, “మీ గొడుగు మీద తారాగణాలు చిత్రిస్తానండి. అచ్చంగా ప్లానెటేరియమ్‌లాగానే వుంటుంది. గొడుగు విప్పేసరికల్లా – వెంటనే అవుపడుతుంది, ఏ తారాగణం ఎక్కడుందో, ఆకాశాన మబ్బున్నప్పటికీ కూడా. పట్టపగలు కూడాను. ఆకాశాన ధ్రువతార యేచోట వుంటుందో ఆ దిశగా గొడుగుపిడిని మాత్రం పట్టుకోవాలి. ఆతరువాత గొడుగు తిప్పితే....” అంటూ, ఎదుటివాళ్ల ప్రశ్నలకి ఆగకుండా, తొలి మాటల్లోనే తన కోరికను వివరించడం అవసరమని స్ఫురించి, ఇహ కుర్రాడు తను చెప్పదలచుకున్నదంతా ఒక్కసారే గడగడ చెప్పేశాడు.

కుర్రాడు తారాగణాలను జనానికి కానుక ఇస్తున్నాడు కదా!

ఇప్పుడు కుర్రాడు బుద్ధిపూర్వకంగానే “నక్షత్రాలు” అనడంలేదు, “తారాగణాలు” అంటున్నాడు. అలా అనడంవల్ల అనవసరపు వివరణలోకి తను దిగక్కర్లేదు. తను మాట్లాడుతూన్నది ఆకాశంగురించే అనే విషయం వెంటనే స్పష్టమైపోతుంది.

తనను కడవరకూ వినరేమో అని కుర్రాడికి భయంవేసి, ఆదరా బాదరా మాటలు మింగేశాడు, చెప్పినదే మళ్లీ చెబుతూ మరింత త్వరగా మరింత బాగా అర్థమయేటట్టు వివరించడానికి తొందరపడిపోయాడు.

తటాలున వూరకున్నాడు. వాడికి హఠాత్తుగా జ్ఞాపకమొచ్చింది, తను అంతా చెప్పేశానని. మరి తన మాటలకు వాళ్లేమీ అడ్డుతగల్లేదు. కుర్రాడు మౌనందాల్చి, వాళ్ల జవాబుకోసం తత్తరపడుతూ ఆగాడు.

''ఇదీ సంగతి'' అన్నాడు ఫోర్మేను. ''అనగా నీ అంతట నువ్వే ఇన్‌వెంటు చేశావా యేమిటి?''

''ఆఁ.... కాని, ఏమీ? ఇది సుళువే.... అంతేకాదు, నక్షత్రాలూ వుంటాయి.'' కుర్రాడు ''నక్షత్రాలు'' అనే మాటను ఉత్సాహంలేని గొంతుకతో పలికాడు. ఇప్పుడిహ ఫోర్మేను కూడా ''ఎందుకు'' అని అడుగుతాడేమో అని అనుకున్నాడు కుర్రాడు. అలా అనుకుని, కళ్ళు దించేసి, అతగాడి బురదపట్టిన బూట్లుజోళ్ల మొద్దుమొనలకేసి చూస్తూ నించున్నాడు.

''తమాషాగా వుంది'' అనుకున్నాడు చదరంగపు ఆటగాడు.

ఫోర్మేను ఏదో ఆలోచించి ప్రశ్నించాడు:

''ఇది ఆకాశం ప్లానులాంటిదన్నమాట?''

''ఆఁ. ఆకాశపటం వంటిదే!'' అని కుర్రాడు ఒప్పుకున్నాడు. ''కాని అంతకంటే మంచిది. ప్లానెటేరియమ్ వంటిది. ఆకాశాన యే యే తారాగణాలు ఎక్కడెక్కడ వుంటాయో తెలుసుకోవచ్చు, మబ్బులు వున్నప్పటికీ వాటిగుండా చూడొచ్చు....''

''ఆగు, ఆగు'' అంటూ, సిగరెట్టు కాల్చడంవల్ల పచ్చదేరిన వేళ్లతో ఫోర్మేను తన గడ్డాన్ని గట్టిగా రుద్దుకున్నాడు. ''నా కేమిటో సరిగ్గా అర్థంకాలేదు. మొత్తమ్మీద అర్థమైంది, కాని సరిగ్గా బోధపడలేదు.... మాటవరసకి, ధ్రువతారే వుంది. దీని విశేషాలేమిటి?''

''వీక్తార్ సెమ్యోనొవిచ్, నాకిలా అర్థమైంది'' అన్నాడు చదరంగపు ఆటగాడు, సంభాషణలో జోక్యం కల్పించుకుని. అతని కళ్లద్దాలు చురుగ్గా మెరిశాయి. ''మూలసూత్రం చాలా సులభమైనదే అయినప్పటికీ, ఆసక్తిదాయకమైన విషయమేః ఆకాశవితానాన్ని ఇరవైనాలుగు భాగాలకింద మానసికంగా విభజించడమన్నమాట. రోజుకి ఇరవైనాలుగు గంటలన్నది అందరికీ తెలిసినదే....''

''అవును, అందరికీ తెలిసినదే....'' అన్నాడు ఫోర్మేను నవ్వుతూనూ.

''అనగా'' అని సంభాషణ సాగించాడు చదరంగపు ఆటగాడు. ''ఈకాలవ్యవధిలో మనకి ఎగువనున్న ఆకాశం ఒకసారి పూర్తి భ్రమణం చేస్తుంది. అవునా?''

''అవును!'' అని కుర్రాడు సంతోషంతో అన్నాడు. ''నేనూ ఇలాగే అనుకున్నాను....''

''ఉండుండు! అనగా, నక్షత్రాలతో వున్న గొడుగుని తలపైన తెరచిపట్టుకుని, వేళని అనుసరించి ఆ దిశగా తిప్పాలి, ముందుగానే గణించాలి అంతే....''

''నేను గణించాను, నిజంగా చెబుతున్నాను'' అని కుర్రాడు, చురుగ్గా ఉల్లాసంగా వున్న చదరంగపు ఆటగాడివంక ఆశతో చూశాడు. ''నేను సరిచూసుకున్నాను. నక్షత్రపటంతోనూ ఆకాశంతోనూ కూడా.... అంతా సరిగ్గా వుంటుంది. నే నంతా వివరణగా చెబుతా. ఇహ ప్రారంభంలో ధ్రువతార ఎక్కడ కనబడుతుందంటే....''

''ఉండు! ఇది నిజంగా తమాషాగానే వుంది'' అన్నాడు చదరంగపు ఆటగాడు మళ్లీ మరొకసారి.

''అవును.... కాని, మా ఆఁడె ఇలాంటి సంగతి చూసినప్పుడు ఏమంటుందో వినడం నీకు తమాషాగా వుండదా?'' అన్నాడు ఫోర్మేను.

''అదేమిటండీ అలా అంటారూ! ఆవిడె ఏమంటుంది?... మంచి సరదాపడుతుంది'' అన్నాడు చదరంగపు ఆటగాడు. అతడు ఒక్క క్షణమాత్రం ఆగి, తన గంభీరతను కోల్పోయి, కళ్ళుదించి కుర్రాడికేసి చూశాడు.

ఫోర్మేను దీన్ని గమనించలేదు. అతడు గొడుగును తన ఎదట రెండు అరచేతుల్లోనూ పెట్టుకుని, ఇంకా అనిశ్చితంగానే చుట్టూ పరకాయించాడు. ఆ గొడుగు సజీవి అయినట్టుగానూ, కుర్రాడు దానికి హాని కల్గించుతాడని దాని యజమాని భయపడినట్టూ కనబడింది.

''దేనితో చిత్రిస్తావు?''

''సుద్దతో. భయపడకండి, జాగ్రత్తగా గీస్తాను.''

''అయితే మరి, ఎలా గీస్తావు?'' అని అడిగాడు ఫోర్మేను. ''నక్షత్రాలన్నింటినీ వెయ్యాలా?''

''అబ్బే! అన్నిటినీ జ్ఞాపకం పెట్టుకోగలమా? తారాగణాలను మార్కుచేసేందుకు అన్నిటికంటే పెద్ద వాటిని మాత్రమే వేస్తాను.''

''అలాంటప్పుడు వాటి పేర్లు కూడా రాసేసుకో'' అన్నాడు ఫోర్మేను నిట్టూర్చుతూ. ''ఇంతకీ దీని ఉపయోగమేమిటి? ఒక్క సప్తర్షి తప్ప ఇంకే తారాగణమూ నాకు తెలీనే తెలీదు, ఇన్నాళ్లు బతికాను గాని, నాకు లఘుసప్తర్షి కూడా తెలీదు.... రాసిపెట్టుకుంటావా?''

''అన్ని పేర్లూ రాసే వున్నాయి!'' అని కుర్రాడు సరదాగా అన్నాడు.

అప్పుడే కుర్రాడు తన తడి జేబులో చెయ్యిపెట్టి సుద్దకోసం వెతుకుతున్నాడు.

''ఇదీ సంగతి'' అని మళ్లీ మరోసారి ఫోర్మేను దీర్ఘంతీసి తన బంగారపు పళ్లను కనబరుస్తూ ఛటుక్కున చిరునవ్వు నవ్వాడు. ''మా ఆవిడె గొడుగేసుకుని బజారుకి బయల్దేరి, గొడుగుమీద లుబ్ధక నక్షత్రాన్నో, మరిదేనినో అలా మోస్తూ బురదగుంటలో పడుతుంది. అప్పుడుంటుంది తమాషా! సరే, కానీ, చిత్రించవోయ్. మేమింకా చాలా దూరమే వెళ్లాల్లే'' అంటూ అతడు గొడుగు తెరిచాడు.

గొడుగు నలుపుది కాదు.

ట్రామ్‌కారు దీపాల గుడ్డివెలుగులో ముడిచేసి తడిగా వున్న గొడుగు నల్లగానే కనబడింది. ఇప్పుడేమో దాని గుడ్డ గోధుమరంగుగానూ, దాని ఊచలు బూడిదెరంగుగానూ వున్నట్టు స్పష్టంగా అందరికీ కనబడు తూందాయె.

బూడిదెరంగు ఊచలున్న గోధుమరంగు ఆకాశం ఎప్పుడైనా వుంటుందా?

కుర్రాడు సుద్దముక్కను మౌనంగా జేబులో పడేసుకున్నాడు.

''అరె! వెధవది!'' అంటూ ఫోర్మేను తెరిచివున్న గొడుగు మొనతో డోరియాల గాడీల మధ్యను నీళ్లు పారుతూన్న బల్లచెక్క నేలను తట్టాడు. ''బోధపడింది కాదూ, పిడులు ఒక్కలాగే వుంటాయి'' అంటూ అతడు చదరంగపు ఆటగాడికి బోధపరచాడు. ''గొడుగులు తరుచుగా తారుమారు అయిపోతూంటాయి. రేట్‌ఫిక్సర్‌గా మా వర్కుషాపులో పనిచేస్తూన్న అమ్మాయిది ఈ గొడుగు.''

''అయ్యయ్యో!'' అన్నాడు చదరంగపు ఆటగాడు....

ట్రామ్‌కారు ధడధడమంటూ అలసటతో పరుగెత్తింది. పసుప్పచ్చగా వెలుగుతూన్న ఎలెక్ట్రిక్ బల్బులు

ప్లాట్‌ఫారంకేసి నిద్దరమత్తుతో మిటకరించాయి. ట్రామ్‌కారులోవున్న కొద్దిమంది ప్రయాణీకులూ కునుకుపాట్లు పడుతున్నారు. వాన ఒక్కటి మాత్రమే మంచి సరదాగానూ అలసట ఎరగకకుండానూ ట్రామ్‌కారు కిటికీ అద్దాలమీద టపటప తుళ్ళుతూంది.

ఏడో నంబరు ట్రాము మెటలర్జికల్ నగర్‌నుండి బయల్దేరి సెంటరుకెళ్తూంది. చాలా సేపటినుండి బండిలోకి ఎవ్వరూ ఎక్కలేదు, మొదటి స్టాప్‌లో ఎక్కినవాళ్లే అలా కూచునున్నారు.

తరువాత ఓ చిన్నపిల్లాడు ఎక్కాడు. పొట్టి ఓవర్‌కోటు వేసుకున్నాడు, రబ్బరు బూట్లు తొడుక్కున్నాడు. రబ్బరు బూట్ల వెడల్పాటి శిఖరాలు చిన్నపిల్లాడి కాళ్ళకి తగిలి తపతప కొట్టుకుంటున్నాయి: ఆ చిన్నపిల్లాడికవి బాగా పెద్దవి. "వాళ్ళమ్మవి" అనుకున్నాడు మనసులో కుర్రాడు.

చిన్నపిల్లాడు ట్రామ్‌కారులోకి ముందు తలుపులోనుంచి ఎక్కాడు. పాలు తెచ్చుకుందుకని పట్టికెళ్తూన్న ఎనామెల్ జాడీ ఒక చేతిలో వుంది, దానంతట అదే తెరచుకున్న గొడుగు రెండో చేతిలో వుంది.

ఆ ఆకుపచ్చని చిన్న జాడీ ఏమీ అల్లరపెట్టకుండా బుద్ధిగా వుంది. జాడీ అడుగు ట్రాంకారు మెట్టును ఒక్కసారి తాకొన్నప్పుడు మాత్రం, దాని మూత అసంతృప్తితో గణగణమంది, అయితే ప్రమాదమేమీ జరగలేదు: జాడీకి మూత కట్టివుంది. అందుచేత జాడీనుండి మూత వూడొచ్చేయడానికి ఎన్నటికీ వీల్లేదు.

కాని బరువుగా వున్న గొడుగు మాత్రం చెప్పినట్టూ వినదికాదు. చిక్కని నేత నల్లగుడ్డకున్న ఊచలు ముడుచుకుని వుండడం బదులు విడిపోయాయి, గొడుగు వెడల్పుగా తెరచుకుని ట్రామ్ ద్వారంలోపలికి దూరనని అల్లరిపెట్టింది. ఆ చిన్నపిల్లాడు ఒక్కచేతితో దానితో ఏమైనా నెగ్గగల్గుతాడా?

ట్రామ్‌కారు కదిలింది. ఆ కుదుపుకి చిన్నపిల్లాడు అదిరిపోయాడు. తరువాత కోపం వచ్చేసి, తన శక్తి అంతటితోనూ గొడుగును ట్రామ్‌లోపలికి గుంజాడు.

"విరిచేస్తావ్!" అన్నాడు కుర్రాడు. "ఇంతకీ, ఏమిటా పని...."

కుర్రాడు ట్రామ్ ద్వారం దగ్గరకెళ్ళి, గొడుగు పిడిని తను లాక్కున్నాడు.

"ముయ్యాలి" అంటూ తను గొడుగును మూసేశాడు. గొడుగు మూసుకుని చెప్పినట్టూ వింది.

చిన్నపిల్లాడి నెత్తిని పాతగిలిన స్కూలుటోపీ వుంది. దాని చూరు పెట్లిపోయుంది. పెట్లిపోయిన తన టోపీచూరు కిందనుండి చిన్నపిల్లాడు కుర్రాడికేసి చూసి తన తప్పు క్షమించమన్నట్టు కన్నుగీటి అన్నాడు:

"అది వొకంతట మూసుకోదు, బిగుతుగా వుంది" అని వివరించాడు.

"'బిగుతు'.... రాత్రిపూట ఇలాంటి పసి గుడ్డుని ఎక్కడికో పంపించడమా!... ఎందుకెళ్తున్నావురా?" అని కుర్రాడు ఆ చిన్నపిల్లాణ్ణి కఠినంగా అడిగాడు. ఈ ఓనమాల క్లాసు పిల్లాడి ఎదట – ఓనమాల క్లాసో, ఇంకా అక్షరాభ్యాసంకాని నాగమ్మో, వీడి ఎదట – తను ఇప్పుడెంతో పెద్దవాడూ శక్తివంతుడూ కదామరి.

"పెరుగుమీగడ కోసం" అని పిల్లాడు బెదురుతూ చెప్పి, మళ్ళీ మరోసారి కళ్ళు పైకెత్తి చూశాడు. భయంతో నిండి వెడల్పుగా తెరుచుకున్న కళ్ళు టోపీచూరు కీనీడలో కారునలుపుగానూ పెద్దవిగానూ కనబడ్డాయి. చీకటిపడిన తరువాత, అందునా వర్షంలో తనలాంటి చిన్నపిల్లలు ఇల్లు విడిచిపెట్టి, ప్రత్యేకమూ రాత్రిపూట ఆలస్యంగా తెరిచివుంచే షాపుకి పెరుగుమీగడ కొనుక్కుందుకు వెళ్ళకూడదో ఏమిటో తనకి తెలీదే అనుకున్నాడు

ఆ చిన్నపిల్లాడు. మొగం చిట్లించుతూన్న ఈ పెద్దకుర్రాడికి తనను ప్రశ్నించేందుకు పూర్తి హక్కు వుందేమో కూడానూ. అందుకనే వీడు తనను పిలిచి: ''మరి, రారా! నిన్ను మిలీషియా స్టేషను దగ్గరికి లాక్కెళ్లతాను'' అని అంటాడో ఏమిటో. లేకుంటే, ఇంకా ఇంతకంటె ఘోరమైనది ఇంకేమైనా అంటాడే ఏమిటో?...

''నీ గొడుగుమీద వెయ్యిమంటావురా నన్ను? రాత్రిపూట నక్షత్రాల్ని?'' అని అడిగాడు కుర్రాడు ఆ చిన్నపిల్లాణ్ణి.

తన అడిగాడే కాని, ఈ చిన్నపిల్లాడికి ఇది ఎందుకు అవసరమో తనకే తెలియడంలేదు. నక్షత్రాలు ఎలా భ్రమణం చేస్తాయో అసలీ చిన్నపిల్లాడికి తెలియనే తెలియదు కూడానూ. కాని, ఆ మాటలు వాటంతటవే తన నోటనుంచి బయటికొచ్చేశాయి. బహుశ అవి తన నాలిక చివరను అలా కనిపెట్టుకునుండి, పనికొచ్చే గొడుగు ఏది కనబడినా సరే, వెంటనే నోటిలోనుంచి చెంగున బయటికి గెంతేసేందుకు సిద్ధంగా వుండెనేమో మరి.

చిన్నపిల్లాడి కళ్లు మరింత నల్లబడి మరింత వెడల్పయాయి.

''రాత్రిపూట నక్షత్రాల్నా?'' అని చిన్నపిల్లాడు ఆ మాటలను రెట్టించుతూ ప్రశ్నించి, తన చిట్టి కనుబొమలు ముడిపెట్టాడు.

''అవును, నక్షత్రాల్నే'' అని కుర్రాడు రెట్టించి, చిన్నపిల్లాడికోసం తారాగణాలను చిత్రించడం గురించి ఇప్పుడు ఆలోచించసాగాడు. బహుశ ఇక్కడ తనకి అదృష్టం కలిసివచ్చినట్టుంది.

''గొడుగు చిన్న ఆకాశంలా వుంటుంది, అర్థమైందా?'' అని కుర్రాడు బోధపరచాడు. ''చుట్టూ మేఘమూ, వర్షమూనూ. మరి నీ పైన నక్షత్రాలు. అచ్చంగా ఆకాశంలాగ. ఏం, నీకిష్టమేనా?''

''చిన్న ఆకాశంలాగా?'' అని కొంచెం దీర్ఘంతీస్తూ రెట్టించి అన్నాడు చిన్నపిల్లాడు.

''అవును. అలాగే! ఏం మరి....''

తొందరపడడానికి యేమీ అవసరం లేకపోయింది. తొందర చూసి చిన్నపిల్లాడు భయపడ్డాడు.

''వొద్దు'' అని చిన్నపిల్లాడు బిగ్గరగా అనేసి, గొడుగుని గట్టిగా పట్టుకున్నాడు. ''నా కక్కర్లేదు! నా గొడుగు ముట్టుకోకు!''

భయపడుతూన్న గొంతుకతో ఆ చిన్నపిల్లాడన్న మాటలు వీళ్లిద్దరికీ చేరువగా కూచునున్న ఇద్దరు స్త్రీలు వినే వుండాలి. వాళ్లు చటుక్కున వీళ్లవైపు తిరిగారు. ఆ చిన్నపిల్లాణ్ణి ఎవరల్లరిపెడుతున్నారు?

''నువ్వు వొట్టి బైతువిరా!'' అన్నాడు కుర్రాడు అలిసిపోయి. ''నీ గొడుగు లాక్కుంటాననుకున్నావు కదూ.... ప్రపంచంలో ఇంకెవరి దగ్గరాలేని గొడుగులా నీ గొడుగు వుండాలని నే ననుకున్నాను. మరి నీ యిష్టం....''

అలా అనేసి కుర్రాడు ట్రాముతలుపు దగ్గరకెళ్లిపోయి, అక్కడున్న ఖాళీ బెంచీమీద కూచున్నాడు.

ట్రామ్‌కారు ధడధడా ఖణఖణా అంటూ కదుల్తూ చీకటిగా వున్న పార్కు పక్కనుంచి వెళ్లింది. బయట దీపాల్లేవు. అందుచేత కిటికీఅద్దాలు పారదర్శకంగా లేనట్టనిపించింది. కిటికీలోనుంచి చూసేసరికి, నల్లని అద్దంలోనుంచి చూసినట్టు, కుర్రాడికి తన మొగమే కనబడింది.

మరి, తన వెనుక చిన్నపిల్లాడు వుండడం కూడా కనబడింది.

చిన్నపిల్లాడు దగ్గిరకు రావడం కుర్రాడు గమనించనే లేదు. ట్రామ్‌బండి చక్రాలు పట్టాలను రాసుకుంటూ చేసిన కీచుకీచు రొదలో చిన్నపిల్లాడి రబ్బరుబూట్ల అడుగుల చప్పుడు వినబడలేదు. ఆ చిన్నపిల్లాడు కుర్రాడి దగ్గరకొచ్చి బెంచీదగ్గర నించున్నాడు — మరీ పసికూనలాగానూ, అదేదో తప్పుచేసినవాడిలాగానూ అవుపించాడు.

"మరి నువ్వు.... చాలా నక్షత్రాలనే వేస్తావా యేమిటి?"

"చాలా!" అని కుర్రాడు సంతోషంగా జవాబుచెప్పి, చిన్నపిల్లాడివైపు తిరిగి, అన్నాడు: "కూచో, నీకంతా బోధపరుస్తాను."

చిన్నపిల్లాడు కుర్రాడి పక్కను కూచున్నాడు.

కుర్రాడు గొడుగు తెరిచాడు, గొడుగు సూదికొనను ఎదుటి సీటుకి ఆన్చి, పిడిని తన బుజంపైన పెట్టుకున్నాడు. చిన్న డోము నల్లని లోపలిభాగం ఇప్పుడు కుర్రాడి ఎదట వుంది.

"ఇదిగో చూడు" అన్నాడు కుర్రాడు. బిగుతుగా విప్పారి వున్న గొడుగుగుడ్డమీద సుద్దముక్కతో టప్పుమని తట్టాడు. "ఇదిగో ఇక్కడ, గొడుగు కర్ర వున్న చోట, ఆకాశం అంతటికీ నట్టనడాన, ఆ వొక్కచోటనే ఎప్పుడూ వుంటుంది ధ్రువతార."

"ఎప్పుడూ?" అని చంటిపిల్లాడు మళ్లీ ఆ మాటే అంటూ అడిగాడు. తెల్లని తన చిట్టి కనుబొమలను మళ్ళీ మరోసారి ముడిపెట్టాడు.

"ఎప్పుడూనూ."

"పగటిపూట?" అని చిన్నపిల్లాడు అడిగి, కొంటెగా చిరునవ్వు నవ్వాడు.

"పగటిపూట కూడానూ. సూర్యుడి కాంతిముందు నక్షత్రాలు కనబడవు అంతే."

చిన్నపిల్లాడు కళ్లు మిటకరించాడు.

"చూడు" అంటూ కుర్రాడు ఇంకా చెప్పుకుపోయాడు. "ఇదిగో ఇక్కడ ఏడు నక్షత్రాలున్నాయి. గరిటెలా వున్నాయి కాదూ. ఇదే సప్తర్షి...."

"సప్తర్షా?"

"అవును" అన్నాడు కుర్రాడు చికాకుగా మొగం చిట్లించుతూ. "నువ్వెప్పుడూ వినలేదా యేమిటి?" అని అడిగాడు.

చిన్నపిల్లాడు బుజంమీద తలవాల్చాడు.

"ఇవి నక్షత్రాలా?" అని తన సుద్దముక్కతో పెట్టిన బొట్లకేసి తన వేలితో చూపించి అడిగాడు.

"అవును.... మరి" అన్నాడు కుర్రాడు జాగ్రత్తగా.

"కాదు" అన్నాడు చిన్నపిల్లాడు దృఢంగా తల అడ్డంగా వూపుతూ. "ఇలాంటివి నా కక్కర్లేదు. కిరణాలతో గీయ్!"

"ఎలాంటి కిరణాలతో?"

"ఇదిగో ఇలాంటి వాటితో!" అని, ఐదు కోణాలున్న నక్షత్రాన్ని గాలిలో గీశాడు చిన్నపిల్లాడు. "పెద్దవి!"

సుద్దముక్క పట్టుకున్న తన చేతిని కుర్రాడు కిందకి దించేసి, కిటికీవైపు తిరిగిపోయాడు.

"ఇలాంటివి వుండవు."

"వేద్దా!" అని బతిమాలాడాడు చిన్నపిల్లాడు.

"పెద్దవైతే అన్నీ ఇందుమీద పట్టవు" అని మొగం తిప్పకుండానే కుర్రాడు జవాబుచెప్పాడు.

"అయినా ఫరవా లేదులే. కొన్ని పట్టుతాయి...."

"అవి అచ్చంగా అలా వుండనే వుండవు...."

"నువ్వు వేస్తానని ఖరారుచేశావే...." అన్నాడు చిన్నపిల్లాడు కష్టంమీద.

చిట్టచివరకి కుర్రాడు చిన్నపిల్లాడివైపు చూశాడు. ఇప్పుడు చిన్నపిల్లాడి మొహంపైన టోపీచూరు కీనీడ పడడంలేదు. చెమ్మగిలిన నలుపు కళ్లలో ప్రతిబింబించాయి ట్రామ్‌కారు ఎలెక్ట్రిక్ దీపాలు, అవమానంవల్ల కలిగిన కోపం తళతళ మెరిసినట్టు.

కుర్రాడు నిట్టూర్చాడు. అవమానంవల్ల కలిగే కోపం ఎలాంటిదో తను ఎరుగును.

"సరేమరి" అన్నాడు కుర్రాడు.

సగం ఖాళీగా వున్న రాత్రిపూట ట్రాము ధడధడ, ఖణఖణమంటూ సాగిపోయింది. స్టాపు దగ్గర ఆగి, మళ్ళీ బయల్దేరింది. దిగే ప్రయాణీకులు దిగారు, ఎక్కే ప్రయాణీకులు ఎక్కారు. కాని ఆ పిల్లవాళ్ళిద్దరూ — చిన్నపిల్లాడూ, పెద్దకుర్రాడూ — కూచున్న బెంచీదగ్గర అద్భుతం వొకటి నిశ్శబ్దంగా జరుగుతూంది: నల్లని గిడుసు గంధర్వగాథల్లోని ఆకాశంగా మారిపోతూంది.

కుర్రాడు పెద్దపెద్ద తెల్లని నక్షత్రాలను చిత్రించాడు: ఐదు కోణాలున్నవీ, ఎనిమిది కోణాలున్నవీ, పది కోణాలున్నవీ. అవి ఏ ఖగోళశాస్త్రజ్ఞుడూ ఎరగని తారాగణాలుగా సంయుక్తమయాయి. చిన్నపిల్లాడు కుర్రాడి బుజంమీద చెయ్యేసి దగ్గరగా కూచున్నాడు, రవంతైనా కదల్లేదు. నోరు సగం తెరుచుకునుంది, రోజారంగు చిట్టి కిందిపెదవి చంద్రవంకలా కిందకి వాలిపోయుంది. కళ్ళు నక్షత్రాలనుండి మళ్ళించకుండానే చిన్నపిల్లాడు తోపురంగు మేజోళ్ళు తొడుక్కున్న కాళ్ళను బూట్లలోనుంచి పైకితీసేసి, కాలి మడమల్ని బెంచీమీద పెట్టుకుని, మోకాళ్ళను గుండెలకు అదుముకుని కూచున్నాడు. అలా కూచుంటే సదుపాయంగా వుంది. విప్పేసిన బూట్లు ఇటూ అటూ ఊగిసలాడుతూ ఒకదానితో ఒకటి ఢీడిక్కీలాడాయి. ఎరుపు అస్తరున్న ఆ వెడల్పాటి బూట్లు, ఆశ్చర్యంతో తెరచుకున్న నోళ్ళలా వున్నాయి: అక్కడ యేం జరుగుతూందో అవి అర్థంచేసుకోలేకపోయాయి.

తనను సీటుమీద కూచోబెట్టేసి తన వూసే మరపున పడిపోయిన జాడీ సీటు చిట్టచివరి అంచున ఆత్ర తతో టింగ్‌టింగ్ అని చప్పుడుచేస్తూంది. ట్రామ్‌బండి ఒక్క గుంజు గుంజింది. ఆ జాడీని చూస్తే, దానిలో ఏదో పసికందువ ఒకటి వుండి, అందులో చిత్రంగా గంతులేస్తూ తన తలకాయతో జాడీమూతను పైకి ఎగదోస్తూ అక్కడ జరుగుతూన్న గ్రంథం ఏమిటో చూద్దాం అని దానికి వున్నట్టు అనిపించింది.

కుర్రాడు త్వరగానూ నేర్పుతోనూ చిత్రించుతున్నాడు. అంత తేలిక అనిపించలేదు మొదట్లో: గొడుగ్గుడ్డ తడిగా వుండేమో సుద్ద సరిగా అంటుకునేదికాదు. కాని కుర్రాడు అందుకు తగినట్టూ సర్దుకున్నాడు. మొదట అవుట్‌లైన్స్ గీసి, వాటిని తరువాత తేలికైన దగ్గరదగ్గర అడ్డుగీతలతో నింపి, ఆ విధంగా నక్షత్రాలను స్ఫుటంగా చిత్రించాడు.

''ఇదిగో'' అన్నాడు కుర్రాడు తటాలున ఏదో జ్ఞాపకంవచ్చి. సరిగ్గా ఆ క్షణమే వాడికా సంగతి జ్ఞాపకం వచ్చింది. ''ఇంటిదగ్గర నిన్ను తిడతారేమో?''

''అబ్బే, తిట్టరే!''

చిన్నపిల్లాడి కళ్లు మిలమిల్లాడాయి. ఇటువంటి చక్కని చిత్రం వేయించుకున్నందుకు తిడతారా?

''మరి, చందమామని కూడా వెయ్యగలవా?'' అని చిన్నపిల్లాడు సంతోషంతో గుసగుస అడిగాడు. ''ఇదిగో ఇక్కడ....''

''నిండు చంద్రుడా, అర్ధచంద్రుడా?''

''నిండుచంద్రుడూ, అర్ధచంద్రుడూ రెండూనూ. వీలవుతుందా?''

''అబ్బే, వీల్లేదు'' అని అడ్డుచెప్పాడు కుర్రాడు. ''రెండూ ఒక్కమాటే వుండడం అసలు జరగదు.''

''మరి అలాంటప్పుడు నిండుచంద్రుడే.''

తెల్లని పున్నమనాటి చందమామని పెద్దదాన్ని వేశాడు కుర్రాడు. ఇహ దాంతో గొడుగ్గుడ్డ ఆకాశం మరింత అద్భుతంగా వుండెను.

''మరి, స్పూత్నిక్ కూడానూ'' అని బతిమాలాడు చిన్నపిల్లాడు.

గుబురుగా కుచ్చుల్లాంటి కాడలున్న కారట్‌దుంపలాంటి ఆకారం వచ్చింది స్పూత్నిక్కి. కాని చిన్నపిల్లాడు సంతృప్తి చెందాడు. విప్పిన గొడుగు తనపైన పట్టుకుని, పిడితో గిర్రున తిప్పాడు. ఆ చిట్టి ఆకాశం అంచువెంట స్పూత్నిక్ దూసుకుపోయింది. చందమామా తారలూ గంధర్వగాథల్లో చక్రనృత్యంచేస్తున్నట్టు గిర్రున తిరిగాయి....

''అయ్యో! నీ యిల్లు బంగారంగానూ!'' అన్నాడు కుర్రాడు. అని గొడుగును చిన్నపిల్లాడి చేతిలోనుంచి గుంజేసుకున్నాడు. గిర్రున్న పరిభ్రమణం చేస్తూన్న ఆకాశం ఆగిపోయింది.

''మనం ఇలా ఎక్కడికెళ్లిపోతున్నామో తెలుసా నీకు? నీ షాపు ఎక్కడుంది?''

ఆకాశం అటూ ఇటూ ఊగిసలాడింది. చిన్నపిల్లాడు చెంగున లేచి కాళ్లు బూట్సులోకి దోసిపాడు. వాడి కళ్లు ఇప్పుడు ఏకంగా గుండ్రంగా అయిపోయాయి. నోరు గుండుసున్నలా వుంది.

''ఏడుస్తావెందుకు? ఏడవకు'' అన్నాడు కుర్రాడు.

వీడితో ఏంచెయ్యడం, ఇలాంటి బొడ్డూడని పిల్లాడితో? తను ఒక మనిషికి నక్షత్రాలను కానుక ఇచ్చి, ఇహ వాణ్ణి ఆతరువాత వాడి ఖర్మానికి వదిలిపెట్టేయడమా? అబ్బే, అది కూడని పని.

''సరేలే, పెరుగుమీగడ గురించి నువ్వేమీ భయపడకు'' అన్నాడు కుర్రాడు.

వాళ్లిద్దరూ ట్రాము దిగిపోయి, మరో ట్రాము ఎక్కి మళ్లీ వెనక్కెళ్లి, షాపు ఎక్కడుందో వెతుక్కుని, పెరుగుమీగడ కొనుక్కుని, మళ్లీ ట్రామ్‌స్టాపు చేరుకుని, ఇహ అక్కడ ట్రాముకోసం కనిపెట్టుకుని నించున్నారు.

ఎంతో సేపు కనిపెట్టుకున్నారు. గొడుగుకిందే ఇద్దరూ నించున్నారు. చినుకులు ఉండుండి పడుతూ పెద్దవ వుతున్నాయి. అవి గొడుగుమీద టపటపమంటూ పడ్డాయి. దీపాల కిరణాలు తడిసిన ఆస్ఫాల్టురోడ్డుమీద పడి ప్రతిబింబించాయి, చందమామా సూది కోణాలున్న తెల్లని తారలూ వున్న గొడుగుకింద మళ్లీ ప్రకాశించాయి.

ఎదురుగా వచ్చే ట్రామ్‌బండి దీపాలు చెట్లవెనకనుండి కనబడతాయేమో చూసేందుకని కుర్రాడు రోడ్డు మీదకెళ్లాడు.

"ఎక్కడికెళ్తున్నావ్? మన ఆకాశంకింద నించో!" అన్నాడు చిన్నపిల్లాడు గాభరాపడుతూ.

ఇహ ట్రామ్‌బండి దగ్గరకొచ్చేసరికల్లా చిన్నపిల్లాడు జ్ఞాపకంతెచ్చుకుని అన్నాడు:

"మూడుకోపెక్కులు పడేయడం మర్చిపోయాను."

ఇందాకట్లా ట్రాము ఎక్కినప్పుడు ట్రాములో వున్న టిక్కెట్టు మెషీన్‌లో మూడుకోపెక్కులు పడేసి టిక్కెట్టు తీసుకోవడం మరచిపోయాడు చిన్నపిల్లాడు. వాడికి ఎవ్వరూ జ్ఞాపకంచేశారుకారు కూడానూ — అదేమో కండక్టరులేని ట్రామాయె.

"దానికేంలే! ఇప్పుడు ఎక్కుతున్నావుగా, మూడేసి కోపెక్కులూ రెండేసిమాట్లు పడే. అప్పుడు అంతా సమానంగా సరిపోతుంది" అని కుర్రాడు వాణ్ణి సమాధానపరచాడు.

"అప్పుడంతా సమానంగా సరిపోతుంది నిజమే" అని చిన్నపిల్లాడు కుర్రాడు అన్నమాటలే మళ్లీ అన్నాడు.

చిన్నపిల్లాడు ట్రాము ఎక్కినప్పుడు కుర్రాడు వాడికి సాయంచేశాడు. వాణ్ణి ట్రాము ఎక్కించేసి, ట్రామ్‌స్టాపు దగ్గరనుండి తను వెళ్లిపోయాడు.

చిన్నపిల్లాడు వీడ్కోలు చెప్పడానికని చెయ్యి వూపాలనుకున్నాడు. కాని ఎలా చెయ్యివూపడం? ఓ చేతిలో గొడుగుంది, రెండో చేతిలో పెరుగుమీగడ పోయించుకున్న జాడీ వుంది. తనకు ఇంత అద్భుతమైన కానుక యిచ్చిన ఆ మంచి కుర్రాడి వెంట తన చూపు సారించాడు.

చిన్నపిల్లాణ్ణి ట్రాము ఎక్కించేసి, కుర్రాడు షాపుకేసి మళ్లీ వెళ్లాడు. ఇందాకట్లా తను షాపులోనుంచి వచ్చేసేటప్పుడు మూడుకోపెక్కుల కాసు వొకటి రోడ్డుమీద తళుకు తళుకుమంటూ తనకి అవుపడినట్టయింది. ఆ చిన్నపిల్లాడు చూస్తూండగా తను వంగి ఆ కాసును యేరుకోవడం, మరెందుకో గాని, వాడికి సిగ్గనిపించింది. కాని తనకిప్పుడు మూడుకోపెక్కులు అవసరమాయె: మళ్లీ టిక్కెట్టులేకుండా ట్రామ్‌మీద వెళ్లడం వాడికిష్టం లేకపోయింది. అలాంటి పనులకి వాడు వ్యతిరేకం. అందుకని కుర్రాడు షాపుకేసి తిరిగివెళ్లాడు.

మూడుకోపెక్కుల కాసు రోడ్డుమీద కనబడలేదు. మళ్లీ వెనక్కితిరిగి వీథిలోకి వెళ్లిపోవాలనుకున్నాడు కుర్రాడు. కాని సరిగ్గా ఆ వేళకి గాలి రైంయ్‌మని కొట్టింది, ఇహ వాన ఎంతలా బాదిందంటే, రోడ్డుమీద అస్ఫాల్టు కుతకుత ఉడుకుతూన్నట్టనిపించింది.

అసలే తడిముద్ద అయి వున్న కుర్రాడికి సహితం ఇది దుర్భరమైంది. కుర్రాడు షాపు గుమ్మం వసారాలో కెళ్లి, అక్కడ నించున్నాడు. హఠాత్తుగా వచ్చిన ఆ గాలివాన వెలిసేవరకూ అక్కడ వుండేందుకే నిశ్చయించుకున్నాడు.

షాపులోకి పరుగెత్తుకొని వచ్చేవాళ్లకి తను అడ్డుగా వుండకూడదని కుర్రాడు ఇరుగ్గా వున్న ఆ వసారాలో గోడకి జేర్లపడి నించున్నాడు. జడివాననుంచి తలదాచుకుందుకు షాపులోకి జనం తొందరతొందరగా పరుగెత్తుతూ వస్తున్నారు.

ఒక్క మనిషి మాత్రం ఏ హడావడీ పడడంలేదు. ఆ స్త్రీ ఎంత వలంగా వుండాలో అంత వలంగా వుంద న్నమాట. కుళ్లాయి వున్న పారదర్శకమైన రెయిన్‌కోటు తొడుక్కుంది. ఆమె లోపలికి వచ్చి వసారాలో నించుందేమో, ఆమె విగ్రహంతోనే నిండిపోయింది ఆ ఇరుకు వసారా అంతానూ. ఆమె ఇస్సు అస్సు అనుకుంటూ బిగ్గరగా రొజుకుంటూంది. ఆమె చేతిలో రంగురంగుల ప్లాస్టిక్ పట్టీలతో అల్లిన సంచి వుంది. సంచినిండుగా వస్తువులు దిట్టంగా కుక్కేసున్నాయి. వసారా సరంబీకున్న దీపపు వెలుగులో ఆ ప్లాస్టిక్ పట్టీలు సరదాగా మిలమిల్లాడాయి. సంచిలో అన్నిటికంటెనూ పైనున్న కట్ట ఉల్లికోళ్ల పచ్చని జీవంజీవక పక్షి తోకయీకల్లా అల్లల్లాడాయి. ఆ పక్కనుండి ఆదరాబాదరా వెళ్తూన్న మనుషులు ఆ సంచిని తోసేసుకుంటూ, ఈ తోకయీకల్ని రాసుకుపోయారు. మరి తడిసిన ఉల్లికోళ్లేమో ఆ కుర్రాడి పంట్లాన్ని రాసుకున్నాయి.

సంచి యజమానురాలు ఉబ్బెత్తుగా పొంగిన తన పెద్ద మొగాన్ని కుర్రాడివైపు తిప్పింది. ఆమె కళ్లు బాతుకళ్లల్లా ఎర్రగా వున్నాయి.

''ఎందుకు వున్నావు ఇక్కడ?'' అని ఆమె కుర్రాణ్ణి అడిగింది. ఆ మాటలను ఆమె ఎంత తొందర తొందరగా పలికిందంటే, ఎదుటవాడికి: ''ఎందుక్నావిక్డ'' అని వినబడి, వాడికసలు అర్థమే కాలేదు. ''ఎందుక్నావిక్డ?'' అని ఆమె మళ్లీ రెట్టించి అడిగి, అల్లికసంచి పిడులని అప్రయత్నంగా తన చేతితో గట్టిగా పట్టుకుంది. ''నీ కిక్కడ ఏం పనిరా? ఎందుకు నిలబడ్డావురా ఇక్కడ?'' అని గదమాయించింది కుర్రాణ్ణి.

''మీ కెందు కా భోగట్టా?'' అన్నాడు కుర్రాడు.

''ఎరుగుదున్రా మీలాటి వాళ్లనీ!'' అంది ఆ రంగురంగుల సంచి యజమానురాలు భారంగా ఊపిరితీస్తూ. ''జేబులు కాటేసే రకం!''

కుర్రాణ్ణి తీవ్రక్రోధం జిల్లుమని వణికించింది, గడ్డకట్టుకుపోతూన్న నీటిలా అది పారదర్శకంగా వుంది. వాడు కేక లెయ్యలేదు, కళ్లు పెద్దవిచేయలేదు.

వాడు క్షణమాత్రం మౌనంగా వుండిపోయి, ఆ బాతుకళ్ల కనుపాపల్లోకి సూటిగా చూస్తూ స్పష్టంగా అన్నాడు:

''ఆడ ఏనుగు! పిప్పళ్ల బస్తా!''

అలా అనేసి, ఇహ ముందూ వెనకా చూసుకోకుండా షాపులోనుంచి చెంగున బయటికి గెంతేశాడు. తలుపు దఢీలున మూసుకుపోగా అక్కడే ఆగిపోయిన ఉక్కిరిబిక్కిరి కేకను విన్నాడు. ఇహ వెనక్కితిరిగి చూడకుండా విసురుగా చేతులు ఇటూ అటూ వూపుకొంటూ పరుగెత్తాడు – తనకి భయంవేసి కాదు, కన్నీళ్లు గొంతుకలో సలసల మరిగిపోతున్నాయని పరుగెత్తాడు.

ఆ కుర్రాణ్ణి ఇప్పుడు కూడా వర్షం స్తిమితపరచింది. ఆతరువాత వర్షం కూడా స్తిమితపడింది. ఇహ నింపాదిగానూ నిదానంగానూ కురవడం మొదలెట్టింది.

కుర్రాడు మెల్లమెల్లగా అలా పరుగెత్తుతూనే వున్నాడు. పరుగెత్తి పరుగెత్తి చిట్టచివరికి చేహోవ్ వీధీ, పావ్‌లిక్ మొరోజొవ్ వీధీ కలిసే మూలను ఆగాడు. అక్కడ వుంది ట్రామ్‌స్టాపు. కుర్రాడు ఇంటికెళ్ళి పోడానికే నిశ్చయించుకున్నాడు. టిక్కెట్టు లేకుంటే, టిక్కెట్టు లేకుండానే మరి. తనగురించి యింట్లో ఆందోళన పడుతూంటారనీ, తనకోసం కనిపెట్టుకుంటారనీ, ఈవేళ ఇంకా ఎన్నైనా చికాకులుంటాయనీ వాడికి తెలుసును, కాని దీనిగురించి అలసటతోనూ నిర్లిప్తతతోనూ తలపోశాడు.

అక్కడ ఆగి, ట్రాముకోసం నించున్నాడు.

అక్కడికొచ్చాయి రకరకాల ట్రాములు: ఖడఖడమంటూ ఊగిపోతూ తూగిపోతూన్న పాతవీ, ఆటోమేటిక్ తలుపులూ వెండి గొంతుక గంటలూ వున్న కొత్తవీనూ. అన్నీ వచ్చాయి, కాని తనక్కావలసిన నంబరు ట్రామ్ రాలేదు.

పెద్దపెద్ద గుండ్రని చినుకులు దబాదబా పడుతున్నాయి, పడుతున్నాయి, అలా పడుతూనే వున్నాయి....

తటాలున చినుకులు దబదబపడడం మానేశాయి. ఆస్ఫాల్టుమీద నృత్యంచేశాయి, చెట్ల ఆకులవెంట జలజల రాలాయి, కాని కుర్రాడిమీద మాత్రం పడలేదు.

కుర్రాడు తలపైకెత్తి చూశాడు. తన తలకు ఎగువను నల్లని గొడుగులు రెండు ఒకదానితో ఒకటి కలిసిపోయి, తనమీద చినుకులు పడకుండా చేస్తున్నాయి.

ఇదేమిటి? ఆ గొడుగులకిందనుండి బయటికి వచ్చేయాలనుకుని, కోపంతో ముందుకు అడుగేయబోయాడు. కాని ఆగిపోయాడు. గొంతుక ఒకటి వాడికి వినబడింది:

“నువ్వు చప్పగా తడిసిపోయావోయ్!”

ఇది ఆడపిల్ల గొంతుక. ఆమె ఆ మాటల్లోనుండి వ్యంగ్యమైన చిరునవ్వును తొణికించినట్టు అనిపించింది కుర్రాడికి. తన పిడికిళ్ళని తడిసిపోయి తన పంట్లాము జేబుల్లోకి దూనిపి, చర్రున వెనిక్కితిరిగాడు.

వెనక నించునున్నారు ఇద్దరు. ఆ గొడుగులు పట్టుకుని నించున్నవాళ్ళు వీళ్ళే. ఒక మొగాయనా, ఒక అమ్మాయీ. వాళ్ళ మొగాలు సరిగా కనబడ్డంలేదు. వీథిదీపం వెలుగు ఆ అమ్మాయి జుట్టును రవంత మాత్రం తాకి, తలవెంట్రుకల కింద అణగారిపోయింది. మొగాయన పూర్తిగా నీడలో వున్నాడు. పొడుగ్గా వున్నాడు, నలుపు సూటు వేసుకున్నాడు. మితభాషిలా వున్నాడు.

“నానిపోయున్నావే!” అంది ఆ అమ్మాయి మళ్ళీ మరొకసారి.

“నిజంగానే?” అన్నాడు కుర్రాడు క్రోధంతో. “మరి, నే నేమో అసలు పొడిగా వున్నాననుకున్నానే.”

అమ్మాయి చిన్న నవ్వు నవ్వింది.

“నీ కలా అనిపించింది. ఇంతకీ నువ్వు అసలు తడిముద్ద అయిపోయున్నావు – గుంటలో మునిగిపోయిన కోడిపిల్లలా.”

ఏమైనాసరే ఆ అమ్మాయికి ఏదో ఘాటుగానూ పెంకెగానూ వెంటనే జవాబుచెప్పి తీరాలనిపించింది కుర్రాడికి. కాని వాడికంటే ముందే మాట్లాడాడు ఆ మొగాయన.

''లేనా, నా తల్లీ! ఇహ చాలించు!'' అన్నాడాయన, మెల్లగా బొంగురు గొంతుకతో.

ఈ మనిషి ముఖంలో నిజంగా చేవ వుంటుందనీ, ముఖం కొద్దిగా అలసిపోయి వుంటుందనీ దానిమీద కఠినమైన నిశితమైన తిన్నని చాళ్ళు వుంటాయనీ కుర్రవాడు తలపోశాడు.

''దయవుంచి ఇహ చాలించు'' అన్నాడాయన. ''నీ ఆరాధకులతో నువ్వీ రకంగా మాట్లాడితే, నిజం చెబుతున్నాను, నా సానుభూతి వాళ్లమీదే వుంటుంది.''

''ఆరాధకుడట!'' అంది అమ్మాయి బుసకొడుతూనూ.

కుర్రాడు మెల్లగా, కాని నిష్కర్షగా అంగలు వేసుకుంటూ గొడుగుకిందనుంచి బయటికి వెళ్లిపోయాడు.

''ఉత్త పుణ్యానికే వర్షంలో కెళ్తున్నావ్!'' అన్నాడు ఆ అపరిచిత వ్యక్తి వెళ్లిపోతూన్న కుర్రాడి వెనుకనుంచి.

''వర్షం పడడం నా తప్పుకాదు'' అని కుర్రాడు జవాబుచెప్పాడు.

''అయితే నిజమేకావచ్చు.... కాని నువ్విప్పుడు తడిసి నీళ్లుకారుతున్నావు ఉత్త పుణ్యానికే. లేకుంటే ఎవరిమీదనో కసితీర్చుకుందుకనా?''

''అయితే అవుతుంది!''

''నీ ఇష్టం'' అని ఆయన నిట్టూర్చాడు.

''నిజమే'' అన్నాడు కుర్రాడు.

''నాన్నా, ఆ అబ్బాయి జోలికెళ్లకు!'' అంది అమ్మాయి, తను జోక్యం కలుగజేసుకుని. ''కరవగలడు!''

ఆ అమ్మాయిది సహనంలేని స్వభావమని స్పష్టంగా తెలిసిపోతూనే వుంది.

ఇంతవరకూ ట్రాము జాడే కనబడలేదు....

కుర్రాడి షర్టు తడిసి వొంటికి అంటుకుపోయి, మైనపుగుడ్డలా మెరుస్తూంది. ఆ షర్టుమీద వాన చినుకులు టపటపమంటూ పడుతున్నాయి.

''నేను ఎన్నాళ్లనుంచో ఇంటికి రాలేదా మరి, నేనింకా వర్షానికి అలవాటుపడడంలేదు'' అన్నాడా అమ్మాయి తండ్రి. ''నాది పొరపాటే కావచ్చు, కాని నా ఉద్దేశంలో అలా వర్షంలో నించుని తడవడం ఏమంత సరదా కల్గించే వ్యవహారం కాదనుకుంటాను.''

''ఎంతకీ రావడంలేదూ ట్రాము'' అనుకున్నాడు కుర్రాడు, ''ఇంటికి నడిచివెళ్లిపోవడమే నయమనుకుంటాను.'' అలా అనుకుని కుర్రాడు అక్కడనుంచి వెళ్లిపోయాడు.

''ఆగవోయ్!'' అనే మాట కుర్రాడి చెవినిబడింది. ఇంతకీ ఆ రాపు గొంతుక స్తిమితపరచేదిగా వుంది. ''గొడుగు తీసుకో. అసలు ఒక గొడుగు చాలు మా యిద్దరికీనీ. దాన్ని వాపసుచేయక్కర్లేదులే.''

''తన ఔదార్యాన్ని నాదగ్గిర చూపించాలనుకుంటున్నాడు కాంసు!'' అని తలపోశాడు కుర్రాడు.

అలా తలపోసి అన్నాడు:

''గొడుగు నా కవసరంలేదు. దానికింద తలదాచుకుందుకైతే మాత్రం నాకవసరంలేదు.''

ఆఖరి మాటలు, మరదేమిటో గాని, నోరు జారి వచ్చేశాయి. కాని అందుకు కుర్రాడేమీ విచారించలేదు.

ఆ మాటలు అనేసి, జవాబుకోసం ఆగాడు. కాని తండ్రీ, కూతురూ ఇద్దరూ మౌనంగా వుండిపోయారు. ఒకవేళ వాళ్ళు ఆశ్చర్యపడ్డారేమో?

ఇహిప్పుడు నొక్కిచెప్పడంకోసం అడిగాడు కుర్రాడు:

''గొడుగుల అవసరం కేవలం వర్షంనుంచి తలదాచుకుందుకే అని మీరనుకుంటున్నారేమో?''

''లేదు, మేమలా అనుకోవడంలేదు'' అన్నాడాయన అతిగంభీరంగా. ''మాటవరసకి, గొడుగుతో, ఇంటి కప్పుమీదనుంచి మంచి చక్కగా జంప్‌చేయొచ్చు.... లేదంటే, దానిలోనుంచి పుల్లలు వూడదీయొచ్చు....''

''పిడి కొక్కెంలా వంపుతిరిగి వుంటే, దానితో ఎవడినేనా కాలుపట్టుకుని లాగొచ్చు'' అంది ఆ అమ్మాయి కూడా అంత గంభీరంగానూ. ''అందుకది మంచి అనువుగా వుంటుంది.''

ఇహ ఇద్దరూ నవ్వారు, మెల్లగానూ, అదేమిటో గాని పిసరంతైనా కోపం తెప్పించేటట్టుగా లేకుండానూ. కుర్రాడికి ఏమీ తలవంపులనిపించలేదు, అసలు కోపమే తెచ్చుకోలేదు. అయినప్పటికీ పాత కోపమూ భంగపాటూ వాణ్ణి పట్టుకుని వదల్లేదు.

''మీరు నవ్వుతున్నారు కదూ, నవ్వండి'' అని ఓ మాట విసిరాడు. ''నేను తడుస్తాననే మీకు విచారం. గొడుగు మీకు మళ్ళీ ఇవ్వనేమో అని మీకు విచారం లేదు. నేను తడవడం మీ కిష్టంలేదు....''

''పిసరంత కూడా లేదు'' అని లేనా వంతపలికింది.

''ఇంక దేనికిచ్చినా విచారపడి వుందురు మీరు?''

''మేం విచారపడడానికి నీకంటె తక్కువవాడికి ఇస్తే అనా?'' అన్నాడు ఆ అమ్మాయి తండ్రి.

''నేనన్నది అది కాదు'' అన్నాడు కుర్రాడు ముఖం చిట్లించి. ''నేనన్నది మనుషులను గురించి కాదు, ఇంకెందుకోసమైనా అని.... సరే, మీకిష్టమైతే నక్షత్రాలను చిత్రిస్తాను! ఇష్టమేనా?''

ఇలా అవుతుందని కుర్రాడు ఎంతమాత్రమూ అనుకోలేదు. వాళ్ళు ఇష్టమే అన్నారు. సంగతేమిటో వాళ్ళు వెంటనే గ్రహించేశారు.

కుర్రాడు మొదట్లో నిశ్చయించుకున్నాడు, వాళ్ళకి తనమీద వూరికేనే విచారంకల్గిందని.

''అదిగో, మీ ట్రామ్ వస్తుంది!'' అన్నాడు వాడు. కుర్రాడు పీథినే పరీక్షచేశాడు. ఇప్పుడు, పొడిగా వున్నట్టీ, తేటగా వెలుగుతూన్న ఎలెక్ట్రిక్ దీపాలున్నట్టీ ట్రాముకోసం అమ్మాయీ తండ్రీ తొందరపడతారని కుర్రాడు పూర్తిగా నమ్మాడు.

''ఇది ఆఖరిది కాదు....'' అన్నాడాయన.

''బడ్డీకొట్టు దగ్గరకెళ్దాం'' అని అమ్మాయి ప్రతిపాదించింది. ''అక్కడ దీపంవెలుగుంది.... మరైతేనూ, నీకు అన్ని తారాగణాలూ తెలుసునేమిటి?''

''వుత్త ['చంటిపిల్ల!'' అనుకున్నాడు కుర్రాడు. కాదేమో ఒకవేళ, అనాలోచితంగా అనేసిందేమో, మరి గుసగుసగా అంది కూడానూ. ఏమంటే తండ్రి ఆక్షేపించాడు:

"అదేమిటే అలా అడుగుతావూ! నేడో రేపో పెళ్లికూతురు కాబోతుందది!"

"నాన్నా!"

"ఏమిటి 'నాన్నా'! 'నేడో రేపో' అని అన్నానుగా!"

ఖాళీగా వున్న బడ్డీకొట్టు మూసేసి వుంది, అందులో దీపం మంచి కాంతితో వెలుగుతూంది. బడ్డీ కొట్టులోపల వున్న దిసమొల ప్లాస్టిక్ బేబీబొమ్మలు దారంట వచ్చేపోయే జనంకేసి గాజుగోడల్లోనుంచి వెకిలిగా తేరిచూస్తున్నాయి.

కుర్రాడు తన కొత్త పరిచయస్థులకేసి ఇక్కడ నిదానంగా చూశాడు. ఆయన ముఖంలో నిజంగానే చేవ వుంది, కఠినమైన చాళ్లున్నాయి, పెదవుల కొలకుల దగ్గర పెద్దపెద్ద ముడుతలున్నాయి. కొద్దిగా పరిచయమున్న ముఖంలా అవుపించింది. ఇహ ఆ అమ్మాయి — వ్లదివొస్తోక్ నగరానికి వెళ్లిన తమ పియోనీర్ దళం లీడర్ లూసీలా వుంది.

కుర్రాడు గొడుగును గోడకి ఆన్చాడు. అమ్మాయీ, ఆమె తండ్రీ కుర్రాడి వెనుక నించుని, వాడిమీద చినుకు పడకుండా వుండేటట్టుగా రెండో గొడుగు పట్టుకున్నారు.

కుర్రాడు జేబులోనుంచి సుద్దముక్క తీశాడు.

"అవసరంలేదు" అంటూ ఆయన కుర్రాణ్ణి ఆపి, తన మడత చాకు వాడికి అందిచ్చాడు. "సుద్ద చెరిగి పోతుంది. వెలుగులో కనబడదు కూడానూ. ఇదిగో, ఆ చాకులో వుంది దబ్బనం. దాంతో కన్నాలు పొడువు...."

దీపాలతో వెలిగిపోతూన్న ట్రాములు ఖణఖణ ధ్వనులను గాలిలోకి తేలగొట్టుతూ అక్కడనుండి వెళ్లి పోయాయి. వాటి సద్దు చీకటి వీధుల్లో మణగిపోయింది. ఆ చుట్టుపక్కల తుళ్లుతూన్న వర్షం హోరుమని రొద చేస్తూంది, ఫెళఫెళ చప్పుడు చేస్తూంది. అపస్వరంతో పాడినప్పటికీ ఉల్లాసంతో పాడిన పాటలా ఈ రొదా చప్పుళ్లు మంచి సరదాగానే వున్నాయి.

సన్నని కిరణంలా మిణుకుమిణుకుమని ప్రకాశించుతూన్న దబ్బనంతో ఆ కుర్రాడు నల్లని ఆకాశంపైన నక్షత్రాలను పొడుస్తున్నాడు.

దారంట వచ్చేపోయే జనం అప్పుడప్పుడు ఆ పక్కను ఆగేవారు. ఇం చుమించు కొత్త గొడుక్కి కన్నాలు పొడుస్తూన్న ఆ ముగ్గురు వెర్రివాళ్లని చూసి విస్తుపోయేవారు.

ఆ అమ్మాయి తన తండ్రి వెనకాల నుంచుని తారాగణాల పేర్లు అప్పుడు గుసగుస గొంతుకతో అంటూండేది:

"మృగశిర.... అవును.... అలాగే వుంటుంది.... ఉత్తరాభాద్ర...."

"మరి, ఈ గొడుగుని నీతో తీసుకెళ్తావా?" అని అమ్మాయి గుసగుస గొంతుకతో తండ్రిని అడిగింది.

"ఆఁ" అన్నాడాయన.

వాళ్ల మాటలు కుర్రాడికి అర్థంకాలేదు, కాని అడగడానికి సందేహించాడు. దబ్బనంతో తన పని చేసుకుంటూ ఉత్తినే అన్నాడు:

"ఇంతకీ సుద్దే నయం, దబ్బనంతో గొడుక్కి ఎలా కన్నాలు పడిపోతున్నాయో చూశారా మరి?"

"ఏం బాధలేదు" అన్నాడాయన. "నేను వెళ్లేచోట వర్షం పడదు."

''బహుశ, అది ఎడారి'' అని కుర్రాడు అనుకున్నాడు. మరి, తను సరిగా ఊహించి పోల్చుకున్నాడో లేదో తెలుసుకుందుకని కుర్రాడు అడిగాడు:

''అది దక్షిణాన కదండీ?''

''అందుకు సందేహమేమిటి! అంతకంటె దక్షిణమే లేదు.''

''అక్కడ వర్షం వుండదు'' అనుకున్నాడు కుర్రాడు సంతోషంతో. ''అనగా, ఆయన కేవలం నా నక్షత్రాలకోసమనే గొడుగు తీసుకెళ్తాడు.'' అలా అనుకునేసరికి కుర్రాడికి మరీ సంతోషం కల్గింది. ఇహ ఈ సాయంకాలం జరిగినదాంట్లో మంచినంతా జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అవును దాంట్లో మంచి కూడా వుంది: కొద్దిగా పరిచయమున్న అమ్మాయి, బూట్లులోతొడుక్కుని నవ్వొస్తున్న చిన్నపిల్లాడు.... ఇహ వీళ్లిద్దరూ....

కాని, ఆందోళనకరమైన ఆలోచన ఒకటి పుట్టుకొచ్చింది.

''దక్షిణాన రాత్రిళ్లు చిట్టచీకటిగా వుంటాయే. ఆ చిట్టచీకటిలో కన్నాలు కనబడవే. ఈ కన్నాల్లోనుంచి ఆకాశానికి వెలుగు రాదే!'' అన్నాడు.

''వస్తుంది'' అని జవాబుచెప్పాడు ఆయన. ''అక్కడ, నేను వెళ్తున్న చోట రాత్రులు అతి వెలుగ్గా వుంటాయి.''

''చిత్రంగా వుందే!'' అనుకున్నాడు కుర్రాడు. కాని ఇంకా ప్రశ్నలు వేయడానికి బిడియపడ్డాడు. అంతేకాదు, పదునైనట్టీ హేళనచేసేటట్టీ ఆ అమ్మాయి నోటి ఎదుట తన జిజ్ఞాసను ఇంకా ప్రదర్శించేందుకు కుర్రాడు ఇష్టపడలేదు.

''ఇప్పుడు మీకంతా బోధపరుస్తాను'' అన్నాడు కుర్రాడు, తన పని పూర్తి అయిపోవడంచేత. ''ఇదంతా సులభమే. గొడుగు కర్రని ధ్రువతార దిశగా పట్టుకోవాలి....''

''సరేలే'' అన్నాడు మెల్లగా ఆ అమ్మాయి తండ్రి. ''బోధపరడచం అవసరంలేదు. ఈ మెకానిజమ్ నాకు అర్థమైంది.''

కుర్రాడు తబ్బిబ్బుపడి వౌనందాల్చాడు. వాడు నమ్మలేకపోయాడు, నిజానికి ఈ మనిషికి అసలు ఏమీ అర్థంకాలేదనీ నిశ్చయంచేసుకున్నాడు.

''ఇది సులువే'' అని కుర్రాడు తటపటాయించుతూ అన్నాడు. ''ముఖ్యమైన విషయం ధ్రువతార ఎక్కడుంటుందో జ్ఞాపకం పెట్టుకోవడం....''

''నాకు తెలుసునోయ్, చిట్టిబ్బాయ్!'' అన్నాడా వింత మనిషి. ''నాకు తెలుసునోయ్!'' అన్నాడు మళ్లీ మరోమాటు. ''అదికాదు సంగతి. చెప్పవచ్చేదేమిటంటే, నువ్వు ఎన్నో విషయాలను లెక్కలోకి తీసుకోలేదు.''

''ఏమిటి లెక్కలోకి తీసుకోలేదు?'' అని గాభరాపడుతూ అడిగాడు కుర్రాడు. తనను ''చిట్టిబ్బాయి'' అన్నందుకు అవమానమనిపించి కోపం తెచ్చుకోవడం ఆ గాభరాలో మరచిపోయాడు.

''ఆకాశం ఉన్నదే – మహా గమ్మత్తు అయినదీ క్లిష్టమైనదీ అనుకో. నువ్వు చూశావో లేదో మరి, నక్షత్రాల స్థానం ఇరవైనాలుగు గంటల్లోనూ ఆ యా వేళలమీదనే కాకుండా, సంవత్సరంలో ఆ యా కాలాల మీద కూడా ఆధారపడి మారుతూంటుంది. నువ్వు వేసిన చిత్రంలో నక్షత్రాల పరస్పర సంబంధాలు ఏమంత

కచ్చితంగా లేవు. ధ్రువతార ఆకాశంలో సరిగ్గా ఎక్కడుండాలో నీకు కచ్చితంగా జ్ఞాపకం వుంటుందంటావా?.. ఆకాశపటాన్ని తెలుసుకున్నంత మాత్రాన చాలదు, ఆకాశాన్ని తెలుసుకోవాలి."

"అనగా, ఇదంతా ఎందుకూ పనికిరాదన్నమాట...." అన్నాడు కుర్రాడు, తన ఆశాభంగాన్ని కంఠస్వరంలో వ్యక్తపరుస్తూ. "అయితే మరి అలాంటప్పుడు మీరు ఎందుకు...."

"అబ్బే, పనికిరాకపోవడం కాదు" అన్నాడు ఆ అపరిచితుడు. "ఏది యేమైనప్పటికీ, నువ్వు మాత్రం భలే కుర్రాడివిలే! నీ పొరపాట్లవల్ల నాకేమీ బాధకలగదు సుమా.... ఇంతకీ, అక్కడ అంతా వొక్కటే, అక్కడ ధ్రువతార వుండదు."

"ఆ 'అక్కడ' ఎక్కడుంది?" అని ఆ మాటను ఆశ్చర్యంతో ఉచ్చరించుతూ అడిగాడు కుర్రాడు.

"అంటార్కిటిక్ ఖండంలో."

....కుర్రాడు మౌనంగా వుండిపోయాడు. అదేమంత స్వల్పవిషయంకాదే. ఇలాంటి మనిషిని కలుసుకున్నప్పుడు, దీనిగురించి ఎంతైనా చెప్పొచ్చు. అంటార్కిటిక్కి వెళ్ళిపోతాడు. భూమి అవతల కొసకి. కేవలం ఇతర నక్షత్రాలున్న చోటకి. దక్షిణ ముకుటం వున్న చోటకి. మరి, మనుషులకక్కడ ధ్రువతార అవుపడనే అవుపడదు!

"మీరు.... వేళాకోళం చెయ్యడంలేదు కద?"

"లేదు" అన్నాడు అంటార్కిటిక్కి వెళ్ళిపోనున్న మనిషి. "అవును మరి, ఇది వేళాకోళంలాగానే కనబడొచ్చేమో: కన్నాలు పొడిచిన గొడుగు పట్టికెళ్ళడం. కాని అక్కడుండే.... తెలిసింది కదూ, ఇదక్కడ ఇంపుగానే వుంటుంది — దీన్ని చప్పున తెరుస్తాను, తెరిచేసరికల్లా మన ఉత్తరాకాశపు తారాగణాలు కనబడతాయి. తమాషాకి కాదు, నిజంగానే అంటున్నాను. ఇంతకీ, ఇవి అచ్చంగా నక్షత్రాల్లాగే వున్నాయిసుమా!"

"నీచేతిలో మంచి నేర్పుందోయ్!" అంది అమ్మాయి.

అసలు విషయం గురించి వెంటనే అడగడానికి సంకోచించాడు కుర్రాడు.

"మీకు కోపం రాదంటే, మిమ్మల్ని ఒకటి అడగాలనుంది" అన్నాడు కుర్రాడు. "అడగమంటారా? మరేంలేదు.... మీ పేరు అడగొచ్చునాండీ?"

"ఏమిటీ కఠిన విచారణ?" అన్నాడాయన కొంటెగా చిరునవ్వు నవ్వుతూనూ. "ఎందుకడక్కూడదులే...."

అలా అని ఆయన తన పేరు చెప్పాడు.

"అయ్యో!" అన్నాడు కుర్రాడు గుసగుస గొంతుకతో. ఆ "అయ్యో"లో వెటకారం గాని, అవమానంవల్ల కలిగే కోపం గాని లేదు. దానిలో వున్నది కేవలం ఆశ్చర్యమూ, తత్తరపాటు చిరునవ్వూ. ఆ పేరు తనకి తెలిసినదే.

కాని తను ఆ పేరు కచ్చితంగా ఎక్కడ విన్నాడో, ఎప్పుడు విన్నాడో మాత్రం వాడికి జ్ఞాపకం రావడంలేదు. ఇంతకీ పేరు మాత్రం జ్ఞాపకం వుంది. ఈ వ్యక్తి పేరు కుర్రాడి స్మృతిపథంలో వాడికి అత్యంత ప్రియతమమైన వాటితో — సుదూరాన్నున్న ద్వీపసముదాయాలను గురించిన పుస్తకాలతో, అర్థంకాని అందమైన పేర్లుగల సముద్రపు తుపానులతో, నక్షత్రాలయొక్కా, భూమియొక్కా రహస్యాలతో మిళితమైపోయింది. సగం మరపున

పడిపోయినట్టే, అయినప్పటికీ చక్కని పాటలోని మాటల్లా ఆ పేరు తనను అనేకులు జ్ఞాపకం వుంచుకునేటట్టు చేసింది. ఎన్నడూ చూడనట్టి ఏదైనా ఒకదానిని చక్కగా జ్ఞాపకం వుంచుకోవచ్చు, దానిని స్పష్టంగా ఊహించుకోవచ్చు కూడా. దానియందు తీవ్రమైన కోరిక వున్నట్టయితే, దానిని చూడవచ్చు కూడా: భూమధ్యరేఖా సముద్రాల నిశ్చల తరంగాలలో వెండిలా మెరిసిపోతూ ఎగురుతూన్న చేపల గుంపును; మనస్సును కలవరపరచే మోహినీ* ఆక్రందనల ప్రతిధ్వనులు అనేక పర్యాయాలు మారుమోగుతూ పొగమబ్బులతో నిండిన లోయలున్న ఫ్యోర్డ్‌లు; బాతీస్ఫియ్యర్ల** వెడల్పాటి వెలుగురేఖలచే చీల్చివేయబడుతూన్నట్టి మిలమిల్లాడే సముద్రపు లోతుల ముంచీకటి; నిటారు మంచు కొండలు సముద్రపు టొడ్డులనుండి మెల్లగా వేరుచేయబడి, అంతకంతకు ఉధృతమవుతూన్న ధ్వనులతో ఆకుపచ్చని మహాసముద్రాలలోకి తిరగదోయబడుతున్న స్థలాలలో సన్నని మంచుపొర పైపూత కల్గిన రిగ్గింగ్ సాధనాలను కల్గిన ఐస్ బ్రేకర్లూ, స్టీమర్లూ....

"నాకు అర్థమైంది.... మీరు కెప్టెన్ గారు" అన్నాడు కుర్రాడు మెల్లగా. అద్భుతమూ, కొద్దిగా గూఢమూ అయిన ఈ సన్నివేశం ఉదయింపజేసిన ఆనందం ఎక్కడ తొణికి చిందుతుందో అని తను భయపడినట్టుగా, ఆ కుర్రాడికి గట్టిగా మాట్లాడ బుద్ధికాలేదు. "మీరు కెప్టెన్...."

"దానికేమిటిలే" అన్నాడా అపరిచిత వ్యక్తి. "నువ్వన్నట్టే కావచ్చు. ఇంతకీ నేను కెప్టెన్నే."

"మీరు పెంగ్విన్ పక్షులను చూశారండీ?" అని అడిగాడు కుర్రాడు. అడిగి వెంటనే ఇహ వొళ్ళుతెలియనంతగా తబ్బిబ్బుపడిపోయాడు: అది పూర్తిగా చిన్నపిల్లాళ్ళు అడిగేప్రశ్న, ఆరోక్లాసు కుర్రవాడికి తగిన ప్రశ్న కాదు, ఏ పసిపిల్లాడి కోసమైతే తను గంధర్వగాథల్లో వర్ణించబడినట్టి నక్షత్రాలను చిత్రించాడో అలాంటి పసిపిల్లాడు అడగవలసిన ప్రశ్న అది.

కెప్టెన్ చిరునవ్వు నవ్వాడు.

"వాటికి నీ శుభాకాంక్షలను అందజేస్తానులే. అవి తప్పకుండా సంతోషించుతాయి. లేకుంటే, ఇదిగో: ఓ జత పెంగ్విన్ పిల్లలనే తీసుకొచ్చి నీ కిస్తే మంచిది కాదూ? ఏం, ఆ పని చేయమంటావా ఏమిటి?"

ఇలా హాస్యంచేసినందుకు కుర్రాడు ఏమీ కోపంతెచ్చుకోలేదు. ఎరుపు పంజాలపై డాబుసరిగా గునగున ఊగుతూ తూగుతూ నడుస్తూ, చూస్తేనే నవ్వుపుట్టుకొచ్చే పెంగ్విన్ పిల్లల్ని కుర్రాడు ఊహించుకుని నవ్వడం మొదలుపెట్టాడు. కెప్టెన్ కూడా నవ్వాడు. అమ్మాయి కూడా నవ్వింది.

ట్రామ్‌స్టాపుకి అవతల భవనం పక్కనున్న చీకటి మలుపున వెలుగు అవుపడింది, భవనపు కిటికీలు తళుక్కుమనడం మొదలెట్టాయి, ఆకుపచ్చని అగ్నికణాలను వెదజల్లింది ట్రాము. అక్కడ అవుపించినది ఇటు ఆకుపచ్చ బల్బూ అటు ఎరుపురంగు బల్బూ వున్న సాక్షాత్తూ పదిహేనో నంబరు ట్రామే. దానికోసమే కెప్టెన్ కనిపెట్టుకున్నాడు.

---

*మోహినులు — నావికులను ప్రమాదకరములైన స్థలాల్లోకి తమ నావలను నడిపించేటట్టు ఆకర్షించేటట్టి గంధర్వగాథల్లోని జీవులు. — సం.

**బాతీస్ఫియర్ — ఈ పరికరాల్లో అన్వేషకులు సముద్ర నిమ్నాల్లోకి దిగుతారు. — సం.

''ఇంకొక్క నిమిషమే వ్యవధి'' అనుకున్నాడు కుర్రాడు.

ఏమో, రెండు నిమిషాల వ్యవధి కూడా వుండొచ్చు, ట్రామ్ గనుక ట్రాఫిక్‌సిగ్నల్ దీపందగ్గర ఆగిపోతే.

ట్రామ్ ఆగలేదు.

కుర్రాడి సంతోషం చల్లారిపోలేదు. దాని తీక్ష్ణత విచారఛాయితో మిళితమై కొద్దిగా తగ్గింది. గదిలో దీపంపైన ఆకుపచ్చని లాంపుషేడ్ పెట్టినప్పుడు కాంతి ఇలాగే తగ్గుతుంది.

''ఇహ అంతా సరి'' అన్నాడు కెప్టెన్‌వైపు చూసి కుర్రాడు గుసగుస గొంతుకతో. కుర్రాడు అనాలనుకున్నాడు: ''ఇదిగో మీ ట్రామ్ వచ్చిందండీ!'' అని. కాని అది మరీ పెద్ద వాక్యమైపోయింది.

''అవును'' అని కెప్టెన్ జవాబుచెప్పాడు. కుర్రాడికి తన ఎడమ బుజం క్షణమాత్రం బరువెక్కినట్టు అనిపించింది: తన బుజాన్ని కెప్టెన్ అరచేతితో తాకాడు.

''నీకు కావాలంటే, నీకోసం.... మరంటే, ఆ వొడ్డునుండి నల్ల రాయి ఒకటి పట్టుకురమ్మన్నావా ఏమిటి? అచ్చమైన అంటార్కిటిక్ రాయి. ఆ ఖండం సోవనీర్లతో తులతూగుతూందని చెప్పడానికి వీల్లేదు.''

ఇది వేళాకోళానికి అన్నమాట కాదు.

''తప్పకుండా తీసుకురండి!'' అన్నాడు కుర్రాడు బిగ్గరగా.

''నువ్వు మరచిపోవు కద? నేను మళ్లీ ఆరు నెల్లలో వచ్చేస్తాను.''

''నేను మరచిపోవడమే?'' అన్నాడు కుర్రాడు.

''అయితే విను, నా చిరునామా....''

''అక్కర్లేదు!'' అన్నాడు కుర్రాడు ఇంచుమించు భయపడిపోయి.

ఇంత సులువైన విధంగా ఆయన చిరునామా తెలుసుకోవడం కుర్రాడికి మనస్కరించలేదు. ఆరు నెలలలో తనంతట తనే ఎంత కష్టపడైనా సరే ఆ చిరునామా తెలుసుకోగల్గుతాడు. అదే నయం. తను తప్పకుండా తెలుసుకోగల్గుతాడు. ఇటువంటి వ్యక్తిని వెతికి పట్టుకో లేకపోవడం ఎక్కడైనా వుంటుందా?!

ట్రామ్ వచ్చింది, ఒక్కమాట బుసకొట్టి తలుపులు తెరచింది.

''చూస్తున్నారుగా, నేనే మిమ్మల్ని వెతికి పట్టుకుంటాను!'' అన్నాడు ఆదరాబాదరా కుర్రాడు.

''నాకు తెలుసు. నక్షత్రాలు ఇచ్చినందుకు ధన్యవాదాలు!'' అన్నాడు కెప్టెన్.

అమ్మాయిని కెప్టెన్ ముందు ట్రామ్ ఎక్కనిచ్చి, తరువాత తను ఎక్కాడు.

''ఇదిగో, దీన్ని తీసుకో!'' అని అమ్మాయి తటాలున కేకేసి, తన గొడుగు — తారాగణాలు లేని తన గొడుగు — తండ్రి బుజంపైనుండి అందించింది కుర్రాడికి. ''తీసుకో! ఇంతకీ ట్రామ్‌స్టాప్ పక్కనే మా యిల్లు'' అంది అమ్మాయి.

''తీసుకోవోయ్!'' అంటూ కెప్టెన్ తల వూపాడు.

''ఎందుకూ? ఇంతకీ నేనప్పుడే ఎలాగూ తడిసిన కోడిపిల్లలా వున్నానుగా'' అన్నాడు కుర్రాడు. అలా అన్నాడో లేనేలేదో, ఆ అమ్మాయి వేళాకోళాన్ని తను మరచిపోలేదే అని ఆమె ఎక్కడ అనుకుంటుందో అని

తటాలున వాడికి భయం పట్టుకుంది. "వాన అసలు వెచ్చగా వుంది" అన్నాడు కుర్రాడు వివరణగా, "అదేమీ చెయ్యదు."

ధడధడమంటూ ట్రామ్‌తలుపు తన రెక్కలను మూసేసుకుందుకు సిద్ధపడింది.

"నీ పేరేమిటి?" అని కేకేశాడు కెప్టెన్.

"స్లావ" అని కుర్రాడు జవాబుచెప్పి, తళతళ మెరుస్తున్న అస్ఫాల్టు రోడ్డుమీద అంగలు వేసుకుంటూ యింటికెళ్ళిపోయాడు.

వర్షం పెద్దపెద్ద వెచ్చని చినుకులను ఆ కుర్రాడిమీద చిందించింది — ప్రతి చినుకు కూడా ఒక వెలుగు రవ్వను తనతో తీసుకొచ్చింది. నక్షత్రాలతో చిమ్మి వున్న మబ్బులేని రాత్రి ఆకాశంనుండి, అక్కడనుండే, ఆ ఊర్ధ్వంనుండే, ప్రతి వొక్క చినుకూ తనతో ఒక్కొక్క చిన్న నక్షత్రాన్ని తీసుకొచ్చినట్టే అనిపించింది.

స్లావ నడుస్తూ, నక్షత్ర బిందువులను తన పెదవులతో అందుకుని తనలో తను నవ్వుకున్నాడు.

Sydney Bowen



